# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపఁబడిన

## శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

స చి త్ర ము

మూ డ వ భా గ ము




సంపాదకుఁడు

విద్యా భూషణ

ఉపన్యాసక రత్న — కవితా విశారద

ధ న కు ధ ర ం వ ర దా చా ర్యు లు



ప్రకాశకులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథ మాల

శ్రీ లక్ష్మీ నారాయణ పురము

గుంటూరు - 6

మొదటి ముద్రణము
దుందుభి - తొలి ఏకాదశి
జులై 1982
శ్రీ రామానుజ శకము ౯౩౫

మూల్యము :
ఇరువది రూపాయలు

ముద్రణ
1-76 రత్నా ఆర్టు ప్రింటర్సు
77-176 } శ్రీపతి ఆర్టు ప్రింటర్సు
౧ - ౧౬ } గుంటూరు.

శ్రీ రామానుజ కీర్తి కౌముది

# సమాలోచన సమితి

---

మహా కవి – వాచస్పతి - కళా ప్రపూర్ణ

డాక్టర్ : వానమామలై వరదాచార్యులు

చిన్నూరు

మహా కవి - సరస్వతీ పుత్ర – కళా ప్రపూర్ణ – పద్మశ్రీ

డాక్టర్ , పుట్టపర్తి నారాయణాచార్యులు

క డ ప

వ్యాకరణ విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ

శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M A

విశాఖ పట్టణము

సాహిత్య రత్న - భాషా ప్రవీణ

శ్రీమాన్ కె టి. యల్ నరసింహాచార్యులు

శ్రీ గోదా గ్రంథమాలా సంపాదకులు

ముసునూరు

సంగీత సాహిత్య కళా నిధి

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

ఆకాశ వాణి – నిలయ సంగీత విద్వాంసులు

వి జ య వా డ

౨

బాల విద్వత్కవి

శ్రీమాన్ కె. వి. వి. యల్. నరసింహాచార్యులు, M. A, B. L.

అడ్వొకేటు - గుంటూరు.

చతుర్విధ కవితా చతురానన - మహా కవి

శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు

కలికివాయ

భాషా ప్రవీణ - విద్వాన్ - లలిత కవి

శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులు

కందుకూరు తాలూకా రచయితల సంఘాధ్యక్షులు

సీనియర్ తెలుగు పండితులు - Z. P. హైస్కూలు

కందుకూరు

న్యాయ విద్యా ప్రవీణ

డాక్టర్. యస్. బి. రఘునాధాచార్యులు, M.A, Ph. D.

సంస్కృత శాఖ, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము

కోఆర్డినేటర్, పబ్లికేషన్సు, తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

సాహిత్య విద్యా ప్రవీణ

శ్రీమాన్ చెలమచెర్ల వేంకట శేషాచార్యులు

సంస్కృతోపన్యాసకులు

శ్రీ వేంకటేశ్వర వివేక వర్ధినీ సంస్కృత కళాశాల

హైదరాబాదు

శ్రీమాన్ చిలకపాటి విజయ రాఘవాచార్యులు
M A (Pol), M A (Pub - Adm), D I S
లెక్చరర్ - ఆంధ్ర ప్రదేశ్ రెసిడెన్షియల్ కాలేజి
నాగార్జున సాగర్ - విజయ పురి సౌత్

శ్రీమాన్ శ్రీ పెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, M A.
ఉపన్యాసకులు :- శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్య కళాశాల
పాలెమ్

కవి కోకిల - విద్వ త్కవి - కావ్య కళా నిధి
శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి సభ్యులు
సిద్ధిపేట



# శ్రీ రామానుజ కీర్తి కౌముది - మొదటి భాగము

సంపాదకులు :

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

ప్రకాశకులు

తిరుమల తిరుపతి దేవస్థానములు - తిరుపతి



## సప్తగిరి సమీక్ష

సమీక్షకులు

డాక్టర్ యస్ బి రఘునాథాచార్యులు, తిరుపతి

* * *

ఇపుడు సమీక్షింపబడుతున్న పుస్తకం శ్రీ వైష్ణవ సిద్ధాంతాలను, వాఙ్మయాన్ని, సంప్రదాయాలను పరామర్శించే చక్కని వ్యాస సంకలనం దీని పేరు శ్రీ రామానుజ కీర్తి కౌముది. ఎంతో అనురూప మైనది. ఈ కార్య క్రమాన్ని చే పట్టిన వారు శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారు పీరు ఎన్నో మత - సాంస్కృతిక గ్రంథాలను రచించి, ఆంధ్ర దేశంలో మంచి రచయితలుగ ప్రసిద్ధి నందిన వారు పీరి ఉద్యమం ఆంధ్రులచే అభినందింప దగినది ఇది మొదటి భాగం దీనిని పరిశీలిస్తే, ఇందలి వ్యాసాలను సంపాదించడంలో శ్రీ ఆచార్యులవారు ఎంతో శ్రమపడినా రని చెప్పక తప్పదు వ్యాస కర్త లందరు తమ తమ పరిధులకు తగినట్లు వ్యాసాలను తయారు చేశారు తిరుమల తిరుపతి దేవస్థానాలవారు ఇటువంటి ప్రచురణలను ప్రోత్సహించడం ప్రశంసనీయం.

## 1. శ్రీనివాసోదాహరణము

శ్రీ 'కరుణశ్రీ'

కమ్మని కవితకు మారు పేరు కరుణశ్రీ కరుణశ్రీ కవితా మాధుర్యానికి ఈ శ్రీనివాసోదాహరణం చక్కని ఉదాహరణం వారు గుండెలో ముంచి అర్పించిన ఈ కానుక, వారి గుండెలోని మంచికి మంచి నిదర్శనం

## 2. హిందూ సనాతన వేదమత వైభవము

శ్రీమాన్ గొట్టుముక్కల రమాకాంతాచార్యులు

సనాతన ధర్మాన్ని, ఆ యా కాలాలలో దానిలో వచ్చిన మార్పులను చక్కగ ఆకళించుకొన్నవారిలో శ్రీ ఆచార్యులవారు అగ్రగణ్యులు. ప్రపత్తి వైభవాన్ని, పాంచరాత్ర సిద్ధాంత వైశిష్ట్యాన్ని గ్రహింపగోరువారికీ వ్యాసం కర దీపిక వలె సహాయపడగలదు.

## 3. భువన సుందర మూర్తి

శ్రీమాన్ మేడేపల్లి వరాహ నరసింహస్వామి

'పరబ్రహ్మ భువన సుందర మూర్తి ఆయన సౌందర్యమే సృష్టికి బీజం' అని నిరూపించే ఈ వ్యాసంలో సౌందర్య స్వరూపం విపులీకరింపబడింది. శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత పరంగా ఇట్లు నిరూపణం సాగించిన శ్రీ స్వామివారు అభినందనీయులు

## 4. శ్రీవైష్ణవ మతము - తత్త్వ విశిష్ట్యము

శ్రీమాన్ వేదాంతం జగన్నాథాచార్యులు

శ్రీవైష్ణవ మత స్వరూపాన్ని అనేక కోణములనుండి సమీక్షించి, యోగ మార్గముల విశ్లేషించి, అష్టాంగ యోగ మార్గముల

వింగడించి, భక్తి ప్రపత్తులే ముక్తి సాధనము లను శ్రీ రామానుజాచార్య సిద్ధాంతమును ఈ వ్యాసమున నిరూపించిన శ్రీ ఆచార్యుల వారు మనకు శ్లాఘనీయులు

## 5. శ్రీ పాంచరాత్ర మత వైభవము

శ్రీమాన్ పొడిచేటి శ్రీరంగాచార్యులు

పొడిచేటివారు పాంచరాత్రంలో మేటి విద్వాంసులు. భద్రాచలం కేంద్రంగా శ్రీ పొడిచేటి సీతారామాచార్యులవారు పాంచరాత్ర సంహితలను కొన్నింటిని ప్రచురించి ఎంతో సేవ చేశారు వారి సోదరులే ప్రకృత వ్యాస కర్త శ్రీరంగాచార్యులవారు శ్రీ పాంచరాత్ర శాస్త్రోదయాన్ని, దాని స్వరూపాన్ని, ప్రయోజనాన్ని ఈ వ్యాసంలో చక్కగ నిరూపించినారు దేవాలయాలు ధార్మిక దుర్గా లెలా అయినాయో హృద్యంగా వీరు ప్రతిపాదించారు ఇందలి విషయ సేకరణ శ్రమతో కూడినది. పాంచరాత్రికులు వీరి కెంతో ఋణపడి ఉన్నారు.

## 6 భక్తి యోగ ప్రభావము

శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులు

'కవి గారు' అనే అన్వర్థ నామంతో ఆంధ్ర దేశంలోను, ఇతర రాష్ట్రాలలోను ప్రసిద్ధు లైన ఈ మహా మనీషి - హయగ్రీవ ప్రసాద పాత్రులు భక్తి యోగ ప్రభావాన్ని హృద్యా లైన పద్యాలలో శ్రుతి, స్మృతి, శాస్త్ర, భాగవత సూక్తులతో చక్కగ విశదపరచినారు శ్రీ ఆచార్యుల వారు ఇంతకంటె సరళ మైన తెనుగు కవితను మన మింకొక చోట చూడలేము.

రెండవ పద్య రచన యగు 'శ్రీ పాణ యోగి ప్రభావము'న, తిరుప్పాణాళ్వారుల అనన్య భక్తి ప్రభావ మతి మనోజ్ఞముగ అభివర్ణింపఁబడినది.

గద్య రచనలలో మొదటి దగు 'ఆళ్వారుల భక్తి తత్త్వము'న, పరమ భక్తాగ్రేసరు లగు పన్నిద్దరాళ్వారులు పయనించిన నవ విధ భక్తి మార్గములు నిరూపింపఁబడినవి.

రెండవది యగు 'దశ విధ వైష్ణవు' లను గద్య రచనలో వైష్ణవ లక్షణములు, వైష్ణవులలో తారతమ్యములు మొదలగునవి విపులముగాఁ దెలుపఁబడినవి

'ఆంధ్ర వాఙ్మయము - వైష్ణవ మత ప్రభావ' మను మూఁడవ గద్య రచనలో - ప్రాచీనము లగు ఆంధ్ర సాహిత్య గ్రంథములందు పొందు పఱుపఁబడిన విశిష్టాద్వైత సిద్ధాంత విశేషములు, వైష్ణవ క్షేత్ర తీర్థ దైవత మాహాత్మ్యములు, విష్ణువు నందును, విష్ణువు యొక్క అవతారములందును - ఆ యా కృతి కర్తలకు ప్రగాఢముగాఁ గల భక్తి ప్రపత్తులు మున్నగు విషయము లనేకములు విలక్షణముగా వివరింపఁబడినవి.

కావున, ఈ తదీయ కౌముదియు సహృదయు లగు సంప్రదాయ విదులకు, సాహిత్య ప్రియులకు మోద ప్రమోదములను చేకూర్చ గల దనియే సంభావించుచున్నాము

ఈ గ్రంథ ముద్రణమునకు ధన సహాయము గావించిన తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి మే మెంతయు కృతజ్ఞులము.

— ప్ర కా శ కు లు

# విషయానుక్రమణిక

శ్రీపాదరేణు మాహాత్మ్యము — చిన తిరుమలాచార్యుల రచనలు
చిన్నన్న రచనలు — శ్రీరంగ మాహాత్మ్యము
ఉత్తర రామాయణము — విష్ణు పురాణము
శ్రీమద్భాగవతము — వరాహ పురాణము
పద్మ పురాణోత్తర ఖండము — హరి భట్టు రననలు
భోజరాజీయము — విష్ణు మాయా విలాసము
ఆముక్తమాల్యద — మను చరిత్ర
పాండురంగ మహాత్మ్యము — రాధా మాదవము
తారక బ్రహ్మ రాజీయము — పింగళి సూరన రచనలు
వైజయంతీ విలాసము — విష్ణు పురాణము
మొల్ల రామాయణము — విప్ర నారాయణ చరిత్ర
లక్ష్మీ విలాసము — అర్థ పంచకము
ముక్తి చింతామణి — రఘునాథ నాయ కాభ్యుదయము
వాల్మీకి చరిత్ర — రఘునాథ నాయకాభ్యుదయము
విప్రనారాయణ చరిత్ర — విజయరాఘవుని ఇతర రచనలు
హేమాబ్జ నాయకా స్వయంవరము — మన్నారు దాస విలాసము
రాజ గోపాల విలాసము — జయ విజ యాభ్యుదము
అధ్యాత్మ రామాయణము — చారుచంద్రోదయము
శ్రీ వేంకటేశ్వర విజయ విలాసము — క్షేత్రయ్య పదములు
వేంకట నృసింహ కవి రచనలు — లక్ష్మణ కవి రచనలు
వత్స వాయ రచనలు — శహాజీ రచనలు
దేవకీ నందన శతకము — దాశరథి శతకము
నరసింహ శతకము — కలి వేల్పు శతకము

ఉపమాక వేంకటేశ్వర శతకము — సింహాద్రి నారసింహ శతకము

పశ్చిమ రంగ శతకము — రంగ ధామ శతకము

పంచాయుధ కల్లె — లక్ష్మీ విలాసము

పానకాల రాయని రచనలు — పాప రాజు రచనలు

దశావతార చరిత్ర — తేర పావన శతకము

భద్రాద్రి రామ శతకము — రాజగోపాల శతకము

కృష్ణ శతకము — పురుషోత్తమ కవి రచనలు

సంజీవ కవి రచనలు — కృష్ణ దాసు రచనలు

జానకీ పతి శతకము — కస్తూరి రంగ శతకము

కోన రాట్కవి రచనలు — నరసింహ శతకము

కృష్ణ కవి రచనలు — రమణప్ప కవి రచనలు

రమాధీశ్వర శతకము — రామ చంద్ర కవి రచనలు

త్యాగ రాజు రచనలు — పరిశిష్ట రచనలు



## 7 భక్తి తత్త్వము - వాఙ్మయము

ప్రొఫెసర్ యస్వీ జోగారావు

ఇగ మెఱిగిన యశస్వి ఆచార్య యస్వీ జోగారావు గారు. భాగవతం మొదలైన గ్రంథాలలో భక్తి తత్త్వం ఎలా ప్రతిపాదింపబడిందో నిరూపిస్తూ, భక్తి రసమే అని సమర్థిస్తూ, భారత దేశంలోని భక్తి వాఙ్మయాన్ని దివ్యంగా సమీక్షిస్తూ, సాహిత్య ప్రక్రియలైన పల్లకి సేవా ప్రబంధములను, హరి కథలను చక్కగ వివరించారు వీరి నిరూపణం ప్రశంసనీయం.

## 8 భాగవతము - భక్తి తత్త్వము

శ్రీ రాపూరి ప్రసన్న సత్యనారాయణ

శ్రీమ ద్భాగవత మెలా భక్తిని నిరూపిస్తున్నదో ఈ వ్యాసంలో విపులీకరింపబడినది భాగవత సాంగత్య ప్రభావాన్ని, భక్తికి సాధనాలను, అధికారులను, అనధికారులను, భక్తుని లక్షణాలను, నవ విధ భక్తులను ఎంతో చక్కగ నిర్వచించారు వీరి ప్రతిపాదనం ప్రశంసా పాత్రం

## 9. నారదుఁడు - భక్తి ప్రచారము

శ్రీ కేశవభట్ల సుదర్శన వేణు గోపాల మూర్తి

భక్తి సూత్ర వాఙ్మయంలో - నారద భక్తిసూత్రా లెంతో విశిష్టమైనవి ఈ వ్యాసంలో నారద ప్రశస్తి, ఆయన ప్రతిపాదించిన భక్తి స్వరూపం, ఆయన ప్రభావం ప్రశంసనీయ మైన పద్ధతిలో వివరింపబడినవి

## 10 భగవ న్నామ సంకీర్తన ప్రభావము

శ్రీ కల్లూరి చంద్రమౌళి

ఆర్ష వాఙ్మయాని కెంతో సేవ చేసి, ఆర్ష విద్యాలంకారులైన వారు శ్రీ చంద్రమౌళిగారు వా రీ వ్యాసంలో భగవ న్నామ వైభ

వాన్ని, ప్రభావాన్ని నిరూపిస్తూ, అష్టాంగ యోగాన్ని, శరీర విజ్ఞానాన్ని, పరబ్రహ్మ స్వరూపాన్నీ అందటికీ సులభంగా అర్థమయ్యేలా - ఎంతో సరళంగా విశదపరచారు వారు అభినందనార్హులు.

## 11 ప్రపత్తి ప్రాశస్త్యము

**డాక్టర్ కందాడ రంగాచార్యులు**

భగవద్గీత, బ్రహ్మ సూత్రములు, శ్రీమద్రామాయణం మొదలైన గ్రంథాలనుంచి ప్రపత్తి స్వరూపాన్ని చక్కగ ప్రతిపాదిస్తూ, శ్రీ ఆచార్యులవారు ఎన్నో ముఖ్యమైన విషయాలను తెలియజేశారు సంప్రదాయాభిజ్ఞులైన వీరి రచన ఎంతో చక్కగ సాగింది

## 12. తమిళ సంఘ సాహిత్యము - వైష్ణవ ధర్మ దర్శనము

**శ్రీమాన్ ధనుర్ధరం వరదాచార్యులు**

ఉభయ వేదాంతాలలో బాగా కృషి చేసి ఈ గ్రంథ సంపాదనకు పూనుకొన్నవారు శ్రీ వరదాచార్యులవారు ఈ వ్యాసంలో వీరు - తమిళ భాష పుట్టుక, పెఱుగుదల, సంఘ కాలము, అప్పటి ప్రకృతి పూజ, తమిళ దేశంలో వైష్ణవ ధర్మ వ్యాప్తి, వైష్ణవ ధర్మ ప్రాచీనత, ఆళ్వారుల భక్తి ప్రచారాలను గురించి సమగ్రంగా చర్చించారు ఎన్నో నూతనాంశా లీ వ్యాసంలో అవిష్కరింపబడ్డాయి

## 13 ఆళ్వారులు - భక్తి వాఙ్మయము

**శ్రీమాన్ రొంపిచర్ల పార్థసారథి భట్టాచార్యులు**

శ్రీ పార్థసారధి భట్టాచార్యులవారు మూడు దశాబ్దాల పైన శ్రీనివాసుని ఆస్థానంలో ఉండి, ఆయనను సేవించే భాగ్యం పొందిన వారు వీరు తమ వ్యాసంలో - నాలాయిర దివ్య ప్రబంధాన్ని గురించి,

దాని వ్యాఖ్యానాలను గురించి విపులంగా వివరించారు. ఆళ్వారుల అవతార, జీవిత, రచనా విశేషాలను విడి విడిగ తెలియజేసి, చివఱ శ్రీ ఆండాళ్ శ్రీసూక్తిని గూర్చి విస్తరంగా ప్రతిపాదించారు. వీరి విషయ సేకరణ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది

## 14 తిరుప్పావు

### శ్రీ దామెర రాజగోపాలరావు

ఆండాళ్ తమిళంలో రచించిన తిరుప్పావుకు సరళ విశద మైన తెలుగు అనువాదాన్ని చక్కగ సంతరించారు శ్రీ రాజగోపాలరావు గారు శ్రీవైష్ణవులకు తిరుప్పావు చాల ముఖ్య మైనది. దానిని తేట తెలుగులో ఆంధ్రుల కందించిన వారిలో శ్రీ రాజగోపాలరావుగారు అభినందనీయులు

## 15 గోదా స్తుతి

### శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

సర్వ తంత్ర స్వతంత్రులు శ్రీ వేదాంత దేశికులు వారు రచించిన గోదా స్తుతిని సంగీత సాహిత్య పారదృశ్వ లగు శ్రీ కృష్ణమాచార్యులవారు హృద్యా లైన పద్యాలలో తెలుగులోకి అనువదించారు ఎన్నో కవితా ఖండాలను వెలయించి, లబ్ధ ప్రతిష్ఠు లైన కవి శిరోమణులు వీరు వీరి కవిత సహజ మధురం. వీరి ప్రయత్నం ఎంతో ప్రశంసనీయం

## 16 శ్రీ వేంకటేశ్వర తారావళి

### శ్రీమాన్ కొండూరు రామానుజాచార్యులు

ఇరువదియేడు పద్యాలలో శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని కొనియాడినవారు శ్రీ రామానుజాచార్యులవారు ప్రతి పద్యము ఆర్తితో పాఠక హృదయాలను కదలింపజాలినది. వీరికి అభినందనలు



శ్రీనివాసాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# విజ్ఞాపనము



శ్రీ రామానుజ కీర్తి కౌముది - శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వముగా పదునాఱు భాగములలో - పదునాఱు కళలుగా వెలువడుచున్నట్లు, ఇంతము మున్నే విన్నవించి యున్నాము

మొదటి భాగము మా పర్యవేక్షణమున, తిరుమల తిరుపతి దేవస్థానముల పక్షమున వెలువడి, టి టి డి. సమాచార కేంద్రములలో నేఁటికిని లభ్య మగుచున్నది

రెండవ భాగమును మే మిటీవలనే వెలువరించి, పాఠక లోకమున కందించియున్నాము

అట్టి ప్రథమ - ద్వితీయ సంపుటములు రెండును - ఎంషిత ప్రశంసలకు పాత్రము లగుటచే, మే మెంతయు సంతసించుచు, ఇప్పు డీ మూఁడవ భాగమును వెలువరించి, ఆంధ్ర మహా జనుల హస్త పల్లవములలో శోభిల్లఁ జేయుచున్నాము

ఈ మూఁడవ సంపుటమున, సంప్రదాయ బద్ధము లగు అయిదు విశిష్ట రచనలు సమకూర్పబడినవి అట్టి వానిలో - రెండు పద్య రచనలు, మూఁడు గద్య రచనలు

మొదటి పద్య రచన యగు 'స్తుతి చందనము'న, శ్రీ వేంకటేశ్వర స్వామివారి కల్యాణ గుణ వైభవములు కమనీయముగ వర్ణింపఁబడినవి

# స్తుతి చందనము

భాషా ప్రవీణ

మధుర భారతి — కవిరాజ మౌళి

## శ్రీ చింతలపాటి నరసింహ దీక్షిత శర్మ



శ్రీమంతం బగు ముద్దు మోము - దయ నుత్సేకింప కందోయి - లీ
లా ముగ్ధమ్ము శుభ స్వరూపము - సమాహ్లాదంబు కల్పింప, ను
ద్ధామ శ్రీయుత సప్త శైల విలస త్ప్రాసాద సంవాసివై
లేముల్ తూల్చెదు, సిద్ధమా నెనరు కల్మిన్ శ్రీనివాస ప్రభూ!

చతు రామ్నాయ రస ప్రసారము భవత్ చారిత్ర, మత్యంత వి
శ్రుత సర్వోపనిష ద్రహస్య కలనా శుద్ధాంత కాంతా శిరో
గత ముక్తా మణి నీదు నామము, జగత్ కల్యాణ కందంబు ని
వితతాంఘ్రి ద్వయ సేవ, సప్తధరణీ భృద్రాజ శృంగేశ్వరా!

లలిత స్వర్ణ విభూషణావళి, తటి ల్లావణ్య రేఖన్ వెలుం
గులు చిందన్, లస దింద్ర గోప రుచి సొల్పుల్ గూర్చి రత్న ప్రభల్
జలద స్వామి విధాన, నివు కరుణా సారమ్ము నర్పించి, స
త్ఫల సంపత్తి ఘటింతు దాస తతికిన్ పద్మావతీ వల్లభా!

పారావారమునన్, ఫణీశ్వర మహా పర్యంక సీమన్, శుభా
కార శ్రీ విలసిల్లు నీవు, కలి దౌర్గత్యమ్ముఁ దూలింప, శృం
గార స్ఫూర్తిని సప్త శైల శిఖరాగ్రమ్మందుఁ గొలుఁండ, చ
క్షూ రాజీవ యుగంబు నిన్నుఁ గని పొంగున్ వేంకటేశ ప్రభూ!

శతధా నీ గుణ సంచయమ్ము కవితా చాతుర్య ధుర్యుండనై
స్తుతి గావించి మెఱుంగు వెట్టి, యెదొ మెచ్చుం గాంచ నూహించుతన్
శ్రిత కల్ప ద్రుమ! చందన ద్రవమునన్ శీతాంశు శుభ్రత్వ భా
సితుం జేయన్ గమకించుటే యగును లే శ్రీ శేష శైలాధిపా!

భవ దాస్యామృత భాను నిస్సృత సుధా పాకమ్ము, లోక ప్రగణ్యా
నవ సౌభాగ్య ఫల ప్రదమ్ము, నవ రత్న స్నిగ్ధ యుష్మత్ శిర
స్స్రవణీయాచ్ఛ కిరీట భాస్కర విరాజ ద్రోచి చైతన్య నై
భవ సంవాదక మౌను, వేంకట గిరి ప్రాసాద గర్భ స్థితా!

బలభి ద్రత్నమొ, శక్ర చాప కలితాభ్రంబో, సువర్ణాచలో
జ్జ్వల శృంగంబో, కళిందజా లహరికా సందోహమో యంచు నీ
లలితాకారము చూచి సందియమునం గ్లాన్ — నిశ్చయార్థంబు నా
కు లభించెన్, భవ దంఘ్రి పద్మ మెద నిగ్గున్ నింప శ్రీ వల్లభా!

నీ కారుణ్య కటాక్ష లక్షిత బుధాళి స్ఫుర స్వాంతర
న్యాకీర్ణం బగు మౌక్తికాళి, గృహ భృత్యావాద లాభాభ ని
ద్గా కెంపుం దన మానం, గేళి శుకము ల్త ద్గాఢిమా విజ సం
కా కోవన్ గ్రసియింపం జూచు శుభ సంగా! వేంకటాద్రీశ్వరా!

పురుషార్థమ్ముల కాది మూలము భవ త్పూజా విశేషమ్ము, త
ద్వర పూజా విభవమ్ము పూర్వ సుకృత ప్రాచుర్య సంపత్తిం జే
కురు, నా పుణ్య విభూతి తావక దయా కూలంకషా ప్రోచ్చలత్
ఝురి మున్కల్ గొను వాని కొక్కనికె వశ్య మ్మిందిరా మందిరా!

సరసీజ ప్రమది మాను భావము సరో జాతాది రేఖా నిక
స్వరమా, నీ కర మందు భాస్వర నివస్య త్కాంతి పుంజైక బం
ధురమై వెల్గు సుదర్శనమ్ము నవ దీప్తుల్ చిల్కుచున్, సర్వదా
దురిత వ్రాత మడంచుగాత - గుణ సింధూ! సింధు కన్యాధవా!

నీ వంభోజము భంగి, తోయ ధర ము న్నీ లీల - సూర్యాకృతిన్
ని వక్షమ్మునం గౌస్తుభమ్ము, మఱియు న్నీ కౌస్తుభ మ్మా రవి
శ్రీ వెల్గొంది జగ ద్వితానములకున్ జీవమ్ముం జేకూర్చు, రా
జీవాక్ష! శ్రిత భక్తి రక్షణ కళా శ్రీ ధూర్వహా ప్రాభవా!

భవదీయ శ్రవణావతంస ఘటిత ప్రత్యగ్ర మాణిక్యముల్
నవ కాంతుల్ వెద చల్లఁ గన్గొని యమంద ప్రేమ, మ చ్చిత్త కీ
ర వరాగ్రేసర మౌళి, దాడిమ ఫల భ్రాంతిన్ సదా త ద్రుచి
ప్రసణాస్త్రై యితరమ్ము నే మఱచె నౌరా ! వేంకటాద్రీశ్వరా !

ఏలాపోల్లస దంబు జాతి వికసత్ కంజాత స త్సౌషమా
గ్ర్యము ధిక్కారము సేయఁ జాలు భవదీయాంఘ్రి ద్వయిన్, భక్తి మ
స్త్రానన్ నిల్పిన వాని జన్మమె కదా సాఫల్యముం గాంచు, నో
కమలా మానవతీ మనః కమల భృంగా ! యుల్లస న్మంగళా !

'వెంకన్నా' యని తెల్గువారు నిను నావిర్భూత భ క్త్యుద్ధతిన్
తెంకిన్గాఁ గొలువంగ, సంస్కృత బుధుల్ శ్రీ వేంకటేశాఖ్యతో
కైంకర్య మ్మొనరింత్రు - కా రెవరు ని కారుణ్య పాత్రమ్ము ? నా
పంక మ్మింకఁగఁ జేయు మన్న ! శుభ సంపన్నా ! కృపాద్రీశ్వరా !

'వరి ము ల్లంత మహానుభావుఁ' డనుచున్ వర్ణించు నామ్నాయముల్
వర దాన ప్రథితాభయ ప్రద భవ త్పాణి ద్వయాంభోరుహ
స్ఫురణమ్ముల్, సకలేప్సితార్థములఁ గూర్చున్, భీతి విక్రాంతి పై
ఖరులన్ బట్టి వలాయ్చు, సప్త గిరి శృంగ జ్యోతి రుద్యన్మణీ !

నవ సౌవర్ణ మణీ రుచి స్థగిత నానా భూషణాళిన్ దృగు
త్సవమున్ గూర్చు జగ న్మనోహర భవ ద్ధన్యాకృతిం గాంచి, ము
క్తి వధూటీ పరిరంభ సంభవ సుఖాప్తిం జొక్కి, విజ్ఞుల్ పురా
భవ సంస్కార విభూతి మెత్తు దను వొప్పన్ శేష శైల ప్రభూ !

ఆకాశంబును దాకు కొండ తుద, నీ వానంద రూపంబుతో
శ్రీ కైవల్య పదంబవై వెలుఁగ, మా చేత స్సరోజాత పా
ళీ కాంక్షాతతి గట్టు నెక్క. నిది నీ లీలా కటాక్ష ప్రభా
సాకల్యమ్మున లభ్యమౌ నిజము శేష క్ష్మాధరాధీశ్వరా !

మకరందం బతి మాధురీ మహిత మా మారంద సారైక వి
చిక కన్నన్ సుధ తీయగా చవుల వాసిం గాంచు, న ద్రాప తీ
షికి హెచ్చై సుకవీంద్రు వాణి కడు తృప్తిం గాంచు, ని స్తార సా
ర కథా మాధురి దాని మించు, రుచి సారా! వేంకటాద్రీశ్వరా!

నత దౌర్గత్య తమోహరమ్ము, జగ దానందైక కదమ్ము, సం
స్మృతికిన్ గౌరవ భద్ర పీఠము, యశ శ్శ్రీ స్వర్ణ ధామమ్ము, ని
ర్వృతి లీలా సదనమ్ము, నీ చరణ నీరేజాత యుగ్మమ్ము, దు
ష్కృత దూరీ కరణైక సాధక మగున్ శ్రీ వేంకటేశప్రభూ!

నిను సేవించినఁ గల్గు మానవులకున్ నిర్వేల సాహిత్య మో
హన లాలిత్య, యశ, శ్చిరాయు, రధికౌదాత్త్య, స్ఫుర త్సాహితీ
ధన, సామ్రాజ్య సుఖానుభోగ లలనా దాక్షిణ్య లీలా వినూ
తన సౌభాగ్య పరంపరల్, కరి గికీంద్ర స్వర్ణ పీఠాధిపా!

విలస ద్భక్తి లతల్ చిగుర్చ హరి! గోవిందా! విభూ! యేడు కొం
డల వాఁడా! మము చేదుకొమ్ము కియిదండన్ గూర్చుమో 'వడ్డి కా
సుల తేఁడా!' యని నిచ్చలున్ శుభ వచస్సుల్ మీఱ, సోపాన పం
క్తులపైఁ గాల్నడ నేగుదెంచెదరు భక్తుల్ సప్త శైలేశ్వరా!

రాకాశీత మయూఖ చంద్రికల సారంబుల్ ప్రవర్షించు నా
లోకంబుల్ భవదీయముల్, చలువ వెల్గుల్ బల్కుచుం - భక్త పా
ళీ కష్టాతప జృంభణం బణఁగె - నౌలే నీ తలంపుల్ సుధా
శ్రీ కంబుల్, శుభ చందన ద్రవ ఝురుల్ శేషాచలాధీశ్వరా!

లలిత స్వర్ణ పటమ్ము క్రొమ్మెఱుఁగు లీలన్ వెల్గు లీలన్ - సము
జ్జ్వల భూషా మణు లింద్ర చాప రుచులన్ భాసిల్లఁ గారుణ్య పూ
ర లస న్నవ్య కటాక్ష వృష్టి సుధలన్ - రక్షింతు లోకం, బనా
విలసం విస్మయ రూప! హాస్తి ధరణీ భృ న్మౌళి నీలాంబుదా!

చిలుకల్ నిచ్చలు పచ్చ నిగ్గుల సిరుల్ చేకొంటయున్ రాజ హం
సలు మేల్వెన్నెల వన్నె నేలఁ గల క్రౌంజాయల్ సదా పూని వ
ర్తిలుటల్, నెమ్మలు చిత్ర వర్ణ సుషమా శ్రీ నొందుటల్ నీ విలా
స లస త్ప్రౌఢ సమైంద్రజాలికత - శేష క్ష్మాధ్ర హర్మ్యేశ్వరా!

కాలాభీల కఠోర దంష్ట్రికలు నొక్కన్ జిక్కి శైల స్థితిన్
వీలుం జాలును లేని సంసృతి మహాబ్ధిం గూలి యల్లాడు మా
యా లోకంబుల, నీ కటాక్ష రుచి నత్యంతంబు సారించి, జా
గేలా నేలఁగ! శేష శైల శిఖరాధీశా! సుధీశార్చితా!

పురుషార్థుం దల దన్నఁ జాలెదు మహా భోగమ్ములన్ గొంట ద
బ్బర, నిత్యార్చన భంగి నిన్ను దనువుం భాగ్యమ్ము లేకున్న, ము
ష్కరతా కొందఱు, పౌరుషాప్త మని వాచా శూరతన్ జాటుకొం
దురు తాత్కాలిక భోగు లబ్ధి మది చిందు ల్వేటు సర్వాధిపా!

సుషమా రంజిత భావనా మయ సుధా స్రోతస్సు చేతస్సుగన్
విషయాంధ్యావృతి ప్రీలఁ, ద్విజన కళావిఖ్యాతి వెల్గన్ రమా
ఝుష నేత్రా కలికించితాంచిత రసేక్ష న్నించుమీ - సాహితీ
కమణాంత స్సరసీజ పీఠిక నుమః కల్యాణముల్ శ్రీ పతీ!

వాణీ భవ్య కటీ తటీ ఘటిత దివ్య న్మేఖలా కింకిణీ
క్వాణంబుల్ నినదించు, నీ స్తుతి కథా కల్యాణ భా క్సత్కవీ
డ్వాణీ హేలను - వేద సంతతులు నీ శ్వాస ప్రసాదంబులై
రాణింపన్, గొఱతన్ ఘటిల్లునె పదార్థ శ్రీ! వృషా ద్రీశ్వరా!

ధనమో, సద్గుణమో, బలమ్మొ, ఫలమో, దాక్షిణ్యమో, యేదో పె
త్తనమున్ గూర్చఁగదా మనుష్యున! సద్భావిన్ సదా నిల్పఁ జూ
చిన, నీ కోమల పాద పద్మ యుగళ శ్రీ సేవ ముఖ్యమ్ము - మా
న్య నవ ప్రాభవ లీల గూర్చు నది - శేషాహార్య మౌళీశ్వరా!

మఖముల్ చేసిరో, సర్వదా యుపనిషత్ మార్గమ్ములం ద్రొక్కిరో
శిక్షలన్ దిసిరొ, జంగమముల్ వదలిరో, శ్రీ సూక్తముల్ పల్కిరో
సుఖముల్ గాంచ వశంబె! నీ శుభ గుణ స్తోత్రంబు లేకన్, దయా
నిధివౌ నీ ఘన రూప మెంతు - వృషభ ద్మాభృత్ శిరో రత్నమా!

ఆధారంబవు సర్వ లోకముల కీ వాద్యుండవు సృష్టికిన్
వేదోద్దండంబులన్ మనోహర కళా విస్ఫూర్తులన్ గూర్చు వి
శ్వాధీశుండవు, దైన్య నర్తనము మాయం జేయు మా సత్కృపా
శ్రీ సౌరంధరి వేంగ వేంకట గిరి శ్రీ హేతు లీలా కృతీ!

కమనీయంబగు కంకణావళుల సింగారిల్లు నీ పాణి ప
ద్మమునన్ రాజిలు పాంచజన్యము సుశబ్ద ప్రౌఢి చేకూర్చి, యు
త్తమ సాహిత్య కళా గురుత్వ పదవీ ధన్యాత్ముగా గావించు ని
క్కము - నిన్ డెందమునందు నమ్మినది వెంకన్నా! దయా సన్నుతా!

కనులారన్ నిను గాంచవలయున్, కల్యాణ కృత్, త్వత్పదా
ర్చన చేయన్వలె జన్మ సార్థకతకై, సన్ముక్తి సంపత్తికై
నిను జేరన్వలె - మాట లేమిటికి సంద్రీ! నీ శుభాకారమే
కను విందై వెలుగొందు శేష నగ శృంగ స్వర్ణ నిక్షేపమా!

ప్రాత ర్భాను మయూఖ రేఖ మెఱుగుల్ సంబంగారు రంగుల్, మధు
స్నాతా లీచ్ఛటతో రహో విషయముల్ చర్చించు వేళన్ దిశా
ప్రాసం బల్లన లేత నవ్వు వెలుగుల్ వర్షించు కాలాన, జిం
తా తిత్త్వమ్ముగ దొరంగి చూతు నినున్ గన్నుల్ వృషాద్రీశ్వరా!

దికుటంతంబులు నిండి, తావక యశః కాంతుల్ మహా విత్త నా
యక బృందంబుల మేలుకొల్పి, యఖిల లోకార్థంబులన్ లోకర
క్షకునై పిండునటే! యదే సము, మూజ స్థాపన ప్రౌఢ దే
వేశా లక్షణ మంచు మెచ్చవలయున్ శ్రీ శ్రీనివాస ప్రభూ!

అతివేలాఘ పరంపరాహరణ ధుర్యంబై సిరుల్ పంచు నీ
స్తుతి చేయన్ దొరకొన్న యంతటనె యేదో సౌఖ్య గాఢద్య ప
ద్ధతి, కింకరమ్మునకు బాధ మూను, నది మోద శ్రీ రసోద్ధత్యమో!
కృప విద్యా విభవమ్మొ! యే మని ప్రసంగింతున్ వృషాద్రీశ్వరా!

భారద్వాజుఁడు నీ పదార్చనల సప్తర్షీంద్రులం దొక్కఁడై
తారా వీథి నలంకరించె నని దివ్య ద్యోతి నా క్రించు, ని
న్నారాధించిన యోగి యుత్తమ పద ప్రాప్తిన్ ధ్రువ జ్యోతియై
మీఱున్ - సత్త గిరీంద్ర శృంగమున భూమీ ప్రోల్లస చ్చందనా!

ఉదయోద్రేకపు తావకీన ముఖమున్ దర్ధ్య ప్రతిపంద్రుడంబు న
వ్య దయా సారము చిందు నీ కనుగవన్ వ్యాపించినన్, లోక స
మ్మద సంధాయకమై వెలుంగు లికు నీ మంజు స్మితహాసమ్ము - స
ర్వ దిగంత ప్రథమాన కీర్తి సుమసారా! వేంకటాద్రీశ్వరా!

పాణి ద్వంద్వ వినమ్ర భక్త తతిపై బంగారు వర్షించు నా
మోద ప్రౌఢము, నీ దయేక్షణ సుధా పూరమ్ము, క్షీరాబ్ధి క
న్యా దృ క్మండల మండనాయిత మనన్య ప్రాప్య సాహిత్య లీ
లా దర్పమ్మది - యుగ్గడింప వశ మౌనా! హస్తి శైలాధిపా!

గంగా జన్మ పదమ్ము నీ పదము, సత్కల్యాణ సారమ్ము లు
ప్పొంగం జేయుట యేమి వింత! త్రిజగత్ పుణ్యమ్ము పండించి, యు
త్తుంగ ప్రాభవ మిచ్చు నంచు శ్రుతి సూక్తుల్ నచ్చిరః కోటి ప
ట్టంగాఁ జాలదె రూఢి! హస్తి నగ రంగ త్తుంగ శృంగాలయా!

కాలోన్మీలిత మాలతీ మధుర సౌగంధ్యాను బంధమ్ము, ది
గ్జాలా కల్పము నీ గుణోచ్చయము వాగ్జాలమ్మున న్నిల్పి, నూ
త్నాలంకార మలంకరించుకొనిన ట్లానంద బృందావనీ
హేలన్ దేలు మహా కవీంద్రుఁడు ప్రఫుల్లేందీవర శ్యామలా!

నీ కల్యాణ గుణంబు లెన్ని యని వర్ణింపన్ సహస్రాక్షుడన్
లోకేశాంగనయున్ బృహస్పతియు సోలన్ జాల రెన్నావ రే
... స్తోత్రైః చరిష్ణుం డల్ప తర నా గ్గర్వాతిరేకుండ, ప్ర
జ్ఞాతిశయ కల్ప విహీనుఁ డోపు నెటు శేష క్ష్మాధరాధీశ్వరా !

ఈ ... బఠించిలోఁ బొదువ రమ్యంబై సనాలంకృతి
ప్రశస్తానాని గొన్న మాదిరి భవత్ శ్రీ సద్గుణ స్తోత్రక
... ప్రాపక పూర్తి పూతః, వచో లాలిత్య, మాధుర్య త్వ...
ప్రాశస్త్య ములకెంచ నక్షయం. శేషాహార్య రత్నేశ్వరా !

సరంగ ఫి 'స్తుతి చందనమ్ము', మృదు వాచా సార కర్పూర మే
దుర, మత్యుత్తము భావ సంపముద సంస్తుత్యమ్ము, విద్వత్కవీ
శ్వర సంశ్నమ్మయి, నీ మనోహర తనూ చర్చాస్పదమ్మైన వి
స్ఫురణప్రిదెస లంటు మామక యశస్సుల్ శేషశైలేశ్వరా !

* * *

శ్రీ రాచి గ్రంథరంబు - భాగవత రాజీ శేముషీ దుగ్ధ కూ
పారాభ్యున్నతి హేతుకంబు - రస సంపన్నోక్తి రత్నంబు లే
వారన్, విజ్ఞ చకోర వారముల కాహ్లాదంబు సంధించుచున్
'శ్రీ రామానుజ కీర్తి కౌముది' కళా శ్రీరంగమై వెల్గుతన్ !



శ్రీ భగవ ద్రామానుజులు



శ్రీ భగవ ద్రామానుజులు

శ్రీ భగవ ద్రామానుజులు

# ఆళ్వారుల భక్తి తత్త్వము


విద్యా భూషణ - కవితా విశారద

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు


★

## భగవద్భక్తి వైశిష్ట్యము

"యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుస్తరమ్
తత్సర్వం తపసా ప్రాప్తం తపో హి దురతిక్రమః"

వేనిని తరించుటయు, పొందుటయు, ప్రవేశించుటయు, నిర్వహించుటయు కష్టమో - అసాధ్యమో - అవి యన్నియును తపస్సుచేత సాధ్యములగు ననియు, తపశ్శక్తి నేదియును అతిక్రమింపఁజాలదనియు మనుస్మృతి ప్రబోధించుచున్నది. అయినను, ఆ రీతిగా తపస్సు చేయువారికంటెను - ఆత్మజ్ఞానము తప్ప, తక్కిన జ్ఞానము గలవారికంటెను - కేవలము ప్రతిఫలాపేక్షతో కర్మల నాచరించువారికంటెను యోగి గొప్పవాఁ డనియు, అట్టి యోగు లందఱి యందును భగవంతుని శ్రద్ధతో భజించువాఁడు యోగ్యుఁ డనియు భగవద్గీత నొక్కి నక్కాణించుచున్నది.[1] తదనుగుణముగా ఆళ్వారులు పరమ యోగు లయ్యును - భగవద్భక్తిలో పరాకాష్ఠ నందుకొనఁగల్గిన కారణము వలననే పరమ భక్తాగ్రేసరులుగా పరిగణింపఁబడుచున్నారు. అంతియ కాదు - ఆ మహనీయులకు మఱి యొక రెవ్వరును సాటి రాఁజాలరు గనుకనే వారు 'ఆళ్వారులు' అను అన్వర్థ నామముతో వ్యవహరింపఁబడుచున్నారనియు మనము సంభావింపవచ్చును.

ఆళ్వారుల భక్తి తత్త్వము అనన్యాదృశమైనది. వారు భక్తి ప్రభావమును వేనోళ్ళ కొనియాడి యున్నారు. భక్తి సిద్ధాంతముపై వారు వెలువరించిన యభిప్రాయము లన్నియు - వారి దివ్య ప్రబంధము

లందే స్పష్టముగ కానవచ్చుచున్నవి కనుక, వారి భక్తి భావములను ఆ దివ్య ప్రబంధములనుండి కొన్నింటినైనను మన మిపుడు గ్రహించు టావశ్యకము.

'యోగము, తపస్సు మున్నగున వన్నియు వ్యర్థములు.[2] సాంసారికములైన వ్యథలనుండి విడువడవలె నన్నను, శాశ్వత మైన యానందమును పొందవలె నన్నను - యోగము, తపస్సు మున్నగున వేవియు నుపకరింపఁజాలవు. పరమ పద ప్రాప్తికి కేవలము భక్తి మార్గ మొకటియే సులభ మైనది[3] భక్తి వలన లభించు సుఖము స్వర్గ సుఖము కంటెను మిన్న యైనది.[4] కలి కల్మష మయము లైన భావ పరంపరలను దూర దూర మొనరించుటకు భక్తి యొకటియే సమర్థ మైనది.[5] భక్తి మార్గమున పయనించువాఁడు నరకము నెన్నటికిని పొందఁడు.[6] భక్తి హీనుఁడు తన తల్లి గర్భమునకు కళంకము నాపాదించినవాఁడు కాఁగలఁడు.[7] హరి భక్తుఁడు కానివాఁడు మానవుఁడే కాఁడు. మానవత్వము లేని అట్టి యధమునివలన భూమికి భారము

---

1. "తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున !
యోగినా మపి సర్వేషాం మ ద్గతే నాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః"
— భగవ ద్గీత . 6.46, 47

2. పెరియ తిరుమొళి, 3-2.2

3 నాన్ముగన్ తిరువన్దాది 79

4. తిరు వాయి మొళి . 5-2-10

5. తిరు మాలై - 2

6 ఇరణ్డామ్ తిరువన్దాది - 21

7 పెరియాళ్వార్ తిరుమొళి 4 . 4 . 2.

గల్గును. అతనిని - అతని జీవితమే నరకము ననుభవింపఁజేయును. భగవానుఁడు భక్త సులభుఁడు, అన్యులకు దుర్లభుఁడు"[8] అని యీ రీతిగాఁ భక్తి ప్రాముఖ్యమును ఆళ్వారులు లోకమునకు చాటి యున్నారు.

## ఆళ్వారులు - నవ విధ భక్తులు

శ్రవణము, కీర్తనము, స్మరణము, పాద సేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మ నివేదనము - అను నవి నవ విధ భక్తి మార్గములు.[9] ఈ మార్గములలోని యాంతర్యములను పరిపూర్ణముగా గ్రహించి, ఆ యా మార్గములలో ఆళ్వారులు పయనించినట్లు, వారి దివ్య ప్రబంధములవలననే స్పష్ట మగుచున్నది.

*శ్రవణము* -

భగవంతుని నామము, యశము, మహిమ, కల్యాణ గుణము, లీలలు అను వానిని శ్రద్ధగా వినుట - లేక, విన్పించుట అను క్రియయే శ్రవణ భక్తి. భగవద్గుణములను, చరిత్రలను విని, భక్తుఁడు వ్యాకులత నందుటయే ఈ శ్రవణ భక్తికి చరమావస్థ. అళ్వారుల వాఙ్మయమంతయు - భగవంతుని నామమును, లీలలను, వినుట, విన్పించుట - అను క్రియలతోడనే కూడి యున్నది. వారు భగవంతుని లీలలను

---

8 తిరు వాయి మొழி 1-3-1.

9 "శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తి శ్చే న్నవ లక్షణా
క్రియతే భగవ త్యద్ధా త న్మన్యేఽధీత ముత్తమమ్."
— శ్రీమద్భాగవతము 7-5-23,24

వర్ణించుచు, వానిని పరిసమాప్తము గావించునపుడు - వానిని వినుట వలనను, విన్పించుట వలనను గలుగు ఫలితములను పలు విధములుగా విశదీకరించియున్నారు.

'గోవిందుని వర్ణించు నట్టి ఈ గీతములను గానము చేయువారికి భగవదనుగ్రహము గల్గును.[10] భగవల్లీలలతోఁ గూడిన ఈ పాశురములను శ్రవణము గావించువారు వైకుంఠమును పొందఁగలరు'[11] అని, పెరియాళ్వారులు నొక్కి వక్కాణించిరి.

'ఈ ద్రావిడ పాశురములను శ్రవణము గావించిన వారికి కష్టము లన్నియు దూర దూరములు కాఁగల' వని, కులశేఖరాళ్వారులు తెలిపియున్నారు.[12]

'ఈ పాశురములను గానము చేయువారికి పాపములు పటాపంచలై పోఁగల' వని, తిరుమంగై యాళ్వారులు విశదీకరించియున్నారు. భగవంతుని పవిత్ర నామములను శ్రవణ మొనరించువారు నరకమును

---

10 "కొట్టై పాడిక్కు నిక్క వల్లార్ కోవిన్ద న్నడియార్ కళాకి
ఎట్టిశైక్కుమ్ విళక్కాకి నిఱ్పారిడై యడియన్నలై మెలనవే"
— పెరియాళ్వార్ తిరుమొళి 2-9-11

11 "నల్లార్ శిలఙ్గై మలఙ్గ శరద్దు రన్ద
విల్లాళనై విట్టుశిత్తన్ విరిత్త
శొల్లార్న్దవ ప్పూచ్చి పాడలివై పత్తుమ్
వల్లార్ పోయ్ వైకున్దమ్ మన్నియిరుప్పరే"
— పెరియాళ్వార్ తిరుమొళి 2-1-10

12 "కొఙ్గర్కోన్ కులశేకరన్ శొన్న శొల్
ఇఙ్గ వల్లవర్క్కు ఏదమొన్ఱిల్లైయే"
— పెరుమాళ్ తిరుమొళి 3-8.

పొందరని పోయిగై యాళ్వారులును,[13] భగవన్నామమును శ్రవణము గావించినచో - పరమానందము గల్గునని తొండరడిప్పొడియాళ్వారులును[14] భగవన్నామ శ్రవణ ఫలమును విశేషముగా ప్రశంసించి యున్నారు. నమ్మాళ్వారులు తమ ప్రబంధములో నొక తావున, ఈ శ్రవణ భక్తిని బహు భంగులుగా కొనియాడుచు, 'నా చెవు లెల్ల వేళలయందును ఆనంద దాయకము లైన భగవ ల్లీలలను మాత్రమే వినుచుండఁగల' వని తెలిపియున్నారు.[15] కావున, ఆళ్వారులు శ్రవణ భక్తి కెంతటి ప్రాధాన్య మొసంగియుండిరో గ్రహింప నగును.

కీర్తనము -

భగవంతుని నామములను, గుణములను, మాహాత్మ్యములను, లీలలను వర్ణించుట, గానము చేయుట — అనునవి కీర్తన భక్తి యని చెప్పఁబడును. ఇట్టి కీర్తన భక్తి ప్రభావమును సర్వ సాధారణముగా భక్తు లందఱును ప్రశంసించియే యున్నారు. కావున, ఇఁక ఆళ్వారుల విషయమై వేరుగాఁ జెప్ప నేల ? ఆళ్వారుల పాశురము లన్నియు సహజముగా స్తుతి పరము లైన కీర్తనములే. అందువలననే ఆ పాశు

---

13 ముదల్ తిరువన్దాదిః 87

14 "పచ్చై మామలై పోల్ మేనిళ పవళవాయ్ కమల చెజ్ఞణ్
అచ్చుదా వమరరేజే ఆయర్ తమ్ కొళున్దే యెన్నుమ్
ఇచ్చువై తవిరయాన్ పోయ్ ఇన్దిర లోక మాళుమ్
అచ్చువై పెఱినుమ్ వేణేన్ అరజ్ఞమాన గరుళానే."

— తిరుమాలై 2

15 "శెవిగళా లార విన్ కీర్తిక్కని యెన్నుమ్
కవిగళే కాలప్పణ్ తేన్ ఉఱైప్పత్తు త్తు
పువియిన్మేల్ పొన్నెడుమ్ శక్కరత్తున్నైయే
అవిదిన్ఱి యాదరిక్కుమ్ ఎనదావియే"

— తిరువాయి మొళి 9.9.9

రములు వైష్ణవాలయములలో అను దినమును అనుసంధింపఁబడు చున్నవి. వైష్ణవ సంప్రదాయు లందఱును స్తుతి పరము లైన ఆ పాశురములను గానము చేయుచు, ఆనందించుచునే యున్నారు.

భగవంతుని కల్యాణ గుణములను గానము చేయుటయందే ఆనంద మున్నది. కాని, కర్మ బద్ధు లైన మానవుల గుణములను కీర్తించుటయం దట్టి యానందము శూన్యము. కావుననే సామాన్య మానవులను కీర్తించు కవులను నమ్మాళ్వారులు మందలించుచు 'ఓ కవీ! అశాశ్వతములును - అసంపూర్ణములు నైన మానవుల గుణముల నెన్నఁడును శ్లాఘింపకుము. ఆనంద దాయకుఁ డైన భగవంతుని కీర్తించుటవలననే ప్రయోజనము చేకూరు నని ప్రబోధించిరి.[16]

భగవంతుని స్తుతింపని మానవులు త్రాగెడు నీరు, ధరించు వస్త్రములు కేవలము దౌర్భాగ్య వశములు.[17] భగవంతుని కల్యాణ గుణములను కీర్తించు భక్తుల పాద సంస్పర్శము వలననే ఈ భూమి — పవిత్రతను పొందును"[18] అని, పెరియాళ్వారులు స్పష్టీకరించుచు - 'నా నాలుక భగవంతుని మాత్రమే స్తుతించును గాని, అన్యులను స్తుతింప నొల్ల' దని తెలిపియున్నారు.[19]

---

16 "కొళ్ళ క్కుఱై విలన్ వేణ్డిత్తెల్లాన్ తరున్ కోదిల్ ఎన్
వళ్ళల్ మణివణ్ణన్ తన్నై క్కవి శొల్ల వమ్మినో"
— తిరు వాయ్ మొழி. 3-9 5.

17. పెరియాళ్వార్ తిరు మొழி 4-4-1

18 "నాదనై నరశిఙ్గనై నవిన్ఱేత్తువార్ కళుళక్కియ
పాదతూళి పడుతలాల్ ఇవ్వులకమ్ పాక్కియమ్ శెయ్దదే"
— పెరియాళ్వార్ తిరు మొழி 4-4-6.

19 "నాక్కు నిన్నై యల్లా లఱియాదు
నాననక్కువ నెణ్ణ కమన్ను"
— పెరియాళ్వార్ తిరు మొழி. 5-1-1.

భగవానుని గుణ - లీలలను స్తుతించుట - తపస్సుతో తుల్య మని పూదత్తాళ్వారులును,[20] భగవన్నామ సంకీర్తనమునందే యానందము కల దని కులశేఖరాళ్వారులును[21] యెలుగెత్తి చాటియున్నారు

గాన యోగ్యము లైన ఆళ్వారుల పాశురము లన్నియు భగవత్ స్తుతి పరములే కావున, ఆ భక్తి గీతములను భక్తు లైనవారు గానము చేయుచు, వివిధ రాగ తాళములతో నొప్పారు ఆళ్వారుల పాశురములు ప్రజల నెంతిగనో ప్రభావితుల గావించి యుండె ననుట అతిశయోక్తి కానేరదు.

**స్మరణము -**

భగవంతుని నామములను, గుణములను, మాహాత్మ్యలను, లీలలను, సర్వ వ్యాపకత్వమును సర్వదా స్మరించుచుండుటయే స్మరణ భక్తి. ఈ భక్తి సాధనలో - భగవన్నామ జపమునకు మిక్కిలి ప్రాముఖ్య మున్నది. తిరుగుచున్నను, తినుచున్నను, ఏ పని చేయుచున్నను సాధకుని చిత్త వృత్తి - భగవన్నామ స్మరణ యందే లగ్నమై యుండవలెను.

'ప్రకృతిలో నున్న జలము, ఆహారము మొదలుగాఁ గల వన్నియు భగవ న్మయములుగాఁ గన్పట్టు చున్నవి. ఏ పదార్థములను

---

20 ‘‘ఏత్తి ప్పణిన్ద వన్దేర్ ఈ రైఞ్జూఱ తప్పొనతుమ్
శాత్తి యురైత్తల్ తవమ్’’
— ఇరణ్డామ్ తిరువన్దాది 77

21. "నాత్తళమ్బ నారణా వెన్నళైత్తుమెయ్ తళమ్బ తొళుదు
ఏత్తి - ఇన్బురుమ్ తొణ్డర్ శేవడి యేత్తి వాళ్తు మెన్నెఞ్జమే.
పెరుమాళ్ తిరుమొళి 24.

పరిశీలించినను - భగవంతుఁడే స్ఫురణకు వచ్చుచున్నాఁడు' అని నమ్మాళ్వారులును-[22]

'భగవన్నామమును స్మరింపనివారు మహా పాపులు. భగవంతునియందు మనస్సును లగ్నము చేయనివారు - భూమికి భారము నాపాదించినవారు కాఁగలరు' అని పెరియాళ్వారులును[23] -

'ఉత్తమ భక్తులు నిరంతరము భగవన్నామమునే స్మరించుచుందు' రని పొయిగై యాళ్వారులును[24] -

'భగవన్నామమును ఒక్కసారి స్మరించిన మాత్రముననే భగవానుఁడా భక్తుని మనస్సులో నివసించు' నని పేయాళ్వారులును-[25]

---

22 "ఉణ్ణుమ్ శోఱు పరుకునీర్ తిన్నుమ్ వెత్తిలైయు మెల్లామ్
కణ్ణన్ ఎమ్బెరుమా నెన్నెన్నే కణ్గళ్ నీర్కళ్ మల్కి
మణ్ణినుళ్ అవన్ శీర్ వళమ్మిక్కవనూర్ వినవి
తిణ్ణ మెన్నిళమాన్ పుకుమూర్ తిరుక్కోళూరే"

— తిరువాయి మొళి 6-7-1.

23 "నేమిశేర్ తడక్కైయినానై ప్పిలా వలినెఞ్జుడై
పూమి పారంగళుణ్ణుమ్ శోత్తినై వాఙ్గప్పులై త్తిణిమినే."

— పెరియాళ్వార్ తిరుమొళి 4-4-5.

24 "ఒరాళి యానడియే ఓతువతు మోర్ ప్పనవుమ్
పేరాళి కొణ్డాన్ పెయర్"

— ముదల్ తిరువన్దాది 88.

25 నెఞ్జాల్ నినైప్పరియనేలుమ్ నిలై ప్పెత్తేన్
నెఞ్జమే పేశాయ్ నినైక్కుఙ్గాల్ — నెఞ్జత్తు
ప్పేరాదు నిర్కుమ్ పెరుమానై యేన్ కొలో
ఓరాదు నిఱ్కుదునర్వు."

— మూన్ఱామ్ తిరువన్దాది, 81.

'భగవన్నామ స్మరణ చేయువారు నరకమును పొందర' రని తొండరడి ప్పొడి యాళ్వారులును,[26] స్మరణ భక్తిని బహు భంగులుగా కొనియాడి యున్నారు.

పాదసేవనము :-

భగవంతుని పాద సేవ యందు మనస్సును లగ్నము గావించు టయే 'పాద సేవన భక్తి.' ఇది - బాహ్యము, మానసికము అని రెండు విధములు భగవద్విగ్రహ పూజ వలనను, గురు పూజ వలనను, 'పాద సేవన భక్తి'లో - ఏకాగ్రత లభించును. అట్టి యేకాగ్రత వలన భక్తుడు తన మానసిక జగత్తులో - అప్రాకృతము లైన భగవచ్చరణారవిందములను సంసేవింపఁ గల్గును. ఇట్లు బాహ్య ముగా - మానసికముగా భగవత్పాద సేవ చేయుటవలన, లోకా శ్రయమైన భావము తొలఁగిపోవును భగవత్సేవ యందే అట్టి భక్తుని మనస్సు లగ్నమై యుండును గనుక, అతఁడు లోక వృత్తముల యందు ఉదాసీనుఁడై యుండును.

ఆళ్వారులు వివిధ ప్రదేశములందుఁ గల వైష్ణవాలయములలో విరాజమానులైయున్న భగవదర్చామూర్తులను సంసేవించిరి. మధుర కవి యాళ్వారులచే రచింపఁబడిన 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అను ప్రబంధమునందలి పాశురములు కేవలము - గురు పాద సేవన భక్తిని ప్రబోధించునవియై యున్నవి.

---

26 తిరుమాలై. 12.

భక్తులైనవారు పరమ భాగవతోత్తములను సేవించుచుండుట సహజము. కనుక, ఇట్టి పరమ భాగవతోత్తములు భగవత్తుల్యులే' యని కులశేఖరాళ్వారులు తెలిపియున్నారు.[27]

భక్తులు మానసికమైన భగవత్పాదసేవన భక్తిని సాధించుటలో - భగవచ్చరణారవిందములను తమ హృదయపీఠము నధిష్ఠింపఁ జేసి, వారిని భక్తి శ్రద్ధలతో పూజించుచుండురు. కావుననే -

'ఓ భగవానుఁడా! నేను నీ చరణ సేవనే యభిలషించుచున్నాను. నీ చరణారవిందములను నా శిరస్సుపై ధరించి తరింపఁగలను' అని, పొయిగై యాళ్వారులును -[28]

---

27 పెరుమాళ్ తిరు మొళి 1.8

మఱియు -

"నాస్థా ధర్మే న వసు నిచయే నైవ కామోపభోగే
యద్య ద్భవ్యం భవతు భగవన్ పూర్వ కర్మానురూపమ్
ఏత త్ప్రార్థ్యం మమ బహు మతం జన్మ జన్మాంతరేఽపి
త్వ త్పాదాంభోరుహ యుగ గతా నిశ్చలా భక్తి రస్తు."
"బద్ధే నాంజలినా నతేన శిరసా గాత్రైః సరోమోద్గమైః
కంఠేన స్వర గద్గదేన నయనే నోద్గీర్ణ బాష్పాంబునా
నిత్యం త్వ చ్చరణారవింద యుగళ ధ్యానామృతాస్వాదినాం
అస్మాకం సరసీరుహాక్ష! సతతం సంపద్యతాం జీవితమ్"

— ముకుంద మాల శ్లో, 20.

28 "నాడిలుమ్ నిన్నడియే నాడువన్ - నాడోఱుమ్
పాడిలుమ్ నిన్ పుకళే పాడువన్ - సూడిలుమ్
పొన్నాళి యేన్దినాన్ పొన్నడియే శూడువేఱ్కు
ఎన్నాకి లెన్నే యెనక్కు."

— ముదల్ తిరు వన్దాది 88.

'భగవానుని చరణారవిందములను స్తుతింపనివారు - జనన మరణములకు, రోగ దుఃఖములకు, ఇంకను ఎన్నియో కష్ట పరంపరలకు గురి కాఁగలరు'[29] రనియు, 'ఓ భగవానుఁడా! నీ చరణారవిందములు గాక, మఱి యెవ్వియు నాకు శరణ్యము లుగాఁ గన్పట్టవు. నా ప్రాణము లన్నియు నీ యవియే'[30] యనియు, భక్తులకు పాద సేవన భక్తి విధి యని నమ్మాళ్వారులు ప్రబోధించి యున్నారు. మఱియు -

'ఓ మనస్సా! నీవు వేంకటాచల వాసి యైన శ్రీనివాస భగవానుని చరణ కమలములయందు లగ్నము కమ్ము.[31] పురుషోత్తముని పాద పద్మములే నీకు శరణ్యములు కావున, నీవు నిరంతరము ఆ పాద పద్మములనే స్మరించుచు సంసేవించుచుండు'[32] మని పూదత్తాళ్వారులు తమ మనస్సును ప్రబోధించుచు, హిత ముపదేశించిరి.

---

29. "పిఱ ప్పిఱప్పు మూప్పు ప్పిణి తుఱన్దు - పిన్నుమ్
ఇఱక్కవు మిన్బుడై త్తామెలుమ్ - మఱప్పెల్లామ్
ఏత మే యెన్నల్లాల్ ఎణ్ణువనే - మణ్ణళన్దాన్
పాత మే యేత్తాప్పకల్."

— పెరియ తిరు వన్దాది 80.

30 "అఱెనక్కు ఇన్బత మే శరణాగత్త నాళిన్దాయ్ - ఉనక్కోర్ కై
మ్మాఱునా నొన్ఱిలేన్ ఎనతావియు మునతే"

— తిరు వాయి మొళి 6-7-10.

31 "      పోతు ఉఱ్ఱుమ్ - పోతు
మణి వేఙడవన్ మలరడిక్కే శెల్ల
అణి వేఙడవన్ పేరాయ్న్దు"

— ఇరణ్డామ్ తిరువన్దాది 72.

32 "ఉఱుఙ్గణాయ్ నన్నెఞ్జే ఉత్తమన్ నఱ్పాతమ్
ఉఱుఙ్గణ్ణా మొళిక్ కమలన్దన్నాల్ - ఉఱుక్కణాయ్"

— ఇరణ్డామ్ తిరువన్దాది 77.

'ఓ భగవానుఁడా! నిన్ను స్తుతించుచు రచించిన పాశురమాలను నీ చరణారవిందములయందే సమర్పించి, నిరంతరము నిన్నే స్మరించుచు, శరణు పొందుచున్నా[33]నని, తిరుమంగై యాళ్వారులును పాద సేవన భక్తిని బహు భంగులుగా ప్రశంసించి యున్నారు

**అర్చనము.—**

భగవత్స్వరూపమును శ్రద్ధాసక్తులతో పూజించుటయే 'అర్చన భక్తి'. భగవంతుఁడు ఆలయములలో అర్చాస్వరూపమున దర్శన మొసంగుచుండుటయే గాక, సదాచార్యుని యందును, భక్తులందునుఁ గూడ విరాజిల్లుచున్నాఁడు. ఈ మూఁడు విధములుగాఁ గల భగవత్స్వరూపమును భక్తుఁడు గుర్తించి, తన యిష్టదైవమును భక్తిప్రపత్తులతో నిత్యము పూజించుచుండును. భక్తుఁడు భగవంతునకుఁ జేయు సేవ లన్నింటియందును త్యాగ భావము ప్రదర్శించుచుండును

మానసికమైన యర్చనలో - భగవంతుని పూజించుట, భగవంతునకు ఆత్మ సమర్పణము చేయుట అనునవి రెండును అతి ముఖ్యములైనవి. అట్టి మానసికమైన యర్చనలో - బాహ్యములైన ఉపచారము లావశ్యకములు కావు. కాని, స్థూల రూపమైన అర్చనలో - ఉపచారము లనేకము లావశ్యకములై యుండును అర్ఘ్య పాద్యాచమనీయ స్నాన వస్త్రోర్ధ్వపుండ్ర చందన పుష్ప ధూప దీప నైవేద్య తాంబూలాది షోడశోపచారములతో అర్చన భక్తి నిర్వర్తింపఁబడుచుండును అట్టి యర్చన భక్తికి సంబంధించిన యంశము లనేకములు - ఆళ్వారుల దివ్యప్రబంధములలో కానవచ్చుచుండును.

---

33 "పాది నారిన్ శొల్ పన్మలర్ కొణ్ణు ఉన్
పాదమే పరవినాన్ పణిన్దు ఎళున్
నానినాల్ వన్దున్ తిరువడి యడైన్దేన్
— పెరియ తిరుమొழి 1—0.8.

'ఓ భక్తులారా! కేవలము పుష్ప ఫల జల ధూపాదుల సమర్పించుటయే భగవదర్చన.34 భక్తునిచే హృదయ పూర్వకముగా సమర్పింపఁబడిన జల చందన పుష్ప దీపాదుల వలననే భగవదర్చన పరిసమాప్తి కాఁగలదు35' అని, నమ్మాళ్వారులు తెలిపి యున్నారు.

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః"36

పత్రమునుఁ గాని, పుష్పమునుఁ గాని, ఫలమునుఁ గాని, జలమునుఁ గాని భక్తితో నా కెవఁడు సమర్పించునో - అట్టి పరిశుద్ధ మనస్కునిచే భక్తి భావముతో సమర్పింపఁబడు ఆ పదార్థమును నేను భుజింపఁగలను' అను భగవద్వచనమే నమ్మాళ్వారులు వెలువరించిన పై భావములను ప్రస్ఫావితము గావించె నని మనము గ్రహింపవచ్చును.

'చందనము, ఆభరణము, వస్త్రము, పుష్పము మున్నగు వానిని సమర్పించి, భగవంతుని పాద పద్మములకు నమస్కరింపుఁ' డని పూదత్తాళ్వారులు భక్త లోకమునకు ప్రబోధించియున్నారు.37

---

34 "పరివదిల్ ఈశనై ప్పాడి విరివదు మేవలుఱువీర్
పిరివగై యిన్ఱి నన్నీర్ తూయ్ పురివదువుమ్ పుగై పూవే"
— తిరు వాయి మొళి 1.6.1.

35 తిరు వాయి మొళి 1.6.2

36. భగవద్గీత 9-26

37. "వరైచ్చన్ద నక్కుழమ్బుమ్ వాన్ కలనుమ్ ఆడైయుమ్
విరై పూలిన్దవెణ్ మల్లికైయుమ్ - నిరైత్తు క్కొణ్డు
ఆళక్కణ్ణన్ నిన్ఱ ఆడీపనై యుణ్ణేయే
ఓ తప్పణివ తున్నెఞ్జు"

జ్ఞాన తిరువన్దాది, 76

‘శ్రీ వేంకటాచలములో మంత్రములను పఠించుచు, విప్రోత్తములు ధూప దీప పుష్ప జలాదులను సమర్పించుచు, వివిధ దిశలలోఁ గల యర్చా మూర్తులను పూజించుచున్నా’[38] రని, పొయిగై యాళ్వారులు తెలిపి యున్నారు. ఇట్లే, ఆళ్వారు లందఱును అర్చన భక్తిని అత్యంత విశేషముగ కీర్తించి యున్నారు.

### వందనము -

భగవంతుని మహిమలను మనస్సులో ధారణఁ జేసి, ఆ పరమాత్మను స్తుతించుచు, వినమ్రుఁడై, ఆ స్వామికి ప్రణామము గావించుటయే ‘వందన భక్తి’. భగవంతునకు అర్చనఁ జేయు సమయమునందే వందన మాచరించుట భక్తుల విధి యై యున్నది. భగవన్నామ సంకీర్తన గావించు సమయమున, భక్తుని హృదయము నుండి భక్తి ప్రవాహము పొంగి పొరలుచుండుట సహజము. భక్తుఁ డపుడు నృత్యముఁ జేయుచు, తన్మయత్వము నందుచుండును.

ఆళ్వారులు భగవన్నామ సంకీర్తనముఁ గావించుచు, భగవంతునకు నమస్కరించుచు, నృత్యముఁ జేయుచు, ఉన్మత్తుల వలె భగవంతుని నిమిత్తము విలపించుచుండెడివా రనియు, మఱి యొకప్పుడు బ్రహ్మానందము నందుచుండెడివా రనియు వారి దివ్య ప్రబంధముల మూలముననే మనకు తెలియవచ్చుచున్నది. విచిత్రములైన ఆ పరమ యోగుల స్థితి గతులను పరిశీలించి, వారిని వెఱ్ఱివారిని వలె ప్రజలు తలంచుచుండెడివారు. అట్టి యున్మాద స్థితినే కులశేఖరాళ్వారు లభి

---

38 “ఎత్తై యులు నూళ్ కేళ్విరాయ్ వాద్కళ్ - నాళుమ్
పుత్తై పిళక్కుమ్ పూమ్బునలుమేన్ది - తిత్తై తిత్తైయన్
వేదముఱ్గళ్ శెన్నిత్తొన్ వేణ్డడమే - వెణ్ శఙ్గమ్
ఊదియవాయ్ మాల్ కణ్ణపురార్”

— ముదల్ తిరువన్దాది, 37.

లభించి యున్నట్లు తెలియుచున్నది.[39] అదియునుఁ గాక, 'శ్రీరంగము నందలి యాలయములలో విరాజిల్లు శ్రీరంగనాథుని, నా నాలుక చిల్లులు పడువఱకు స్తుతించి, ఆ స్వామికి పుష్పాంజలి సమర్పించి, ఆ శ్రీరంగనాథుని చరణారవిందములకు సాష్టాంగముగ నమస్కరింతు'[40] ననియు కులశేఖరాళ్వారులు తమకు వందన భక్తి యందు గల ప్రగాఢమైన యాకాంక్షను అభివ్యక్తము గావించి యున్నారు.

'అహర్నిశలను భగవంతుని ధ్యానించి, నత మస్తకులై, చేతులు జోడించి, ఆ స్వామికి నమస్కార మాచరించు భక్తులు నివసించు ప్రాంతములలోఁ గల ప్రజలు మిక్కిలి యదృష్టవంతు' లని పెరియాళ్వారులును -[41]

'ఓ మనస్సా! నృసింహావతారమున తన భక్తునియందు వాత్సల్య భావమునుఁ జూపిన విష్ణు భగవానునకు నమస్కరింపుము.

---

39 పెరుమాళ్ తిరుమొళి 2 - 2

40. "పయిలుఱు తరవద్ద యిఱ్ఱ్పి కొఱ్ఱన్
కోయిలై ప్పువి పణిత్తి యొన్నన్ కైగళ్
కోయ్ సుటర్ తూమెత్తు కొలో తూప్పుఞాలే"
— పెరుమాళ్ తిరుమొళి 1.4.

41. "కురన్ద మొన్నొశిత్తానొడున్ గొణ్డు తాడి యాడి విళాచ్చేయ్తు
తిరున్ద నాన్మఱైయార్ యిరాప్పగవే త్తివార్ తియక్కోట్టియూర్
కరున్దడ ముకిల్ వణ్ణనై క్కడైక్కొణ్డుకై తొళుమ్ పత్తర్కళ్
ఇరున్ద వూరి లిరుక్కుమ్ మానిడర్ ఎత్తవఙ్గళ్ శెయ్దార్ కొలో"
— పెరియాళ్వార్ తిరు మొళి 4-4-3.

ఆ 'దేవ దేవుని సంస్తుతింపు' మని పే యాళ్వారులును - [42]

'భగవంతుని సహస్ర నామములతో స్మరించి, చేతులు జోడించి, ఆ స్వామికి వందన మాచరించు భక్తులెన్నటికిని నరకమును పొందరు. ఏ విధమైన కష్టము ననుభవింపరు. అట్టి వారు - భక్తి మార్గమునకు దప్ప, ఏ యితర మార్గము లందును పయనింప నొల్లరు' అని, పొయిగై యాళ్వారులును[43] వందన భక్తిని పలు విధములుగా కీర్తించి యున్నారు.

*దాస్యము :-*

భక్తులు భగవదాజ్ఞను, శిష్యులు గురువుల యానతిని సర్వ సమముగా పాలించుటయే 'దాస్య భక్తి.' దధ్యా సముద్రుండగు భగవంతుని తను స్వామిగా, తండ్రిగా, గురువుగా భావించిన భక్తులు - తమ యజ్ఞానమును, దైన్యమును, దుర్గుణములను, దోషము లను ఆ పరమాత్మునకు నివేదించి, తమ్ము రక్షింపవలసిన దని, పరి పరి విధముల ప్రార్థించుచుందురు. భగవన్మహిమలను పరిపూర్ణముగా గ్రహించి, ఆ స్వామి సన్నిధానమున తమ యనన్యాశ్రయ ప్రవృత్తిని ప్రకటించి, బహు భంగులుగా భగవంతుని కల్యాణ గుణములను

42 "పగునిఱ్ఱుఁన్ ఆనిప్పొపదత్తు - అరియా
యురళ్ నవిరదియనదాగన్ - తుకిర్ న్దు ఎఱ్ఱుమ్
శిన ప్పిళనై తిరుమాల్ తిరువడియై
ఎన్నిత్తె న్నెఞమే వాళ్ త్తు"

— మూన్ఱామ్ తిరు వన్దాది . ౯౫.

43 "వెన్నై యూండర్ పృశార్ వెన్నరికిల్ శేరార్
తినై యేనుమ్ తీక్క తిక్కణ్ శెల్లార్ - నినై తన్
కరియానై కైయానై ఆయిరమ్ పేర్ - శెజ్గణ్
కరియానై కైక్కొళాదార్ "

— ముదల్ తిరువన్దాది ౯౯

ప్రస్తుతించుచు, ఆ పరాత్పరుని కృపా కటాక్షమును పొందుటకు నిరంతరము పరితపించుచుందురు.

ఆళ్వారులలో కొందఱు దాస్య భక్తిని విశేషముగా కీర్తించి యున్నారు. వారి పాశురములలో - స్వీయ దోష ప్రకటనము, వినయము, యాచన, దైన్యము, ఆత్మ సమర్పణము, భగవదనుభూతి మున్నగు భావములు దాస్య భక్తికి అంగములుగా పేర్కొనఁబడు చున్నవి.

'ఓ మనస్సా! మూర్ఖుల మాటలను వినక, గోపాల కృష్ణుని దాస్యము గైకొని, ధన్యత గాంచుము. ఆదిలో ప్రాకృత సాంగత్యము గలిగి, అప్రాకృతుఁడైన భగవంతునకు విముఖమైన ఓ మనస్సా! నేఁడు నీవు ఏ భగవానుని దాస్యమును స్వీకరించితివో, ఆ భగవానునకు బ్రహ్మ రుద్రేంద్రాదులు, భక్తులు నిత్యము దాస్యమును చేయుచునే యున్నారు సుమా'[44] అని, తిరుమళిశై యాళ్వారులు తమకు భగవద్దాస్యమునందుఁ గల ప్రగాఢమైన యాకాంక్షను వెలువరించుచు, 'ఓ భగవానుఁడా! నీవు నాకు ప్రేమ స్వరూపుఁడవుగా - అమృత స్వరూపుఁడవుగా - అది యిది యన నేల? నీవే నా సర్వస్వముగా గన్పట్టుచున్నావు. ఓ కేశవా! నేను నీ యాజ్ఞను

---

44. "శేయ నణియన్ శిఱియన్ పెరియ నెన్పదుమ శిలర్ పేశ క్కేట్టిరు
న్దే — ఎన్నెఞ్జ మెన్నాయ్ ఎనక్కాన్ఱు కొల్లాదే
..
ఆయర్ నాయగఱ్కు ఇన్డడి మెత్తొళిల్ పూణ్డాయే."
— పెరియ తిరు మొళి : 2-1-8.

"పాడి యాడి ప్పలరుమ్ పణి న్దేత్తి క్కాణ్డలార్
అడు తామడై యోను మీశనుమ్ అమరర్ కోనుమ్ - నిన్ఱేత్తుమ్ వేఙ్గడ
త్తాడు కూత్తనుక్కు ఇన్డడి మెత్తొళిల్ పూణ్డాయే."
— పెరియ తిరు మొళి · 2-1-8.

పాలించుటకు సిద్ధముగ నున్నాను గావున, నీవు నన్ను పరిగ్రహించుము. ఇపుడే కాదు, సర్వ కాల సర్వావస్థలయందును నీవే నాకు శరణ్యము. నీవు తప్ప, నాకు వేఱే గతియు లేదని తెలిసికొంటిని'[45] అని, భగవంతునియందు తమకుఁ గల అచంచలమైన దాస్య భక్తి భావమును స్పష్టముగాఁ దెల్పియున్నారు.

ఇట్లే, నమ్మాళ్వారులును - 'మేము భగవంతునకు చిర కాల దాసులము, తర తరములుగా భగవద్దాసులమై యున్నవారము. ఆ పరమాత్మునకు సేవ గావించిన కారణమువలననే మేము ధన్యులమైతిమి'[46] అని, దాస్య భక్తికిఁ గల ప్రాముఖ్యమును, మహా ఫలమును వివరించుచు - 'ఓ భగవానుఁడా! నీవు నా తండ్రివి, తల్లివి, నా సర్వస్వము నీవే'[47] యని, భగవంతునే తమ సర్వస్వముగా భావించి, ఆ స్వామి పాదారవిందములను సంసేవించుటయందే విశేషమైన యాసక్తిని గనఁబఱచియున్నారు.

---

45. "అన్బావాయ్ ఆరముదవాయ్ - అడియేను
క్కిన్బావాయ్ ఎల్లామున్ నీయానాయ్ - పొన్ పావై
కేళ్వా కిళరొళియేన్ కేశవనే - కేడిన్రి
ఆళ్వాయ్ క్కడియేన్ నానాళ్."

— నాన్ముగన్ తిరువన్దాది 60.

46 "ఒళివిల్ కాల మెల్లామ్ ఉడనాయ్ మన్ని
వళువిలా వడిమై శెయ్య వేణ్డుమ్ నామ్
తెళి కురలరువి త్తిరు వేఙ్గడత్తు
ఎళిల్ కొళ్ శోది యెన్దై తన్దైక్కే"

— తిరువాయిమొళి 3-3-1.

47. "పెత్త తాయ్ నీయే పిఱప్పిత్త తన్దైనీ,"

— పెరియ తిరువన్దాది 4.

తొండరడిప్పొడియాళ్వారులు వెలువరించిన దాస్య భక్తి భావములు - సర్వులకును అవశ్య గమనార్హములు. 'ఓ భగవానుఁడా! నాకు గృహారామ క్షేత్రాదు లెవ్వియు లేవు: బంధువులు లేరు. అయినను, కరుణాయత్త చిత్తుఁడ వైన నీవు ఒక్కఁడవు మాత్రమే ఆత్మ బంధువుగా నున్నావు. అశాశ్వత మైన నా జీవితములో - ఇంతవఱకు, నీ చరణారవిందములను శరణింప నైతి నే యని, యిపుడు మిగుల విచారము నందుచున్నాను. నాకు ఆధారభూతుఁవు నీవు గాక, ఇఁక అన్యు లెవ రున్నారు ?'[48] - నా మనస్సులో అణు మాత్ర మేనియు పవిత్రత లేదు. నా వాక్కు నుండి ఒక్క మంచి మాట యైనను వచ్చియుండ లేదు. క్రోధము గలవాఁడ నగుటచే, నాలోఁ గల ద్వేష బుద్ధి హద్దు మీఱి పోయినది. ఇతరులను చెడ్డ చూపుతోఁ జూచుచు, అనరాని మాట లనుచున్నాను. ఇట్టి నాకు - ఏ గతి సంప్రాప్తించునో గదా! నాపై సర్వాధిపత్యము గల స్వామీ! నీవే చెప్పుము[49]. ఓ భగవానుఁడా! నీ దర్శన భాగ్యమును పొందుటకై, తగిన మార్గమునకు విముఖు లగు వారి సాంగత్యముఁ జేయుచున్న వాఁడను. మూర్ఖుఁడను. మూర్ఖులలోఁ గూడ అధముఁడను.

---

48. "ఊరిలేన్ కాణి యిల్లై ఉఱవు మత్తొరు వరిల్లై
పారిల్ నిన్ పాద మూలమ్ పత్తిలేన్ పరమ మూర్తి!
కారొళి వణ్ణనే కణ్ణనే కదఱుగిన్ఱేన్
ఆరుళర్ కళైకణమ్మా అరఙ్గమాన గరుళానే"

— తిరుమాలై. 29.

49. "మనత్తిలోర్ తూయ్మై యిల్లై వాయిలోరిన్ శొల్లిల్లై
శినత్తినాల్ శెత్తమ్ నోక్కి తీవిళి విళివన్ వాళా
పునత్తుళాయ్ మాలై యానే పొన్ని శూళ్ తిరువరఙ్గా
ఎనక్కు ఇనిక్కదియెన్ శొల్లాయ్ ఎన్నై యాళుడై యప్పనే."

— తిరుమాలై: 30.

నిన్నిపుడు శరణించుచున్నాను"[50] అని, తొండరడిప్పొడి యాళ్వారులు తమ యపచారములను స్పష్టీకరించుచు, దైన్య భావముతో - భగవచ్ఛరణాగతిని యాచించియున్నారు. ఆవేదనము గల భక్తుని హృదయమ్ములో - భగవత్సేవకై ఆక్రందించు భావము ఆళ్వారుల పాశురములలో - అట నట మనకు గన్పడుచునే యుండును. ఆండాళ్ సైతము - తాను గోవిందుని దాసురాల నని పలికి యున్నది[51] ఇందువలన, ఆళ్వారులు వందన భక్తి కెంతటి ప్రాముఖ్య మొసంగి యుండిరో సులభముగా గ్రహింపవచ్చును.

**సఖ్యము :-**

లౌకిక వ్యవహారమున మనము చూచుచున్న ఆదర్శ మైత్రినిఁ జూపుటయే 'సఖ్య భక్తి.' మైత్రికిఁ గల ఉన్నతాశయముల ననుసరించి, మిత్రులతో పరస్పరము ఏ విధమైన స్వార్థమును ఉండదు. సఖ్య భావము వలన, నిస్స్వార్థ భక్తికి పరిపుష్టి యేర్పడును. వాత్సల్య భావము గల భక్తులు భగవంతుని యందు సంపూర్ణ స్వాతంత్ర్యమును ప్రదర్శించుచుందురట్లే, సఖ్య భావము గల భక్తులను భగవంతుని సన్నిధానమున, తమ తమ మనస్సులలోఁ గల సంకల్పములను వెలువరించు సందర్భమున, సంకోచమునుఁ గాని, భయమునుఁ గాని, ఏమాత్ర మేని పొందకుండుటయే గాక, చిన్న - పెద్ద - అను తారతమ్యమునుఁ గూడ పరిగణింపరు. ఏల యన, ఆ ఇరువురికిని నడుమ గల

50. "ఆర్తువణ్ణ లమ్బుమ్ కోలై ఆణి తిరవరఙ్గత్తమ్మాళ్
కార్తిరళ్నైయ మేనిక్కణ్ణనే ఉణ్ణై క్కాణుమ్
మార్క్క మెన్నటియ మాట్టా మనిశరిల్ తురిశనాయ
మూర్క్కనేన్ వన్తు నిన్నేన్ మూర్క్కనేన్ మూర్క్కనేనే"
— తిరుమాలై, 32.

51 నాచ్చియార్ తిరుమొళి, 1-9.

సంబంధములో - సమాన భావము సంపూర్ణముగ నుండును. ఇదియే సఖ్య భావమునందుఁ గల విశేషము. నారద భక్తి సూత్రములలో ప్రేమాసక్తి - పదు నొకండు విధములుగా నుండు నని చెప్పబడినది. వానిలో - సఖ్యాసక్తియును ఒకటి.

కృష్ణుని బాల్య చేష్టలు, గోవులను పాలించు వేళలలో కృష్ణుఁడు గోప బాలురతో సఖ్యము నెఱపుచు - వివిధ ప్రసంగములు చేయుట, పంక్తి భోజనము చేయుట, మున్నగు సన్ని వేశములను భక్త కవులు వర్ణించునపుడు, ఆళ్వారుల దివ్య ప్రబంధములందును సఖ్య భక్తి భావము అత్యంత మనోజ్ఞముగ అభి వ్యక్తము చేయఁబడినది.

కృష్ణుఁడు తన సఖులతో కలిసి మెలిసి సంచరించుచునే తన లీలలను చూపెను. నవనీతమును తస్కరించు నపుడు తన సహచరుల సహాయమునుఁ గైకొనెను.[52] గోవులను పాలించు సమయము లలో - తన సహచరులపై ప్రేమను విశేషముగఁ జూపెను. సఖ్య ప్రేమకు వశుఁడైన కృష్ణుఁడు - తన సహచరులచేతనే గోవులను పాలింపఁజేసెను. వారి సంతృప్తికై, సంతోషాతిరేకముతో ఆట లాడెను. పాటలఁ బాడెను. నాట్యము గావించెను. విందు లార గించెను.[53] ఒకనాఁడు కృష్ణుడు - గోపాలురతోఁ గూడి, అరణ్యము నుండి ఆవులను తోలుకొనివచ్చుచు, మురళీ గానము చేసెను. ఆ గాన మాధుర్యము - ఆ పరిసర ప్రాంతీయుల నెల్లరను ముగ్ధులఁ గావించి

---

52. పెరియాళ్వార్ తిరు మొళి 2.3

53 “తడైకళమ్ తొఙ్గలుమ్ తదుమ్బి యెఙ్గుమ్
తణ్ణుమై యెక్కమ్ మత్తళి తాళ్ పీలి
కిళిల్ కళప్ కీతము మాకి యెఙ్గుమ్
కోవిన్దన్ వరుకిన్ఱ కూట్టమ్ కణ్డు”

— పెరియాళ్వార్ తిరు మొళి 3.4.1

వైచెను. వివిధ వాయిద్యములు వాయించుచు వచ్చు గోప బాలకులతోఁ గలిసి, కృష్ణుడుఁ కూడ వచ్చుచున్నాఁడు.[54] కృష్ణుని సహచరులగు గోప కుమారులు - చిన్న చిన్న కొడవళ్ళను, ధనుస్సులను, చరణాకోలలను, ఉత్తరీయములను, కృష్ణుఁడు కోరినపుడు వెంటనే అందించుటకు కరములందు ధరించి, ఆ కృష్ణుని వెన్నంటియే వచ్చుచుండిరి. కృష్ణుఁడు తన ప్రాణ మిత్రులను ఒక చేతిలో చేర దీసికొని, రెండవ చేతిలో - గోవులను పిలుచుట కుపయోగించు శంఖమును గైకొని, గోకులమునకు తిరిగి వచ్చుచుండెను. నెమలి పింఛముతో శోభిల్లు కేశ పాశముతోఁ గూడిన కృష్ణుఁడు — తన సహచరులగు గోప బాలురందఱికంటెను ముందువైపు నిలబడి, వేణు గానముతోఁ బాటు, నృత్యముఁగూడ గావించుచు వచ్చుచుండెను.[55] ఇట్లే, కృష్ణ - గోప కుమారులకుఁ గల సఖ్య భావములను పెరియాళ్వారులు బహు రమణీయముగ వర్ణించియున్నారు.

ఆత్మ నివేదనము :-

'ఆత్మ నివేదన మనఁగా - 'ప్రపత్తి.' ఇది - 'శరణాగతి' యనియు నిర్వచింపఁబడును. అనన్య సాధ్యమైన భగవ త్ప్రపత్తిలో

---

54 "పల్లినుళ్ పత్తాక వుడైవాళ్ శాత్తిప్పడై క్కుడుప్పడ్డి ప్పల తళై నడువే
ముల్లై నన్నఱుమలర్ వేఙ్గమలరణిన్దు పల్లాయిర్ కుళా నడువే"
— పెరియాళ్వార్ తిరు మొళి 3-4-2.

55 "శురికైయుమ్ తెఱివిల్లుమ్ శెణ్డుకోలుమ్
మేలాడైయుమ్ తోళన్మార్ కొణ్డోడ
ఒరుకై యాలొరు వన్ తోళై యూన్ఱి
యానిరై యినమ్ మీళ కుఱిత్త శఙ్గమ్"
— పెరియాళ్వార్ తిరు మొళి 3.4.3.

విశ్వాస పూర్వకముగా భగవంతుని ఒక్కని మాత్రమే ఉపాయముగ భావించి ప్రార్థించు నిశ్చయాత్మక బుద్ధియే 'ఆత్మ నివేదన' మని చెప్పఁబడును. ఇట్టి ఆత్మ నివేదమునకు సంబంధించిన యంశములు ఆళ్వారుల దివ్య ప్రబంధములలో అనేకములు గన్పట్టును.

'మానవుఁ డొక చెఱువును త్రవ్వ గల్గును గాని, భగవ దనుగ్రహ రూప మైన వర్షము వర్షింపనిచో, ఆ చెఱువు – నీటితో నిండఁజాలదు గదా! కావున, భగవంతుని యనుగ్రహముపైననే మానవ ప్రయత్న మంతయు ఆధారపడియున్న' దని పూదత్తాళ్వారులును –[56]

'ఓ భగవానుఁడా! సమస్త విశ్వమును నీవే. విశ్వ మంతయు నీయందే ఆధారపడి యున్నది. దయా నిధి వగు నీవే భక్తుల హృదయములలో భక్తి బీజములను నిక్షిప్తము గావించు చున్నావు' అని తిరుమంగై యాళ్వారులును –[57]

'ఓ భగవానుఁడా! నే నెన్నియో కష్టముల ననుభవించు చున్నాను. శరణాగత రక్షకుఁడ వైన నిన్ను శరణించుటచే గాక, మఱియొక రీతిగా – నా కష్టములు కడతేరజాలవు. తల్లి కోపమునకు గురియై, దూరముగా నేగిన తనయుఁడు – మఱల తల్లి పాలనే కోరి, తల్లిని సమీపించు రీతి – నీ చరణారవిందముల సన్నిధిలో శరణు పొందు చున్నాను' అని కులశేఖరాళ్వారులును –[58] భగవంతుఁడు ఒక్కఁడు మాత్రమే అందఱకును ఆశ్రయణీయుఁ డని ప్రబోధించి యున్నారు.

---

56. ఇరణ్డామ్ తిరువన్దాది 16.

57. నాన్ముగన్ తిరువన్దాది 14

58. పెరుమాళ్ తిరుమొళి, 5 – 1.



# పాణ యోగి ప్రభావము

( తిరుప్పాణాళ్వారుల వైభవము )

'విద్వత్కవి రాజ'

శ్రీమాన్ కొమాండూరు గోపాల కృష్ణమాచార్యులు, బి. ఏ.



కావేరీ భుజ వల్లరీ వలయిత క్ష్మా మధ్య దేశంబునన్
భూ వైకుంఠము - సర్వ భక్త జన సంపూజ్యంబు - శ్రీ రంగ రా
జావాసంబు సమస్త కల్మష హరంబై, నిత్య కల్యాణమై
సేవార్థాగత రాజ లోక శిబిర శ్రీమంతమై యొప్పెడున్.

శ్రీ రంగేశ్వర నాభి పంకజ రజశ్శ్రీ చూర్ణముం దాల్చి, వి
స్తారోదార భుజాంతరస్థ తులసీ దామంబులం గద్దు త
చ్ఛౌరి శ్రీ పద పద్మ తోయముల నాస్వాదించు శేషత్వ దీ
ప్తారంభుం డనిలుం డహర్ముఖములం దా రంగ ధామంబునన్.

ఆయత నీల దేహుఁడు, మహా భుజుఁ, డున్నత వక్షుఁడున్, సరో
జాయత దివ్య నేత్రుఁడు మహా పురు షాకృతి నొప్పువాఁడునై
గాయక సార్వభౌముఁ డనఁగా దగు నొక్కఁడు దివ్య సుందర
శ్రీ యుతుఁ డంత్యజుండు నివసించును త న్నగరాంతికంబునన్.

కావేరిన్ విరజా తరంగిణిగ, రంగ శ్రీ ప్రభు క్షేత్రమున్
భూ వైకుంఠముగాఁ, బరాత్పరుఁడు త చ్ఛ్రీ రంగ నాథుండుగా
భావం బందున నిల్పి, భక్తి ధనుఁడై పాణాభిధానుండు రం
గావాసంబును ద్రొక్కఁగా వెఱచు నత్యంతంబు నే వేళలన్.

అంబర చుంబితం బగు జనార్దను గోపుర మొక్క క్రోశ మా
త్రంబున గాంచి, వీణియ నతండు నఖంబుల మీటుచున్ మనో
జ్ఞంబుగ రంగ మందిరము సైకత వేది లిఖించి ప్రత్యహం
బంబుజ నాభుఁ బాడు మధురారవ మంగళ నామ కైశికిన్.

అతఁ డొక నాఁడు మే ల్కని నిశాంతమునందుఁ గవేరజా తట
స్థిత సికతా తలంబున సశీకర బాల సమీర డింభముల్
సతతము పైకొనన్ గమల షండ వినిర్గత మత్త బంభర
ప్రకరము విపంచితోఁ గలిపి శ్రోత్ర మనోహర లీల బాడుచున్.

అతఁ డభ్రంకష దివ్య మంటప సహస్రాకీర్ణమై, గోపురా
యుత శోభాన్విత సప్త వప్ర మయి, పుష్పోద్యాన రమ్యంబునై
శత వాపీ యుత మైన రంగని మహాస్థానంబు భావించి, సై
కత వేదిన్ లిఖియించెఁ గట్టెదుట సంకల్ప ప్రభావంబునన్.

ముద యొప్పంగఁ దదాలయాంతరమునన్ భోగీంద్ర పర్యంకమం
దుడి తార్క్ష్య ప్రతిమాను - రంగ విభు నత్యుల్లాసియై వ్రాసి, పై
న్మదిఁ దన్మూర్తి దృఢంబుగా నిలిపి, యాత్మారాముఁడై, సర్వమున్
జిద చి ద్వస్తు విశిష్ట బాహ్య జగమున్ జేతో గతిన్ వీడినన్.

ఆ సమయంబునన్ ద్విజు లహర్ముఖ కృత్యము లాచరింప ద
ర్భాసన వస్త్ర పేటికలు పాణులఁ దాలిచి వచ్చి, తీరమం
దాసన బంధ ధీరుఁ డయి యంత్యజుఁ డుండుటఁ జూచి, చేరఁగా
దోస మటంచు వాని నెస దూరము పొమ్మని హెచ్చరించినన్.

అతఁడు ననన్య దృష్టి మది నచ్యుతు నిల్పి, యఖండ భక్తి దా
నితరము సర్వమున్ మఱచి, యీశ్వరునిన్ హృదయాబ్జపీఠి సం
తతమును యోగ దృష్టిఁ గని, తన్మయతన్ రమియించుచుంటచే
బ్రతి వచనం బొసంగఁ డది వంచనగాఁ దలపోసి విప్రులున్.

ఓరి దురాత్మ! లె మ్మిచట నుష్ణ మయూఖుని రాక దోఁచెగన్
నీరములందు గ్రుంకె వలె, నీ వొక గ్రావము వోలె నడ్డమై
తీరము నందుఁ జేరితివి, తీర్థము లందు వసింపఁ జెల్ల దా
చార పవిత్రులైన ద్విజ సత్తము లంపఱు వేచి యుండఁగన్.

సీ వోక మాని వాడు వాకొ ? నిశ్చలతన్ వసియించినంతనే
కావర మేల ? బ్రాహ్మణులఁ గా దని నిల్వఁగఁ జాలువాఁడవే ?
త్రావితి వారి మద్యమును ? తథ్యము చిత్తము భ్రాంతి జెందె, నీ
పావన తీర్థ దేశమునఁ బంచముఁ డర్హుఁడె కావ ముంచగన్ ?

కరి పతి మూర్ధ పీఠమునఁ గాంచన కుంభము నుంచి వాద్యముల్
మొరయఁగ, వేద పాఠకులు ముందును వెన్క జనంగ, దీర్థమున్
మురహరు రంగ రాజ విభు పూజకుఁ గైకొని పోవ నర్చకుల్
కరము చిరంబు నిల్చి రిట గార్యము మాని తొలంగి పోవరా !

అటు పలు మారు పల్కినను నాతఁడు సేవియు మాఱు పల్కఁ డా
తటమున బాష్ప నేత్రుఁ డయి తన్మయతన్ బులకాంకురంబు లు
త్కటముగ మేనిపైఁ బొడమ గాఢ సమాధి మునింగి యున్న, న
చ్చటి జను లాగ్రహించి యతి శాంతుని దండ్యునిగా దలంచుచున్.

పటు పాషాణ పరంపరా ప్రహతులన్ బాధింప, నంగంబు ను
త్కట కీలాలము గ్రమ్మ, నిశ్చలుఁడు నిస్తంద్రుఁడునై పాడు న
స్ఫుట హాసంబు ముఖాబ్జమందు వెలయన్ శుద్ధాత్ముఁ డా యోగి - య
చ్చటి వా రెల్లను తన్ను గన్గొని మహాశ్చర్యంబు నన్ దేలగన్.

అతడు నిజేచ్ఛఁ గొంత తడ వచ్చట శ్రీహరి పైని గీతముల్
శ్రుతి సుఖ లీల చిత్తము విశుద్ధి వహింపఁగఁ బాడి లేచి, పై
కత తలముం దొలంగి చనెఁ గాయము పుష్పిత కింశుక ద్రుమ
ప్రతి ఘటమై వెలుంగ నిజ పర్ణ కుటీర పథానువర్తియై.

అంతట రంగ మందిర మహా మణి మండప మధ్య వర్తియై
సంతత దుష్ట శిక్షణ విచక్షణ రక్షణ దీక్షు నున్న దై
త్యాంతకు మేనఁ జందనము నర్చకుఁ డర్పణ సేయు వేళ న
త్యంత భయంబునన్ గనిరి సంగమునం దరుణాస్ర బిందువుల్.

కాంచి నిజాంగకంబు లతి గాఢ భయంబునఁ గంప మొంద న
క్కాంచన గర్భ వంశజుఁ డఖండ రయంబున నేగి, పార్థివున్
గాంచి, తి దద్భుతం బతని కట్టెదుటన్ వచియింప, విస్మయో
దంచిత సంస్థిరాక్షుఁ డయి యాతఁడు బిల్వఁగ బంచె విప్రులన్.

సారు నృపాలు నానతి నవారిత సత్వర వృత్తి వచ్చినన్
ఘస్మ రమణుండు పండితుల సత్కృతిఁ జేసి, బుధేంద్రులార ! నేఁ
డారయ నొక్క వింత, మన యాలయ మందలి స్వామి మేన ని
ష్కారణ మస్ర బిందువులు కన్పడె నెట్టి యమంగళం బొకో !

అనుటయు సందఱుం గలసి యంబుజ నాభుని దివ్య దేహమున్
గను గొను వేడ్క నేగి, గగనాంతర చుంబిత సప్త వప్రమై
తనరు మహాలయాంతర ముదార జనంబున జొచ్చి, తప్త కాం
చన మయ దివ్య మండప విశాల విమానము గాంచి మ్రొక్కుచున్

ద్వారలు గర్భ మందిర కవాటము సొచ్చి, భుజంగ తల్పు, సం
ధ్యారుణ కాంచనాంబరు, సుదగ్ర చతుర్భుజ శోభితాంగు, వి
స్తార భుజాంతరున్, జలజ చారు విలోచను, దివ్య సుందరా
కారుని, రక్త బిందు మయ గాత్రుని, రంగని గాంచి రచ్చటన్.

దేవ ! యరిష్ట చిహ్న మిది - దీనికి శాంతి యొనర్పఁగావలెన్
భూ వలయంబునం దిది యపూర్వము - సేయగ నాజ్ఞ యిమ్ము భూ
దేవుల మంత్ర హోమ జప దీక్ష సహస్ర ఘటాభిషేకమున్
దేవరకున్ శుభోదయము - దేశ సుఖంబును దీన గల్గెడున్.

అనుచు నభిజ్ఞు లందఱును నా విధి దెల్ప, నృపాలుఁ డట్ల కా
మనమున నిశ్చయించి, తన మంత్రుల కాజ్ఞ యొసంగి, నాఁటి రే
యిని నిజ సౌధ సీమ నిదురించి, నిశాంతము నందు స్వప్నమున్
గని కడు విస్మయం బడర గాల్య విధుల్ నెరవేర్చి చయ్యనన్.

కొలు వయి పల్కె నిట్లు నృప కుంజరుఁ డప్పు డమాత్య వర్గమున్
గలయఁగ జూచి, స్వప్నమునఁ గాల వలాహక వర్ణు, నుల్లస
జ్జలజ విశాల లోచనుని, జ్యా కిణ కర్కశ దీర్ఘ బాహు, ను
జ్జ్వల మణి భూషణ ప్రకర భాస్వర దేహుని దివ్య పూరుషున్.

గని, భయ సంభ్రమాతిశయ కంపిత దేహుఁడునై ప్రణామముల్
తనకు నొనర్ప, సాంద్ర జలజ ధ్వని ధీరత బల్కె నాతఁ డో
జనవర ! నాదు భక్తు, నతి శాంతుని బంచముఁ డంచు భూసురుల్
ఘన కఠినోపల ప్రహతి గారియ వెట్టిరి క్రూర కర్ములై.

తన భారంబు సమస్తమున్ బరమ భక్త శ్రేష్ఠు నా పైని ని
ర్భరముగా నిల్పి, సమస్త కర్మ ఫలముల్ బ్రహ్మార్పణం బంచు ఖే
దము మోదంబు సమత్వ బుద్ధి గొని, మత్కైంకర్య నిష్ఠాత్ముఁడై
క్షేమముల్ వాసి సుఖంత్రు మచ్చరణ కంజాత ద్వయిన్ గొల్చుచున్.

కావున, నాదు భక్త జన ఘాతము సేయుట నాకు జేయుటౌ
గావున నైన వారి యెడ భక్తిని జూపుట నాకు జూపుటౌ
నెపుడు నాదు సన్నిధి కనింద్య చరిత్రు డెదియు నాతనిన్
భూ వర ! తోడి తెమ్మిపుడు భూసుర ముఖ్య పురస్సరంబుగన్.

అని యతఁ డానతిచ్చుటయు నంతన మేల్కని, విన్న పంచమున్
జనములు హింస సేయుటయు చార ముఖంబున వింటి బద్మనా
భునకుఁ బ్రియుం డెవం డతఁడె పూజ్యుఁడు లోకమునందు గాన, మీ
కనుమతియేని బోదమె మహాత్ముని నాతని తోడి తేరఁగన్ ?

నావుడు వార లెల్ల నర నాథుని వాక్యము సమ్మతింప, నా
భూపతి యుఁడున్ గజాశ్వ రథ భూషణ పంక్తు లుపాయనంబుగా
బావన మూర్తి కాతనికి భక్తిని గైకొని పాద చారియై
వేవుర వైష్ణవోత్తములు వెంబడి రా నరిగెన్ వినమ్రతన్.

అరిగి తదీయ పర్ణ గృహ మెల్లనఁ జొచ్చి, స సంభ్రమాన్విత
త్వరుఁ డయి వచ్చు నాతని పదంబులకున్ బ్రణమిల్లి, రంగ భూ
వరుఁడు భవత్సమాగమము భావమునం దలపెట్టె నేఁడు - త
చ్చరణ పయోజ సన్నిధికి సత్త్వ గుణాకర! వేగ రాఁగదే!

వీరలు వైష్ణవోత్తములు - వేడుకఁ బ్రహ్మ రథస్థు జేసి, యిం
పారఁగ రంగ రాజ చరణాబ్జములన్ మిముఁ జేర్ప సిద్ధులై
కోరి తమంతఁ దా మిచట గూడిరి వీరి ననుగ్రహింపవే
భూరి కృపానిధీ! పరమ పూజ్యులు వీరలు దోష మెంతురే?

నర నాథుం డిటు విన్నవింప, నతఁడున్ - నారాయణోచ్చారణ
స్ఫురితోష్ఠుం డయి, హస్త యుగ్మ పిహిత శ్రోత్ర ద్వయుండై, మహీన్
సుర లీ విప్రులు, మీరు భూపతులు, మీ శుద్ధాన్వయం బెడ? శ్రీ
హరి! నా నీచ కులం బదేడ? అకటా! అస్పృశ్యుఁడన్, పాపుఁడన్.

ఏమి మహాపరాధ మొనరించితినో తొలి జన్మమందు - నే
నీ మహి పాప జాతి నయి యిప్పుడు పుట్టితిఁ, జేయ నోప నో
భూమిప! యింక భాగవత భూసుర దేవ మహాపచారముల్,
స్వాములు మీ రవాచ్య నను బ్రహ్మ రథస్థునిఁ జేయఁ గూడునే?
సౌలోమీపతి భద్ర పీఠమున నిల్వం జాలుఁ గాహో బలా
ఢీలుం డా నహుషుం డగస్త్యుని తపో వీర్యాతిరేకంబునన్
వ్రాలెన్ భూమి పయిన్ మహాజగరమై, స్వారాజ్య విభ్రష్టుఁడై
ఏలా మాలని కిట్టి బ్రహ్మ రథముల్? హీనాన్వయుం డప్పుఁడే?

కావేరీ ద్వయ మధ్య సంస్థిత మహా కల్యాణ ధామంబు - భూ
దేవ వ్రాత కృతాధ్వరాయుతములన్ దివ్యంబు - శ్రీరంగ రా
డ్దేవ స్థాన పవిత్ర భూ తలము ని దీనుండు పాదాహతిన్
సేవింపం గన నెట్టుఁ డే విధి నగున్ శ్రీ రంగ సామీప్యముల్?

అని యాతండు వచింప, వైష్ణవ సమూహం బార్య! శ్రీ రంగ నా
ఘని దివ్య స్థలమున్ బదాబ్జములతోఁ ద్రొక్కంగ మీ రన్న య
ట్లనుమానించి యనుగ్రహింప మము మీ కాన్కీ యూ సేవ, మా
జననం బీ మహి సార్థకంబె యగు మీ సౌలభ్య మిట్లొప్పునే?

అన హరి పార తంత్ర్యమున, నాతఁడు నిశ్చల వృత్తి నుండ, నా
జన విభుఁడున్ మహీ సురులు చయ్యన బ్రహ్మ రథస్థుఁ జేసి, యా
తని బహు వాద్య ఘోషము లుదారత మ్రోయ గ రంగ మందిరం
బున కు ముదంబు తోడఁ గొని పోయిరి వేడ్క మహోత్సవంబునన్.

భూ రమణుండు వైష్ణవుని పూజ్యుని నాతని రంగ మందిర
ద్వారముఁ జేర్ప, రత్న ఖచితం బగు దివ్య విమాన మప్డు ము
మ్మారు ప్రదక్షిణంబు గొని మాధవు సన్నిధి కేగు దెంచి, త
చ్చారు పదాబ్జముల్ మొదలు సంస్తుతి జేసె శిఖాంత మాతఁడున్.

బలి దైత్యేంద్రు నెపస్థ విక్రమమునన్ బంధించి, బ్రహ్మాండమున్
గలయన్ వేడుక విక్రమ త్రయ వశాక్రాంతంబు గావించు నాఁ
డల బ్రహ్మాదుల దృష్టి కైనను నమేయంబైన నీ పాదయుక్
జలజంబుల్ గన నయ్యె దాసునకు నీ కారుణ్య పూరంబునన్.

ఘన తర మేఘ మాలికల గ్రమ్మిన సాంధ్య మయూఖ జాలమో
యనఁగ భవత్కటి స్థలమునం దసమాన విభూతి వెల్గు కాం
చన మయ దివ్య చేల పరిసర్పిత సూమకి దృష్టి యో జనా
ర్దన! మఱలంగనేర దది తామరసాంతర షట్పదాకృతిన్.

ఘన తర దావ పావక శిఖల్ దరి కొన్న పరంగ మట్టులో
సరసిజ నాభ! చిక్కితిని సంసృతి ఘోర దవాగ్ని - నేఁడు నీ
కరుణ సుశీతల ప్రాదపము గాంచిన రీతి ద్వదీయ నాభికా
సరసిజ గాంచి తాపములు సర్వముఁ బాయఁగ గంటి మాధవా!

నీరజనాభ! నీవు నవనీత మిషంబున గోపికా సదః
కోరకముల్ హరించుటకు ఘోష కుటీరములంగల జొచ్చినట్టి కై
శోర విచేష్టితంబును యశోద సహింపక బట్టి జేసి ని
న్నారసి చూడ, వశ్య విషయంబున నందఱు విహ్వలవంతులే.

శ్రీవత్సాంకితమై, మహా శుభదమై, శృంగార కాసారమై,
లావణ్యామృత సాగరంబయి, మహాలక్ష్మీ సువాసమై,
ఆ వింధ్యాచల సానురాగ మయి దేవా! యొప్పు నీ వక్షమున్
సేవింపం గనినాడ నీదు కరుణన్ శ్రీ కౌస్తుభాలంకృతా!

సమ మైరావత తుండ కర్కశమ్ములై, శక్ర ధ్వజాకారులై
కమనీయాంగద భూషణాంచితమ్ములై, గాఢానుబంధంబులై
రమణీయాకృతి నొప్పు నీ భుజములన్ రంగేశ! సేవించు భా
గ్యము నా కిప్డు లభించె నీదు కరుణన్ కౌమోదకీ లాంఛనా!

గోప నితంబిని ప్రదుల కోసుల బాల్య విచేష్టితంబు - శం
ఖోపము సుందరంబును - మహోజ్జ్వల దివ్య సుగంధ మాలికో
ద్దీపితమైన నీ గళము దీన జనావన! నేడు గాంచి, సం
తాపము వాయ గంటి - నను దాసునిగా గొని బ్రోవవే హరీ!

నీ మధురాధరామృతము నీరజ నాభ! సాంగుదేవి యీ
భూమిని గోప కాంత నయి పుట్టినచో, గాదని యందువేని, నా
కామ శరార్తి వాయ నతి గాఢ భుజాంతర సీమ జేర్చి, యీ
కామిని నేలు కొమ్మిపుడు కాంత వియోగ సమ్మోహం బిడన్.

ఆకర్ణాంత విశాల నీల రుచులై, యజ్ఞేశ పత్రంబులై
లోక త్రాణ పరాయణంబు లగుచున్ లోకేశ! నీ నేత్రముల్
వీక్షన్ భీత కురంగ శాబ నయనా విక్రీత దాసున్ ననున్
నీకుం గింకరుగా నొనర్చెను వశ నిన్నే రేజ పత్రేక్షణా!

చారు పయోద మాలికలు సాంద్ర తమాల నికుంజ పుంజముల్
భూరి కళిందజా మధుర పూరము లంజన శైల దీధితుల్
నీ రమణీయ దివ్య తను నిర్మల కాంతులు కోమలాంగ! యీ
క్రూరు కఠోరు మానసము గూడ హరించె నిదేమి చిత్రమో!

తావక దివ్య దేహమును దానవ భంజన! సేవ జేసి, యీ
స్థావర జంగమాత్మకము సర్వ జగంబును జూడ నొల్ల, నీ
పావన పాద పద్మముల బంభర వృత్తి భజించువాఁడ నో
దేవ! భవత్పదం బొసఁగి దీనుని నన్ననుగ్రహింపవే!

అతఁ డీ రీతిని రంగరాజ సుమనోజ్ఞాకారమున్ వేరువే
రతి భక్తిన్ వినుతింపు నంతట దదీయంబైన దేహంబు ది
వ్య తమంబై, హరి మంగళాకృతి కభేదాకారమున్ బొల్చె న
ద్భుత తేజోమయ దుర్నిరీక్ష్య మయి రూపంబు శోభిల్లఁగన్.

అపుడు చతుర్భుజంబులను - హస్త యుగంబున శంఖ చక్రముల్
విపుల భుజాంతరస్థ మగు విష్ణుని చిహ్నము - కౌస్తుభాదులన్
దపన సహస్ర తేజమును, దప్త హిరణ్మయ దివ్య రూపమున్
అపరిమితాంగ సౌష్ఠవము నాతని కప్పుడు సంక్రమించినన్.

నర నాథుండు - జనంబు లప్పుడు నమో నారాయణా యంచు శ
బ్ద రవం బొప్పఁగ నేత్రముల్ మొగిచి దిగ్భ్రాంతాత్ములై యుండ, నా
హరి భక్తుండు నవ్యశ్యుఁ డయ్యెను, తదీయార్చావతారంబు నేఁ
డరవిందోదరు పాద పద్మములయం దచ్చోట గన్పట్టెడున్.



# దశ విధ వైష్ణవులు

'ప్రపన్న కుల తిలక'

శ్రీమాన్ లంకా వేంకట నరసయ్యా సూరి



"అద్వేషీ చానుకూల శ్చ దివ్య నామ ధర స్తథా
చక్రాంకీ మంత్ర పాఠీ చ వైష్ణవ శ్చ తతః పరమ్
శ్రీ వైష్ణవః ప్రపన్న శ్చ ఏకాంతీ చ పరం తప!
పరమైకాంతి విఖ్యాతో ద శైతే వైష్ణవా స్స్మృతాః."

— (ప్రపన్న ధర్మ సా౦ సముచ్చయము)

అద్వేషుడు, అనుకూలుడు, దివ్య నామ ధరుడు, చక్రాంకితుడు, మంత్ర పాఠకుడు, వైష్ణవుడు, శ్రీ వైష్ణవుడు, ప్రపన్నుడు, ఏకాంతి, పరమైకాంతి - అని, వైష్ణవులు పది తరగతులుగా నుందురు. ఈ భేదములు - వర్ణాశ్రమ ధర్మములకు, గోత్ర ప్రవరలకు, శాఖలకు, కులములకు సంబంధించినవి కావు. వారి వారి జ్ఞానమునకు, అనుష్ఠానమునకు, వైలక్షణ్యమునకు చెంది యుండును.

" యథా పృథ గ్విధా వర్ణాః యథా త త్రైవ చాశ్రమః
వివిక్త మతయ స్తత్ర తథా బాగవతా అపి "

— (మహా భారతము)

బ్రాహ్మణాది వర్ణము లెట్లు భేదము నొంది యున్నవో, అందునను - బ్రహ్మచర్యా ద్యాశ్రమము లెట్లు భేదముగ గలవో, అట్లే - నిర్మల మనస్కులును, భగవ దేకాంతులు నగు భాగవతోత్తములును పది విధములుగా నుందురు. అందు -

## ౧. అద్వేషులు

" విష్ణుం లోక నియంతారం వైష్ణవం లోక పావన!
దృష్ట్వా న ద్వేష్టీ యో మర్త్య స్సొ ఽద్వేషః పరి
—(ప్రపన్న ధర్మ సార సవ

లోక నియంత యగు విష్ణునును, లోక పావను లైన
లగు వైష్ణవులనుఁ జూచి యెవఁడు ద్వేషింపఁడో - ఆతఁ
యనఁబడును. ద్వేష బుద్ధి గల వారెవ రైనను బాగుపడ

" అద్వేష్టా సర్వ భూతానాం మైత్ర కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకార స్సమ దుఃఖ సుఖః క్షమీ.
" సంతుష్ట స్సతతం యోగి యతాత్మా దృఢ నిశ్చయః
మ య్యర్పిత మనో బుద్ధి ర్యో మ ద్భక్త స్స మే (
— (భగవ ద్గీత

సర్వ భూతములందు ద్వేషము లేక, మిత్రభావము,
కలిగి, అహంకార మమకారములను పరిత్యజించి, సుఖ
యందు సమ భావము, ఓర్పు, సంతృప్తియు కలిగి, మనో
గల నా భక్తుఁడు నాకు ప్రియు' డని, శ్రీ కృష్ణ భ
ముముక్షువుల నిమిత్త ముపదేశించెను. దశ విధ వైష్ణవు
యద్వేషులే మొదటి తరగతివారు. ఈ యద్వేషులే
పరమైకాంతు లగుదురు. ఎట్లనఁగా -

" పితా చ రక్షక శ్శేషీ భర్తా జ్ఞేయో రమా పతిః
స్వా మ్యాధారో మ మాత్మా చ భోక్తా చాద్య మనూ ది

అను నవ విధ సంబంధములలో - సర్వేశ్వరుఁడు
యనియు, తా నాతనికి పుత్రుఁ డనియు తలంచుటయే పితా
సంబంధము. ఇదియే సర్వేశ్వరునకును, ముముక్షువునకును
బాంధవ్యము. ఇట్టి బాంధవ్యము సిద్ధించినచో, తుది బాంధవ
భోక్తృ భోగ్య సంబంధము నందుకొనుట సులభ సాధ్యమే కా

'పితా చ' అనుటచే, మిగిలిన యెనిమిది సంబంధములును ఒక దాని వెంట నొకటి యవిచ్ఛిన్నముగా నంటి యుండును. కనుక, దశ విధ వైష్ణవులలో మొదటి తరగతి యగు అద్వేషికి సంబంధించిన లక్షణము లన్నియు సంపూర్ణముగ నున్నచో, క్రమముగా నతఁడు పరమైకాంతి యగుటకు సంశయము లేదు.

" తస్మా ద్బాల్యే వివేకాత్మా యతేత శ్రేయసే సదా. "
— (భారద్వాజ సంహిత)

" కిళరొళి యిళమై కెడువద న్మున్నమ్. "
— (తిరు వాయి మొళి)

అను ప్రమాణముల ననుసరించి, బాల్యము నుండియే వివేక జ్ఞాన యుక్తుఁ డైనచో - అతఁడు సహజ దాస్యైక రతుఁడై, శేషత్వ పారతంత్ర్యములతో నొప్పారి విలసిల్లును. ఇట్టి మొదటి తరగతికే యనర్హుఁ డయ్యె నేని, ఇఁక తన జీవితాంతము వఱకును పై తరగతుల నందలేఁడు.

అనంత కోటి బ్రహ్మాండ నాయకుఁ డగు శ్రియః పతి యెడ అద్వేషిగా నుండ వలె నను ఈ సందర్భమున, 'నంబాడువాన్' చరిత్ర - సంక్షిప్తముగ నైన స్మరింపఁ దగినది.

నంబాడువాన్ - పరమ భక్తాగ్రేసరుఁడు. అత డొక నాఁడు అరణ్య మార్గమున పయనించుచుండెను. అందు, ఆకలి బాధతో నలమంటించుచున్న నొక బ్రహ్మ రక్షస్సు అతనిని నిరోధించి, తన కాహారము క మ్మని కోరెను. అప్పు డతఁడు బ్రహ్మ రక్షస్సుతో — 'నేను నిత్యము భగవంతుని కల్యాణ గుణ గణములను గానము చేయుచుండువాఁడను. కనుక, నేఁడును అట్లే - ఈ సమీపమునఁ గల దేవాలయ స్థలి కేఁగి, కొంత తడవు ఆ స్వామి దివ్య చేష్టితములను కీర్తించి, తిరిగి వచ్చి, నీ కాహార మయ్యెద' నని పలికెను. ఆ పలుకులను బ్రహ్మ రక్షస్సు లెక్క సేయక, నిర్బంధముగా నతనిని భక్షింప నను

కట్టెను. అప్పు డతఁడు బ్రహ్మ రక్షస్సును అనేక విధముల వేఁడు కొనెను. అనేక శపథములఁ జేసెను. తుదను -

" వాసు దేవం పరిత్యజ్య యో ఽన్యం దైవ ముపాసతే
తేషాం గతిం ప్రపద్యే వై య ద్యాయం నాగమే పున
నారాయణ మథా ఽన్యై స్తు దేవై స్తుల్యం కరోతి య
తస్య పాపేన లిప్యేయం య ద్యహం నాగమే పున. "

— (కైశిక మాహాత్మ్యము)

'నేను మఱల రాని యెడల, వాసు దేవుని పరిత్యజించి, ఇతర దేవతల నుపాసించువా రెంతటి దోషమును పొందుదురో - అట్టి దోషమును పొందుదును మఱియు, మోక్ష ప్రదుఁ డగు శ్రీమన్నారాయణుని ఇతర దేవతలకు సమముగా నెవఁడు తలంచునో - అతఁ డనుభవించు పాపమునఁ బడి, అతని వలె - నిత్య సంసారి నగుదు'నని శపథము చేసెను. ఆ శపథమును బ్రహ్మ రక్షస్సు సావధానముగా విని, ఆతని సాత్త్విక భావమును గ్రహించి, ఆతని విశ్వసించి, విష్ణు భక్తుఁడును - దేవతాంతర సామ్య బుద్ధి రహితుఁడు నగు పరమ భాగవతోత్తముని తిరు క్కురుంగుడి స్వామి సన్నిధి యందు సంకీర్తనము చేయుటకై విడచెను* కనుక, దేవతాంతర సామ్య బుద్ధి పాప హేతు వని తెలియవలయును.

" విష్ణు నిందా చ త్రివిధా బ్రహ్మణా కథితా పురా
అప్రత్యక్షం చ కురుతే జ్ఞాన హీనో నరాధమ
త స్యాత్ర నిష్కృతి ర్నాస్తి యావ ద్వై బ్రహ్మణ శ్శతమ్ "

— (బ్రహ్మ వైవర్తము 17-వ అధ్యాయము)

* ఈ వృత్తాంతము ఆముక్తమాల్యద యందలి 6-వ ఆశ్వాసములో - 'చండాల బ్రహ్మ రక్షస్సంవాద' మను పేర శ్రీకృష్ణదేవరాయలచే అభివర్ణింపఁబడినది

— సంపాదకుఁడు

విష్ణు నింద మూఁడు విధములుగా నగు నని పూర్వము బ్రహ్మచే చెప్పఁబడినది మొదటిది - విష్ణువును రిహాస్యముగా నిందించుట, లేక, స్మరింపకుండుట. రెండవది - ప్రత్యక్షముగా సేవింపకుండుట. మూఁడవది - ఇతర దేవతలతో విష్ణు భగవానుని తత్ సామ్యముగాఁ జెప్పుట ఇది జ్ఞాన హీనుఁ డగు నరాధముని కృత్యము. అట్టి యధమునకు, బ్రహ్మ - చతుర్ముఖుఁడై యుండు పర్యంతము ప్రాయశ్చిత్తము లేదు.

శ్రీ వైష్ణవులను సేవించు నపుడు, తన దార పుత్ర పౌత్రకులందు గల ప్రీతిఁ జూపవలయును భగవంతుని కంటెను భగవద్భక్తులధికు లని సమస్త శాస్త్రము లుద్ఘోషించుచున్నవి అష్ట విధ భక్తులలో - పరమ భాగవతోత్తముల యెడ ప్రేమగా నుంట మొదటి భక్తి యని చెప్పఁబడుచున్నది. భగవదపచారము కంటెన, భాగవతాపచారము సహింపరాని దని అనేక ప్రమాణము లుండఁగా - లోకపావను లగు భాగవతోత్తములను సేవించునపుడు ద్వేష బుద్ధియు, అసూయయుఁ గలిగి యుండుట కడు నికృష్టము అసూయ, ద్వేషము అను నీ రెండు వ్యాధులును ప్రపంచమునఁ గల వ్యాధు లన్నింటి కంటెను కడు చెడ్డవి శాస్త్ర వేత్తలై, దేశము నుద్ధరించుటకు బద్ధకంకణు లైన పరమ భాగవతోత్తములు సమస్త ధర్మములు దెలిసినవారగుటచే, ఈ వ్యాధులను తొలగింపఁజేయ నుద్యుక్తులు కావలసియున్నది. శాస్త్ర సారముల నెఱిగి, అనష్ఠించు వారే సర్వ విధముల అధికులు గాన, వైష్ణవమునకు మొదటి సోపానమగు ఈ తరగతియందు తీర్ణులై వర్తించువారే అద్వేషు లనఁబడుదురు.

## ౨. అనుకూలురు

" వాసు దేవోత్సవాం శ్చైవ మహా బాగవతాం స్తథా
అను వర్తేత యో నిత్యం అనుకూలీ ఉదాహృతః "

— (ప్రపన్న ధర్మ సార సముచ్చయము)

భగవానుఁడగు వాసుదేవుని యుత్సవములకును, భగవద్భక్తులైన మహా భాగవతులకును అనవరతము అనుకూలుఁడై అనుసరించువాఁడు అనుకూలుఁడనఁబడును.

దశవిధ వైష్ణవులలో అనుకూలురు రెండవ తరగతి వారు. శ్రియఃపతికి సంబంధించిన నిత్యోత్సవ మాసోత్సవములను, అయనోత్సవ - సంవత్సరోత్సవములను, అధ్యయనోత్సవ కల్యాణోత్సవములను, ఆళ్వారాచార్యుల యొక్కయు - భాగవతోత్తముల యొక్కయు తిరు నక్షత్ర జయంత్యుత్సవాదులను సేవించి, వాచక - కాయక - మానసికము లనఁబడు త్రికరణముల శుద్ధిగా ననుకరించి యనువర్తించువారును, నిరంతరము భగవద్భాగవతాచార్యుల యెడ రవంతైన ప్రతికూల స్వభావము లేక, మనోవాక్కాయముల దేనిచేనైన నపరాధము చేయక, నిర్మల హృదయముతో మెలగువారును అనుకూలురనఁబడుదురు. వీరు ప్రతికూలురతో సహవాసము చేయరాదు. అద్వేషుల కంటెను వీరి తరగతి పెద్దది. భగవద్భాగవతాచార్యుల విషయమున ద్వేషాసూయలు లేకుండుటయు, షోడశోపచారములు సలుపుట యందును, అట్టి ఉపచారములను సమర్పించుచుండగా సేవించుట యందును ప్రీతి గలవారై అనువర్తించుట అనుకూలుర విధి.

" పత్తిల నీశనుమ్ ముత్తవుమ్ నిన్ననన్."

అను పాశురము వలన, సర్వేశ్వరుఁడు పూర్వాశ్రితు లందరి ప్రేమ కంటెను ఇపుడాశ్రయించినవారియందు మిక్కిలి ప్రేమ గలిగి యున్నట్లు వ్యక్తమగుచున్నది. కనుక, ఆ సర్వేశ్వరునందు అనన్యమైన భక్తి గలిగి, సర్వ విధ కైంకర్యము లందు ప్రవేశింపుఁడని ఆళ్వారులు సాయించుచున్నట్లు తెలియవలయును. భగవంతుని సేవించునపుడును, భాగవతోత్తములను సందర్శించు సమయమునను

కపట వేషధారులై, నైచ్యానుసంధానముతో బహిరంగమున మాత్రము నటించువారు అపచారముల పాలై పోవుటయే గాక, యెడ నెడఁ జెడిపోవుదురు. అట్టి కపట నైచ్యానుసంధానము కంటెను మిన్నకుండుటయే శ్రేయస్కరము. ఆత్మ స్తుతి, పర నింద యనునవి అనంత కోటి యపచారముల కాస్పదములు.

'పిళ్ళై పిళ్ళై యాళ్వాన్' అను వారు - శ్రీ రామానుజుల కాలము నాఁటి వారు. వారు నిత్య నైమిత్తికా ద్యనుష్ఠానములు శాస్త్రోక్తముగ నిర్వర్తించుచున్నను, పర నింద చేయు స్వభావము కలవారు. స్వాములను సేవించి, వారి లోపములను వెదకుచుండెడివారు. ఈ విషయమును కూరత్తాళ్వారులు విని, వారి యందు గల ఆ దుర్గుణములను దూర మొనరించవలె నని దృఢ నిశ్చయులై, ఒకానొక పర్వ కాలమున కావేరిలో స్నాన మాడు సమయమున - పిళ్ళై పిళ్ళై యాళ్వాను కడకేగి, దాన మడిగిరి. వారికి వీరు ఆచార్యులగుటచే, 'దాసుఁడే దేవరవారి సొత్తైన పిదప, దానము చేయు వస్తువు మఱియొకటి యుండునా?' అని సమాధాన మిచ్చిరి. అప్పుడు కూరత్తాళ్వారులు - 'శిష్యా! ఇంకను నీ వద్ద - 'పర నింద' యను వస్తువు ఒకటి మిగిలి యున్నది కనుక, దాని నిప్పుడు నాకు దాన మీయవలె' నని కోరగా, పిళ్ళై పిళ్ళై యాళ్వాను నిశ్చేష్టులై నిలిచి, చేసిన యపచారములకు పరితపించుచు, 'పర దూషణ' యను గుణమును తమ యాచార్యులకు దానము చేసి, ఆ నాఁటి నుండియు స్వాములను సేవించిన తోడనే త్రికరణ శుద్ధిగా స్తోత్రము చేయుచు, వినయముతో ప్రణమిల్లి, గౌరవ మర్యాదలు సల్పుచు, పూర్వ మొనరించిన యపచారములకై పశ్చాత్తాపపడుచుండిరి. పశ్చాత్తాపమే వైష్ణవులకు పరమ ధర్మము కనుక, చేసిన యపచారములను ఆచార్యులు క్షమించిరి. ముముక్షువు లగువారు - యోగ్యులైన వారిని సేవించి, వారి మార్గమునఁ బోవ ప్రయత్నింపవలయునే గాని,

వారిని నిందించుట ఆసుర కృత్యము. శ్రీమ ద్రామానుజులు తమ చరమ దశ యందు శిష్యులకు సాయించిన యెనబది రెండు వార్త లిప్పట్టున అవశ్య పఠనీయులు. ప్రతికూలురు వ్రాసిరి లగుట వలన, వారిని వదలి వర్తించువారే యనుకూలు రనఁబడుదురు.

## 3. దివ్య నామ ధరులు

"స్మృత్యు చ్చారణ మాత్రేణ సర్వ పాప ప్రణాశనమ్
విష్ణు నామ ధరః పుణ్య నామ ధారీ స ఉచ్యతే."
—(ప్రపన్న ధర్మ సార సముచ్చయము)

ఎవరిని స్మరించి, అతని దివ్య నామము నుచ్చరించినంత మాత్రమున సమస్త పాపములను సమూలముగ నశించునో - అట్టి భగవ ద్వాచక మైన నామము ను ధరించిన పుణ్యుఁడు 'నామ ధారి' యనఁబడును పేరు బెట్టుకొనినవాఁడు పుణ్యుఁడగుటయే గాక, వానిని ఆ పేరఁ బిలుచు వారును అజామిళుని వలె పుణ్యు లగుదురు. దివ్యనామ ధరులు మూఁడవ తరగతివారు. ఒకటి - రెండు తరగతుల వారి గుణములు కలిగి, భగవ ద్దాస్య నామ ధరులై, ఊర్ధ్వ పుండ్ర ధారులై యుండవలయును.

పంచ సంస్కారములలో - నామ సంస్కార మొకటి. నామ సంస్కార మొనర్చునపుడు, తమ పూర్వాచార్య పరంపరను బాగుగా విచారించి, నామ కరణము చేయవలయును. అటు లొనర్చినచో, వారి వలె విలక్షణత్వము, సద్గుణ గణము సిద్ధించు ననియు, వారి కృపకు పాత్రు లగుదు రనియు శాస్త్రములు నొక్కి వక్కాణించు చున్నవి.

"వైకుంఠ నామ గ్రహణ మశేషాఘ హరం విదుః."
— (ప్రపన్న ధర్మ సార సముచ్చయము)

అన్నట్లు, మహిమ గల భగవన్నామముల నైనను, భగవచ్ఛేషత్వమునకు సీమా భూమి యగు భాగవత శేషత్వమును ప్రకాశింపఁజేయు పరమ భాగవతుల దివ్య నామముల నైనను ధరించుట శాస్త్ర సమ్మతము. అట్లు పవిత్ర నామములను తమ పుత్రులకుఁ బెట్టి, వానిని స్మరించి, సద్గతులఁ బొందినవా రనేకులు కలరు. నామ మనఁగా - ఊర్ధ్వ పుండ్రమునకుఁ గూడఁ జెల్లును.

" విష్ణు చిహ్నం ద్విధా ప్రోక్తం వ్యక్త మవ్యక్త మేవ చ
తయో రేక మపి త్యక్త్వా పత త్యేవ న సంశయః. "

— (పిలకత్తు మోక్షాదిశా నిర్ణయము)

విష్ణు చిహ్నము లు రెండు విధములు. ఒకటి - మానసికము. రెండవది - బాహ్యము. శ్రీ వైష్ణవునకు రెండును ఆవశ్యకములే. ఈ రెంటిలో దేనిని విడచినను అతఁడు పతితుఁ డగును.

" యే కంఠ లగ్న తులసీ నలినాక్షమాలా
యే బాహు మూల పరి చిహ్నిత శంఖ చక్రా
యే వా లలాట ఫలకే లస దూర్ధ్వ పుండ్రా
తే వైష్ణవా భువన మాశు పవిత్రయంతి "

— (ప్రపన్నానుష్ఠాన భాస్కరము)

కంఠమున తులసీ నలినాక్షమాలలు, బాహు మూలముల యందు శంఖ చక్రములు, లలాటమున ఊర్ధ్వ పుండ్రములు ధరించిన వైష్ణవులు ధరిత్రిని పునీతము చేయగలరు.

" తిరుమణి దురిత విదూరము
తిరుమణి సౌభాగ్య కరము త్రిజగము లందున్
తిరుమణి పెట్టిన మనుజుఁడు
పరమ పవిత్రుండు భాగ్యవంతుడు కృష్ణా! "

— (కృష్ణ శతకము)

ఊర్ధ్వ పుండ్ర మహిమ అత్యద్భుతము. ఇందులకు శ్రుతి స్మృతీతిహాస పురాణ ప్రమాణము లనేకములు కలవు.

కొందఱు నవ నాగరికులు - 'బాహ్య చిహ్నములతోఁ బని యేమి? అంత శ్చిహ్నము లుండినఁ జాలవా?' అని ప్రశ్నింతురు. బాహ్య చిహ్నములే తెలియని వారికి అంత శ్చిహ్నము లెట్లు తెలియును? బాహ్య చిహ్నములు అంత శ్చిహ్నములకు అంగ భూతములు. అంత చిహ్నములే చాలు ననుకొన్నచో - పతివ్రతకు మంగళ సూత్ర మెందుకు? ఉద్యోగి రాజ శాసన ప్రకారము దుస్తు లేలను? నాణెములపై ముద్ర లెందుకు? పరీక్షలలో నుత్తీర్ణులైన వారికి పట్టా లెందుకు? ఇవి యవి యన నేమి? తనువు పై రేఖలు? ఇవి యన్నియు బాహ్య చిహ్నములు కావా? సూల చిఃచ ద్వికిష్ట బ్రహ్మయే (సృష్టియే) బాహ్య చిహ్నములతోఁ గూడి యున్నది. ఈ యంశములపై దృష్టిని బాగుగా ప్రసరింపఁ జేసిన యెడల, బాహ్య చిహ్నము లావశ్యకము లని విపులముగా తెలియఁగలదు.

లాంఛనములు ఆ యా యధికారి శాసనములు. రాజ శాసనము నుల్లంఘించినవా రెట్లు శిక్షకు పాత్రు లగుదురో, అట్లే - భగవచ్ఛాస్త్రముల నుల్లంఘించినవారు భగవన్నిగ్రహమునకు పాత్రు లగుదురు. పవిత్రములైన ఊర్ధ్వ పుండ్రములను ధరించువారు దివ్య నామ ధరు లనఁబడుదురు

## ౪. చక్రాంకులు

"శ్రుతి స్మృతి పురాణేషు విహితం చక్ర ధారణమ్
యో బిభర్తి నరో నిత్యం చక్ర ధారీ స ఉచ్యతే."

—(వ్యాఘ్ర ధర్మ శాస్త్ర సముచ్చయము)

వేదము లందును, ధర్మ శాస్త్రము లందును, పురాణము లందును చక్రధారణము విధింపబడినది కనుక, తేజస్సు గుణముగ విష్ణు చక్రము నెవడు ధరించునో, అతడు 'చక్ర ధారి' యనబడును ఇతడు నాల్గవ తరగతికి జెందును పై తరగతుల వారికి గల గుణములు గలిగి యుండి, సద్గురువు నాశ్రయించి, పంచ సంస్కార ములలో మొదటి వగు తాప సంస్కారమును పొందవలయును

"సుదర్శన మహా జ్వాలా కోటి సూర్య సమ ప్రభా
అజ్ఞా నాంధస్య మె నిత్యం విష్ణో ర్మార్గం ప్రదర్శయ.
"పాంచ జన్య నిజ ధ్వాన ధ్వస్త పాతక సంచయ
పాహి మాం పాపినం ఘోరం సంసారార్ణవ పాతినమ్"
— (పంచ సంస్కార విధి)

సుదర్శనము కోటి సూర్య ప్రభా భాస మైనది అది - అజ్ఞా నాంధకారమును బోగొట్టి, విష్ణు మార్గమును చూపుటలో అసమాన మైనది పాంచ జన్య ధ్వని - సంసార సముద్రమున బడి, సంచిత కర్మానుభవమును కాస్పదమగు ఘోర పాపముల నశింపజేయును

"ద్వివిధం వైష్ణవం ప్రొక్తం బాహ్య మాభ్యంతరం తథా
శంఖ చక్రాదికం బాహ్య మాంతరం వీతరాగతా"

బాహ్య మరియు, అంతర్య ననియు వైష్ణవము రెండు విధములు శంఖ చక్రాది ధారణము బాహ్యము రాగ ద్వేషాది రహితము అంతర్యము

మానవులు భుజముల యగ్ర భాగములందు తప్తము లైన ట్టియు, పావనము లైనట్టియు విష్ణువు యొక్క శంఖ చక్రములను ధరించి, తన్మూలమున, భవ సాగరమును తరి

" పవిత్ర మి త్యగ్ని ! అగ్ని ర్వై సహస్రార ! సహస్రారో నేమి. నెమినా తప్త తనూ బ్రహ్మణ స్సాయుజ్యగ్ం సలోకతా మా ప్నోతి "

— (సామ వేదము - మైత్రాయణీయ శాఖ)

అగ్ని స్వభావ సిద్ధముగా పవిత్ర మైనది విష్ణు చక్రమునం దట్టి అగ్నియే వేయి యాకులుగా నేర్పడి యన్నది ఆ వేయి యాకులే చక్రము యొక్క యంచు నందలి పట్టగా నేర్పడి యున్నది. ఆ పట్టి వలన తప్తమగు శరీరము గలవారు - సాలోక్య, సాయుజ్య ములను పొందగలరు.

"జ్ఞానం వై పురుషో బ్రాహ్మణో జాయతే ! సవై స స బ్రాహ్మణో భవతి ! భగవ ద్భక్త్యోర్వపుండ్రీ వశిష్ఠ కశ్యపో ఽత్రి రగస్త్య జామదగ్ని ర్విశ్వామిత్రో యమో వ్యాస పరాశర శ్వనక సనందన శుకో వామదేవ స్స్వబ్రహ్మ వో ఽపతి ! తప్తం చక్రం ద్విజుజే ధార్య మితి స విష్ణు లోకో భవతి ! సో ఽనంత లోకో భవతి ! స పుణ్య లోకో భవతి ! య ఏవం వేద "

— (శత పథ బ్రాహ్మణము)

బ్రహ్మ జ్ఞాన నిష్ఠు లగు ముముక్షువులకు పంచ సంస్కారము లత్యావశ్యకములై యుండుట - శ్రుతి సమ్మతములు భగవ ద్భక్తు లగు వశిష్ఠ - కశ్యప - అత్రి - జమదగ్ని - విశ్వామిత్ర - యమ - వ్యాస పరాశర - సనక - సనందన - శుక - వామదేవాది మహర్షులు ఈ పంచ సంస్కారములను ఉపనయన విధి శ్రేష్ఠములుగా భావించి, యథా విధిగ ధరించి, బ్రహ్మ లోకాది శ్రీ వైకుంఠ పదముల నలంక రించి రనుట సుప్రసిద్ధము.

సదాచార్య సమాశ్రయణము లేనివారికిని, తద్వంశ సంభవులకును భగవత్కటాక్షము కలుగఁ జాల దనియు, ఈ పంచ సంస్కారములు, స్త్రీ - శూద్రాదులకు సైతము ఆవశ్యకము లనియు, వానిని ధరింపనివారు - భగవ న్నిర్హేతుక కృపకు దూరు లగుదు రనియు, ఇట్టి సంస్కారములను పొందక చేయఁబడు కర్మ లన్నియు నిష్ఫలము లగు ననియు, శత సహస్ర ప్రమాణములచే విశదీకరింపఁబడినవి. కాఁబట్టి, జ్ఞానానుష్ఠాన సంపన్ను లగు ఆచార్యుల నాశ్రయించి, తాపాది సంస్కారములను పొందిన వారు చక్రాంకితు లనఁబడుదురు

## ౨. మంత్ర పారకులు

"అష్టాక్షరస్య మంత్రస్య స్మరణా న్ముక్తిదో హరిః
త మావర్తేత యో నిత్యం మంత్ర పార స్స ఉచ్యతే"

— (ప్రపన్న ధర్మ సార సముచ్చయము)

అష్టాక్షరీ మంత్రానుసంధానము చేయువారికి హరి ముక్తి నిచ్చును అట్టి మంత్రమును ఎవఁ డనవరత మనుసంధించునో, అతఁడు మంత్ర పారకుఁ డనఁబడును

అష్టాక్షరీ మంత్ర ప్రభావ మమోఘము దీని వలననే సర్వేశ్వరునకు, జీవునకు భార్యా భర్తృ సంబంధము నిత్య మగుచున్నది అకారము, ఉకార మకారములు వేదములనుండి ప్రభవించుటచే, ఆ అక్షర త్రయ సముదాయము ప్రణవ మైనది తిరు మంత్రమందు ప్రథమ పద మగు 'ప్రణవము' వలన శేషత్వము,మధ్యమ పదముచే ఫలము చెప్పఁబడుచున్నది భార్యకు మంగళ సూత్ర ధారణము భర్తకు అనన్యార్హత్వము నెట్లు సూచించునో, అట్లే - తిరు మంత్ర ధారణము చేతనులకుఁ గల భగవ దనన్యార్హత్వమునకు ప్రకాశక మైనదని తోఁచునట్లు, ఈ తిరు మంత్రము నొక మంగళ సూత్రముగ నిరూపించి,

" పదినాఱ్ కైయామ్ ఇరండు శరడాయిఱుక్కుం లౌకికమాన మంగళ సూత్రం పోల న్నిక్కై ఎట్టిళై యాయ్ మూన్ఱు శరడా యిరుప్ప దొరు మంగళసూత్రం పోలె ఎట్టు తిరువ రమాయ్ మూన్ఱు పదమా యిరక్కిఱ ఇ త్తిరు మంత్రమ్ "

— (ముముక్షు ప్పడి)

పదు నారు పోగులై, రెండు పేటలై యున్న లౌకిక మంగళ సూత్రము వంటిది గాక, ఎనిమిది పోగులై, మూడు పేటలై యున్న ఒక మంగళ సూత్రము వలె ఎనిమిది దివ్యాక్షరములై, మూడు పదములై యుండు ఈ తిరు మంత్రమును మంగళ సూత్ర ముగఁ జెప్పి, దీనిచే ఆచార్యుని ద్వారమున సర్వేశ్వరుఁడు ఆత్మ లలో సంబంధమును గలిగించుకొని రక్షించుచున్నాఁడు

" ఓం నమో నారాయణయేతి మంత్రోపాసకః।
వైకుంఠ భవనం గమిష్యతి "

— (నారాయణోపనిషత్తు)

అష్టాక్షరీ మంత్రము నుపాసించువాఁడు - వైకుంఠ లోకమునకు బోగలఁడు

"నారాయణం జపే న్నిత్యం ప్రణమ్య పురుషోత్తమమ్
స్వపన్ నారాయణం విప్ర స్తిష్ఠన్ జాగ్రన్ సనాతనమ్
ఉన్మిషన్ నిమిషన్ వా ఽపి నమో నారాయణేతి వై
భోజ్యం పేయం చ లేహ్యం చ నమో నారాయణేతి యః
అభిమన్త్ర్య స్పృశన్ భుఙ్క్తే స యాతి పరమాం గతిమ్ "

సనాతనుఁడగు పురుషోత్తమునకు నమస్కరించి, ప్రతి దినము నారాయణుని జపింపవలయును నిద్రించుచున్నను, నిలుచు న్నను, మేల్కొని యున్నను, కంటి రెప్పలు మూయుచు తెఱచు

చున్నను, వానియందుఁ గాని, తేనె యున్నను వానిని అష్టాక్షరీ మంత్ర ముతో నభిమంత్రించి ఎవఁడు భుజించునో, అతఁడు పరము పదము నొందఁ బోవును

త్రయో వేదా ష డంగాని ఛందాంసి వివిధా స్స్వరాః
సర్వ మష్టాక్షరాంతస్థం యచ్చాన్య దపి వాఙ్మయమ్ "

మూఁడు వేదములు, ఆఱు వేదాంగములు, ఛందస్సులు వివిధము లైన స్వరములు, వాఙ్మయమునకు సంబంధించిన ఇతరము లన్నియు అష్టాక్షరాంతర్గతములే

' యథా సర్వేషు దేవేషు నాస్తి నారాయణాత్పరః
తథా సర్వేషు మంత్రేషు నాస్తి చాష్టాక్షరాత్పర "

ఎట్లు సర్వ దైవములలో నారాయణుని కంటెను పర మైన దేవత మఱియొకటి లేదో, అట్లే - మంత్రము లన్నింటిలో తిరు మంత్రము కంటెను పర మైన మంత్ర మింకొకటి లేదు

"సర్వ వేదాంత సారార్థ స్సంసారార్ణవ తారకః
గతి రష్టాక్షరో నృణా మపునర్భవ కాంక్షిణామ్ "

సర్వ వేదాంతములకు సార మైన అర్థమై, సంసార సముద్ర మును దాటించ గల అష్టాక్షరీ మంత్రము - మోక్షమును కోరిన వారికి రక్షకము

"ఆర్తా విషణ్ణా శ్శిథిలాశ్చ భీతా
ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం
విముక్త దుఃఖా స్సుఖినో భవన్తి "

నష్ట మైన ఐశ్వర్యము కోరువారును, నూతన మైశ్వర్య కాము లును, భగవత్ప్రాప్తి లేనివారును (కేవలులు), సంసారము వలన భయ పడినవారును, ఘోర మైన, సంసార వ్యాధుల యందు మునిఁగి

వారును (పరమాప్తులు), మంత్రాంతరముల సంబంధము లేక, నారాయణ శబ్ద మాత్రము ననుసంధించి, తమ తమ దుఃఖముల నుండి విడువంబడినవారై, సుఖమును పొందఁగలరు

" కిం తత్ర బహుభి ర్మంత్రైః కిం తత్ర బహుభి ర్వ్రతైః నమో నారాయణా యేతి మంత్ర స్సర్వార్థ సాధక "

అష్టాక్షరీ మంత్రము సర్వార్థములను సాధించి ప్రసాదించును గనుక, ఇతరము లైన అనేక మంత్రములతో - వ్రతములతోఁ బని యేమి ?

ఇట్లు చతుర్థ సంస్కార రూప మగు తిరు మంత్రము - సర్వోత్కృష్ట రూపమై, అవైదికము లైన ప్రణవ రహిత మంత్రాంతముల వలె గాక, తదనుసంధాన పరులకు భోగ రూపమై, ఐశ్వర్య - కైవల్యాది దాయకమై, సంసారార్ణవ తారకమై, గొప్పచున్నది ముముక్షువు లీ మంత్రమును విధి పూర్వకముగ సదాచార్యుల వలన ఉపదేశమ పొందవలె నని శాస్త్రములు వక్కాణించుచున్నవి తాపాది పంచ సంస్కారములలో నిది చతుర్థ సంస్కారము. తాప సంస్కారము, పుండ్ర సంస్కారము, నామ సంస్కారము, మంత్ర సంస్కారము అను నీ నాల్గు సంస్కారములు సిద్ధించిననేఁ గాని, యాగ (భగవ దారాధన) సంస్కారమున కర్హుఁడు కాఁజాలఁడు పైఁ జెప్పఁబడిన నాల్గు తరగితులయందలి సర్వ లక్షణములు గలవాఁడై, అష్టాక్షరీ మహా మంత్రమును సదాచార్యుని మూలమున నుపదేశ మును పొంది

" మంత్రం స ప్రణవం ప్రణామ సహితం
ప్రావర్తయద్వం ముహుః "

అని ముకుంద మాలలో కులశేఖరాళ్వారు లుద్ఘాటించినట్లు, నిరంతరము ఆ మహా మంత్రము ననుసంధించువాఁడు మంత్ర పారకుఁ డనఁబడును.

## ౬. వైష్ణవులు

" దేవాంతరవ న్నిత్యం శబ్దాదీ నపి కుత్సయన్
విష్ణు ప్రాప్తి ఫలాకాంక్షీ భక్త్యుపాయో హి వైష్ణవ "

— (ప్రపన్న ధర్మ సార సముచ్చయము)

విష్ణు ప్రాప్తి యను ఫలము గోరి, భక్తిని ఉపాయముగా గొని, అన్య దేవతలను అన్య ప్రయోజనములను, అన్యోపాయమును పరిత్యజించి, నిత్యము - శబ్ద స్పర్శ రూప రస గంధాదుల నెవఁడు గర్హించునో, అతఁడు వైష్ణవుఁ డనబడును

ఇచ్చట శబ్దమును గర్హించుట యనఁగా - ధ్వని చెవిలోఁ బడకుండుటకై చెవులు మూసికొని యుండుట కాదు పామరుల గానము, శృంగార లౌకిక వర్ణన విషయ మగు గానము, వింతలు గలిగించు మంత్రములు గల తాంత్రికుల పాండిత్యము నభివృద్ధి చేయు ముచ్చటలు విన రాదు భగవ ద్ధర్మ విషయములు, కథలు, భగవ న్నామ సంకీర్తనము లవశ్యముగా విన వలయును. స్పర్శ మనగా - అంగనాలింగనాదుల చేతను, సుగంధ ద్రవ్యముల చేత ను సంతసించుట కాదు. భక్తి తన్మయత్వముచే దేహము స్మృతి దప్పుట యని యర్థము. రూప మన గా - కాముకుఁడై తన కభీష్ట మగు రూప సౌందర్యమును చూచి భ్రమించుట కాదు అనంత కల్యాణ గుణ పరి పూర్ణుఁడగు శ్రీమన్నారాయణుని, ఆతని జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజస్సులను సేవించుట. రస మనఁగా - ఉప్పు, పులుసు మొదలగు షడ్రుచులను చవి జూచుట కాదు వైకుంఠ నాథుని కథా సుధా రసము నొక నిమేష మైనను వదలక, ధారక మనియు, పోషక మనియు తలంచి యాస్వాదించుట. గంధ మనఁగా - అత్తరు, పన్నీరు, స్రక్చందన తాంబూలాదులను గ్రహించుట కాదు భగవంతునకు సమ

ర్పించిన సుగంధ ద్రవ్యములను, ప్రసక్చందనములను, తులసీ దళము లను, పుష్పములను స్వీకరించి యాఘ్రాణించుట.

"న చలతి భగవత్పాదారవిందాల్లవ నిమేషార్థ మపి స వైష్ణవాగ్రః"

— (భాగవత వాక్యము)

ఏ వర్ణమునకుఁ జెందినవాఁడైనను, విష్ణు భగవానుని పాదార వింద ములందు చింతను క్షణ కాల మైనను విడువకుండునో, అతఁడు వైష్ణవుఁ డనఁబడును

"పరం బ్రహ్మ పరం ధామ యో௨సౌ బ్రహ్మ తథాపరమ్
త మారాధ్య హరిం యాతి ముక్తిమ ప్యతి దుర్లభామ్"

— (విష్ణు పురాణము 1-11-46)

వైష్ణవులు విష్ణు భగవాను నాశ్రయించి, అనన్య భక్తితో నారాధించి, శరణంచి, బ్రహ్మాది దేవతలకు సైతము దుర్లభ మగు మోక్షమును పొందగలరు

"కేవా న సంతి భువి వారిరుహావతంస
హంసావళీ వలయినో జల సన్నివేశః
కిం చాతకః పల మపేక్ష్య స వజ్ర పాతాన్
పాయోధరీం కలయతే నవ వారి ధారాన్."

లోకములో కలహంస యుతములు, కమలాకరములు నైన నదులు, తటాకములు ఎన్ని యున్నను, చాతక పక్షి పిడుగులతో తొలకరి మేఘములనుండి వర్షించు నీటి బిందువులను మాత్రమే త్రాగు' నని దండి మహాకవి వక్కాణించినట్లు, వైష్ణవులు దేవతాంత రముల వలనఁ గలుగు అల్ప ఫలముల నాశించ కూడదు, వారిని

కూడదు, సేవింప గూడదు. కష్టములు వాటిల్లినను, అవి
గ్యములుగా భావించి, అతని చరణారవిందములయందే
యవలయును

"నాన్యం వదామి న శృణోమి న చింతయామి
నాన్యం స్మరామి న భజామి న చాశ్రయామి
భక్త్యా త్వదీయ చరణాంబుజ మంతరేణ
శ్రీ శ్రీనివాస ! పురుషోత్తమ ! దేహి దాస్యమ్"

క్తితో నీ చరణారవిందములను దప్ప, మఱి దేనిని వచింపను,
ంతింపను, స్మరింపను, ఆశ్రయింపను కనుక, శ్రీనివాసా !
మా ! ని దాస్యమును మా కొసంగుము' అని, ఇట్లు
ైన భక్తితో విష్ణు భగవానుని భజించువాఁడు వైష్ణవు డన

"తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్"
నమును సదాచార్యుని మూలమున పొందవలయును.

"తద్దర్శనం సదాచార్య మూలమ్"

— (అద్వయతారకోపనిషత్తు)

వైష్ణవ దర్శనము సదాచార్య మూలక మైనది సదాచార్య
ుణము లేని వారికిని, తద్వంశ సంభవులకును భగవత్కటా
లుగ జాల దనియు, వారు భగవ న్నిర్హేతుక కృపకు
గుదు రనియు అనేక ప్రమాణము లున్నవి కనుక, విష్ణు
ులు ధరించియే విష్ణువు నారాధింపవలయును.

"విష్ణ్వర్చా రహితే గ్రామే విష్ణ్వర్చా రహితే గృహే
న కుర్యా దన్న పానాదీన్ న తత్ర దివసం వసేత్."

— (ప్రపన్న రత్నాకరము)

విష్ణువు నారాధింపని గ్రామ మందును, గృహ మందును అన్నమును భుంజరాదు. నీరు త్రాగరాదు. అచ్చట నొక దిన మైన నుండరాదు.

"యద్గృహే నాస్తి తులసీ సాలగ్రామ శిలార్చనా
శ్మశాన సదృశం విద్యాత్త ద్గృహం శుభ వర్జితమ్"

— (ప్రపన్న రత్నాకరము)

ఏ గృహమందు తులసీ సాలగ్రామార్చన లుండవో, ఆ గృహము శ్మశాన తుల్యము. కాబట్టి, తాపాది పంచ సంస్కార సంపన్నులై, అధికారమునకుఁ దగిన సదాచార నిష్ఠగలవారై, గృహమున తిరువారాధన ప్రతి నిత్యము విధి విహితముగ సమర్పించుచు, శబ్దాదులను సవాసనగాఁ బరిత్యజించి వర్తించు మహనీయులు వైష్ణవులనబడుదురు

## 6 శ్రీ వైష్ణవులు

"బాహ్యార్థ నిరతాన్ సర్వాన్ సమ్యక్ త్యక్త్వా సదా శుచిః
శక్తిమాన్ పుండరీకాక్షే శ్రీ వైష్ణవ ఉదాహృతః"

— (ప్రపన్న ధర్మ సార సముచ్చయము)

ఆత్మ వస్తువు కంటెను ఇతరములైన పదార్థములందు విశేషాసక్తి గల వారిని సంపూర్ణముగ వదలి, సదాచార సంపన్నుఁడై, శ్రియః పతియందు భక్తి గలవాఁడు శ్రీ వైష్ణవుఁ డనఁబడును

'పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్
రత్నాని ధన ధాన్యాని క్షేత్రాణి చ గృహాణి చ"

— (శరణాగతి గద్య)

అను సటుల - బాహ్య సంబంధములను సవాసనగా విడచుటయు, సర్వేశ్వరుఁడే రక్షకుఁ డని భావించుటయు, పురుషార్థ

ప్రాప్తికి యథోచిత మైన ప్రయత్నము చేయుటయు, జీవిత పర్యంతము సర్వేశ్వరుని కభిమతము లైన స్థలములలో ప్రవణుడై, భగవద్గుణానుభవములయందే ప్రొద్దు పుచ్చుటయు, ఇట్లు వర్తించు శ్రీ వైష్ణవుల మహిమ నెఱిగి, సంతోష చిత్తుడై యుండుటయు, తిరుమంత్రము నందున, ద్వయమునందును నియతుడై యుండుటయు, ఆచార్యుని యందును, శ్రియః పతియందును కృతజ్ఞుడై యుండుటయు, జ్ఞానము - విరక్తి - శాంతియుం గలిగిన పరమ సాత్త్వికులతో సహవాసము చేయుటయు, శ్రీ వైష్ణవాధికారి కవశ్యాపేక్షితములు ఇట్టి యధికారికి రహస్య త్రయ మనుసంధింపఁ దగినది

' ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తు శ్చ ప్రత్యగాత్మనః
ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తే తథా ప్రాప్తి విరోధి చ
వదంతి సకలా వేదా స్సేతిహాస పురాణకాః
మునయశ్చ మహాత్మానో వేద వేదార్థ వేదిన "

— (శ్రీ వచన భూషణము)

ప్రాప్యుఁడగు పరమాత్మ యొక్క స్వరూపమును, ప్రాప్తమగు జీవాత్మ యొక్క స్వరూపమును, ప్రాప్తికి గా నగు నుపాయమును, ప్రాప్తి విషయికము లగు విరోధులను ముముక్షువులు ముఖ్యముగా తెలియవలె నని వేద శాస్త్ర పురాణేతిహాసము లన్నియు ప్రబోధించు చున్నవి. మహాత్ములు, మహర్షులు, వేద వేదార్థముల నెఱిగినవా రందఱును ఈ యర్థ పంచక జ్ఞానము ఆత్మోజ్జీవమున కత్యంతావశ్యక మనియు, అదియే మోక్ష సాధన హేతు వనియు తెలిపియున్నారు ఈ యర్థ పంచక జ్ఞానము వలన, అనాది యగు భగవత్సంబంధ మేర్పడి, దాని మూలమున భగవత్సౌహార్దము, కృపా కటాక్షము కలిగి, దీనిచే సత్త్వ గుణము వృద్ధి పొంది, తద్ద్వారమున మోక్ష సుఖము లభించును.

వెనుకటి తరగతి యందుఁ జెప్పినట్లు - బాహ్యాభ్యంతర శుచియై, శ్రీ శ్రియః పతుల యెడ భక్తి గలవాఁడై, షోడ శోపచారములతో - విధి విహితముగ నారాధించుటచే, జ్ఞాతృ జ్ఞేయ సంబంధము గలిగి, శ్రీ వైష్ణవుఁ డగుటయు - ఇందు స్వ స్వామి సంబంధమున పిరాట్టి పురుషకార భూతురా లగుటయు, ఇందువలన, వైష్ణవుఁడు అను శబ్దమునకు కైంకర్య వర్ధక మగు 'శ్రీ' శబ్ద మధిక మగుటచే శ్రీ వైష్ణవుఁ డనియు, శ్రీ శబ్దముచె పిరాట్టి యొక్క పురుషకారము లభించి, ఆమె దయా స్వభావమునకు పాత్రుఁడు కాఁగల డనియు తెలియుచున్నది. కనుక, భక్ష్యాభక్ష్య విమర్శన - వందన - భావన - తీర్థ ప్రసాద స్వీకారాదుల విషయమును తెలిసి వర్తించవలెను జాతి దుష్టమును, ఆశ్రయ దుష్ట - నిమిత్త దుష్టములను పరిత్యజించి, భక్ష్య యోగ్యము లగు శాకాదులతో భగవ దారాధనఁ గావించి, అతిథులను, అభ్యాగతులను పూజింపవలయును

" దేవతాంతరము తదీయ సంగతి గూడ
వదలి వచ్చినవాఁడె వైష్ణవుండు
శబ్దాది విషయ సంచయము కా దని రోసి
వలదు నా కనువాఁడె వైష్ణవుండు
కర్మా ద్యచేతనాకార సాధన నిష్ఠ
వలన మగిడినవాఁడె వైష్ణవుండు
అన్య మంతయు మాని హరి బట్టి యా పట్టు
వానిదె యనువాఁడు వైష్ణవుండు
మనకు నీ యర్థములు చెప్పి మనలఁ గావ
నవతరించిన యతిరాజు నాశ్రయించి
వాసి యెఱింగిన వాఁడె శ్రీ వైష్ణవుండు
ముఖ్యుఁ డని చెప్పె లక్ష్మణ ముని వరుండు."

— (ముముక్షు జన కల్పకము)

ఇట్టి గుణములు గలవారే శ్రీ వైష్ణవులు ఇట్టి వారిని సేవించు నపుడు -

" నమ స్కుర్యాచ్చ తాన్ సర్వాన్ భక్తి భావ సమన్వితః
స్వయం నమస్కృతో యేన నమ స్కుర్యా త్పునశ్శతమ్ "
— (కపింజల సంహిత

భక్తి భావముతో నమస్కరించవలయును. వారే మొదట నమస్కరించిన యెడల, తిరిగి నూరు నమస్కారములు చేయవలయును. శ్రీ వైష్ణవుల యెడ, తన యాధిక్యమును వ్యక్తము చేయరాదు. ఆత్మ స్తుతి చేసికొనరాదు నైచ్యానుసంధానము కలవాడై మెలగ వలయును

సంసారి యయ్యును జితేంద్రియుడై, అభిజన విత్త విద్యాదులను, అహంకార మమకారములను సవాసనగా విడనాడి, లోక వాసనల నంటక, 'లక్ష్మణో లక్ష్మి సంపన్నః' అనునట్లు, భగవద్భాగవ తాచార్య కైంకర్య ధురంధరుడై, శ్రీ వైష్ణవుల యెడ కొంచమైన నపచారపడక, వారియందుఁ గల సుగుణ సంపత్తినే కొనియాడుచు, త్రికరణ శుద్ధి గలవాడై, శ్రీ విశిష్టుఁడగు విష్ణువు నందు భక్తి గలవాఁడు శ్రీ వైష్ణవుఁ డనఁబడును.

## ౮. ప్రపన్నుఁడు

" శబ్దాదీన్ విషయాం శ్చైవ దేహోపాధిక బాంధవాన్
త్యక్త్వా హరౌ న్యస్త భర స్స ప్రపన్న ఉదాహృతః "
— (ప్రపన్న ధర్మ సార సముచ్చయము)

శబ్ద స్పర్శ రూప రస గంధాదులయందు ప్రీతియు, దేహ సంబంధము వలన ప్రీతియు, వారు తన్ను రక్షింతు రను విశ్వాసము

వదలి, పరమాత్మయందు తన యోగ క్షేమ భారము వైచి యుండు వాఁడు ప్రపన్నుఁ డనఁబడును.

" దేహాసక్తాత్మ బుద్ధి ర్యది భవతి పదం సాధు విద్యా త్తృతీయం
స్వాతంత్ర్యాంధో యది స్యాత్ ప్రథమ మితర శేషత్వ దీశ్చే ద్ద్వితీయమ్
ఆత్మత్రాణో న్ముఖ శ్చే న్నమ ఇతి చ పదం బాంధవా భాస లోల
శబ్దం నారాయణాఖ్యం విషయ చపల దీ శ్చేచ్చ తుర్థీం ప్రపన్నః "

— (అష్ట శ్లో॥)

ప్రపత్తి మార్గ నిష్ఠుఁ డగు ప్రపన్నుఁడు - దేహము నందు లగ్న మైన ఆత్మ యనెడి బుద్ధి కలవాఁ డయ్యే నేని, ప్రణవ మందు మూఁడవది యగు మకారార్థమును చక్కఁగా తెలియవలయును స్వాతంత్ర్య మనెడు గ్రుడ్డి తనము గలవాఁ డయ్యె నేని, ప్రణవ మందలి మొదటి పదము యొక్క అర్థమును తెలియవలయును. భగవ ద్భాగవ తాచార్యులు గాక, ఇతరులకు శేషుఁడ ననెడి బుద్ధి గలవాఁ డయ్యె నేని, ప్రణవ మందలి ద్వితీయ పద మైన 'ఉ'కారార్థమును దలఁపవలయును తన్ను దాను రక్షించు కొనుటయందు ప్రయత్నము గల వాఁ డయ్యె నేని, 'నమః' పదమును స్మరింపవలయును. బంధువుల వలె గానవచ్చు వారు (సోపాధిక బంధువులు) రక్షకు లనెడి యభి ప్రాయము గలవాఁ డయ్యె నేని, 'నారాయణ' శబ్దము యొక్క అర్థ మును దలఁపవలయును. శబ్ద స్పర్శ రూప రస గంధాదుల యందు ఆశ గల బుద్ధి గలవాఁ డయ్యె నేని, నారాయణ శబ్దమునకుఁ జేరి యుండు 'ఆయ' అను పదము యొక్క అర్థమును దలప వలయు' నని, భట్టరు వారు సాయించి యున్నారు.

" పర వ్యాస బలా దేవా స్వ ప్రయత్న నివృత్తయే. "

చాతక పక్షి వే ఱొక జలము త్రావక, మేఘోదకమునకై నిరీక్షించునట్లు, ప్రపన్నుడు వే ఱొక దాని నాశ్రయింపక, భగవంతుని గుఱించి మాత్రమే నిరీక్షించుచుండును. కపోతము తన తోడి కపోతము ను విడిచి యుండజాల నట్లు, ప్రపన్నుడు భగవద్విశ్లేషమును సహించి యుండజాలడు ఇదియే - ఆధారాధేయ సంబంధము.

"ముముక్షువాయ్ మోక్షార్థ మాగ సర్వేశ్వరనై ప్పత్తి యిరుక్కుమవనుక్కు అనన్యత్వముమ్ అకించనత్వముమ్ వేణుమ్"

— ముముక్షు ప్పడి)

ప్రకృతిని విడువ దలచినవాడై, మోక్షము కొఱకు సర్వేశ్వరు నాశ్రయించియుండు వానికి - 'పాపములను పోగొట్టి, నన్ను పరమ పదము చేర్చుటకు వే రెవ్వరును గతి లే' రనుకొనుటయు, ఎవ్వ రేని లే కున్నను పోనిమ్ము - శాస్త్రమున సత్కార్యములుగా చెప్పబడిన యజ్ఞ యాగాది కర్మ యోగాదుల బలము గాని, అహింసా సత్య వాక్యాదుల సహాయము కొంచె మైనను లేదనియు వే రెవరను గతి లే రనియు -

"అంకిచనో ఽనన్య గతి శ్శరణ్య
త్వ త్పాదమూలం శరణం ప్రపద్యే"

— (స్తోత్ర రత్నము - 22)

అనునట్లు న్యస్త భరుడై యుండువాడు ప్రపన్నుడు అట్టి ప్రపన్నుడు - ఉపాయ ఫల్గునత్వము, ఉద్దేశ దుర్లభత్వము, స్వాశ్రిత దోష భూయస్త్వము అను శంకా త్రయమును వర్జింపవలయును.

"శ్రీ భాష్య ద్రవిడాగమ ప్రవచనం శ్రీశ స్థలే ష్వన్వహం
కైంకర్యం యదు శైల నిత్య వసతిః సార్థ ద్వ యోచ్చారణమ్
యద్వా భాగవ తాభిమాన వసతిః శ్రేయ స్సతా మి త్యలం
శిష్యాన్ ప్రాహ యతీశ్వరః పర మగాత్ విష్ణోః పదం శాశ్వతమ్."

ప్రపన్నుఁడు శ్రీ భాష్యాది గ్రంథములను పఠించుచు, ఇతరులకుఁ జెప్పుచు, కాలము గడుపుకొనవలయును అది చేతఁ గాదేని, ద్రావిడ దివ్య ప్రబంధములను, అనఁగా - భగవ ద్విషయ ప్రవచనము గావించుచుండవలయును. అదియును చేతఁ గాదేని, దివ్య తిరుపతులయం దెల్లప్పుడు సేవా కైంకర్యములను నిర్వర్తించుచుండవలయును అదియును చేతఁ గాదేని, యదు శైల మందు నిత్య నివాసము చేయవలయును అదియును చేతఁ గాదేని, అర్థ పూర్వకముగా ద్వయానుసంధానముతో కాలము గడుప వలయును అదియును చేతఁ గాదేని, ఒక భాగవతోత్తముని యభిమానమున నొదిగి, నిత్య కైంకర్యము చేయుచున్న చాలు నని భగవ ద్రామానుజులు ప్రపన్నులగు తమ శిష్యులకు చరమోపదేశము చేసి, శాశ్వత మగు విష్ణు సాయుజ్యము నలంకరించిరి.

ఇందుఁ జెప్పఁబడిన క్రియ విధానము ఒక దాని కంటె నొకటి కష్ట సాధ్య మైనది అన్నిటి కంటెను సులభ మని చెప్పిన మార్గమే బహు కష్టము ఇది తెలిసియే శ్రీమ ద్రామానుజులు కడపట, 'ఒక వైష్ణవుని కృపకు పాత్రుఁ డై యున్న చాలు' నని చేసిన ఉపదేశము పరమోత్కృష్ట మైనది గనుక, ప్రపన్నుఁడు ఇందలి ప్రాముఖ్యమును తెలియవలయును ప్రపన్నునకు ఖ్యాతి లాభములతోఁ బని లేదు. 'కృపా ఫలమో! కర్మ ఫలమో!' అని యనుభవించి, న్యస్త భరుఁ డై యుండవలెను

" అతిథీ చాపవాదీ చ ద్వా విమౌ మమ బాంధవౌ
అపవాదీ హరే త్పాపం అతిథి ర్మోక్ష దాయకః. "

ప్రపన్నునకు అతిథి, అపవాది అను వారిరువురును బాంధవులు. అతిథి పాకమును హరించును అపవాది అసూయా గ్రస్తుఁడై, ఓర్వ లేక, నిందలు మోపుచు, తిట్టుచు, దూషించుచు, వీనికిఁ గల పాప సంచయమును తాను సంక్రమింపఁజేసికొనును భాగవతోత్తముఁడైన అతిథి - వీని యాతిథ్యమును స్వీకరించి, ప్రపన్నుఁడై అనుగ్రహించి, అమృత పదమును పొందించును

" అష్టోత్తర సహస్రం చ ధ్యాన యుక్తో జపే ద్బుధః
అష్టోత్తర శతం వా ఽ పి ద్వయం నిత్య మతంద్రితః
సాయం ప్రాత ర్జపే న్నిత్యం నిష్కామో విజితేంద్రియ
ద్వయం ద్వాదశ వారం చ స్నానే పానే చ తర్పణే
కృత్వా నిత్యం జపం కుర్యాత్ వైష్ణవో మంత్ర ఉత్తమ "

అనునట్లు, ప్రపన్నుఁడు జితేంద్రియుడై, స్నాన పాన తర్పణాది సమయములలో - నిష్కామముగా ద్వయానుసంధానము చేయవలయును

" మంత్ర రత్నానుసంధాన సంతత స్ఫురితాధరమ్. "

అనునట్లు - ప్రపన్నుఁడు అష్టాక్షరీ మంత్రమును నిరంతర మనుసంధించుచు, ఇట్లు నియమ పూర్వకముగా ననుసంధించు ప్రపన్నాగ్రేసరులను మిగుల జాగరూకతతో సేవించుచుండవలయును. లేనిచో, అపరాధమునకు కారణము కాఁగలదు పైఁ జెప్పిన తెగల వారిని పంక్తి పాకాదులకు నిర్బంధింపరాదు వారి వారి యభిమతానుసారము వర్తించుటయే వాంఛనీయము. ఈ పద్ధతి అద్వైతు లందును గలదు.

౧ వైశ్వ దేవ పరులు (స్మార్త కర్మ ప్రారంభించినవారు) ౨ దీక్షితులు (ఆధానము చేసినవారు, శ్రౌత కర్మ నారంభించిన వారు) 3 సోమయాజులు (యాగము చేసినవారు) ౪. చైనులు (ఇష్టకో ధానము చేసినవారు) ౫ పౌండరీకయాజులు ౬ సర్వతోముఖులు ౭. వాజపేయాజులు వీరు - నైమిత్తిక కర్మాచరులు కావున, స్వయముగా నైనను, లేక తగినవారినైనను పర్సుఅచుకొందురే గాని, ఇతరుల పంక్తి పాకాదుల నస్వాయింపరు కనుక, పరమ పావను లైన భాగవతోత్తముల యెడ, 'తలఁపులో మెలగెడి దాస్య కరణి' అనునట్లు, వారి భావములఁ గుర్తెఱిగిఁ నడచుటయే తదీయుల సమ్మతము మఱియు - ప్రాకృత దేహ బంధువుల పట్ల కోసి వేయఁబడిన సకల బాంధవ్యాను లను, సకలాత్మకులకును శాశ్వత వ్యాజ సర్వ విధ బంధువగు శ్రియః పతి యందు దృఢముగ సంక్రమింపఁజేసిననే అనవధికాతిశయ ప్రీతి కలుగు నని తలంచి -

త్వ మేవ మాతా చ పితా త్వ మేవ
త్వ మేవ బంధు శ్చ గురు స్త్వ మేవ
త్వ మేవ విద్యా ద్రవిణం త్వ మేవ
త్వ మేవ సర్వం మమ దేవ దేవ । "

— (శరణాగతి గద్య)

ఓ దేవా ! నీవే మాతా పితృ బంధు స్వరూపుఁడవు. సంసార సాగరోత్తారకుఁడ వగు సదాచార్యుఁడవు సర్వ శ్రేష్ఠ మైన బ్రహ్మ విద్యయు, ధన ధాన్యాదిక మైన సమస్తము నీవే. అసదృశ ప్రభావము గల నీవు మాకు పూజ్యతముఁడవు త్రిలోకములందును నీ కంటె ఆశ్రయింపఁ దగిన వాఁడు లేఁడని, న్యస్త భరుఁడై యుండువాఁడు ప్రపన్నుఁడు.

## ౫. ఏకాంతులు

" హరే రాజ్ఞానురూపేణ కర్మ జ్ఞానాది యో నరః
స ఏకాంతీ భవే ద్ద్విప్ర స హి భాగవత స్స్మృత "
— (ప్రపన్న ధర్మ సార సముచ్చయము)

కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తి యోగములు భగవ దాజ్ఞా రూపములు కావున, ఆ యోగములను యథా విధిగ నిష్కామముగ నిర్వర్తించువాఁడు ఏకాంతి యనియు, భాగవతుఁ డనియు చెప్పఁబడును.

" ఏకాంతీ వ్యపదేష్టవ్యో నైవ గ్రామ కులాదిభి
విష్ణునా వ్యపదేష్టవ్యో తస్య సర్వం స ఏవ హి
ఇందనం చాగ్ని సంయుక్తం వృక్ష నామ న జాయతే "
— (విలక్షణ మోక్షాధికారి నిర్ణయము)

అనునట్లు, దుఃఖాలయ మగు సంసారమునుండి నిరస్త దోషుఁడై, సకలావతారములకు హేతు భూతుఁ డైన శ్రీమన్నారాయణుని దివ్య స్వరూపమును సేవించి, వేద - యాగ - యోగ - క్రియా - జ్ఞాన - తపో ధర్మములచే నారాధించుచు, కుల ధర్మము లను పాటింపక, ధ్యాన - ధారణ - సమాధి నిష్ఠుఁడై, ఆత్మ పరమాత్మల సంబంధము నవలోకించి, జ్ఞానాగ్నిచే పూర్వాఘములను, ఉత్తరాఘములను నశింపఁజేయు శక్తి గల మహాత్ములే ఏకాంతులు.

" శ్వపచో హి మహీపాల ! విష్ణు భక్తో ద్విజాధిక
విష్ణు భక్తి విహీన స్తు యతి శ్చ శ్వపచాధమ "

శ్వపచుఁ డైనను విష్ణు భక్తుఁ డగు నేని, అతఁడు ద్విజుని కంటెను అధికుఁడు విష్ణు భక్తి విహీనుఁ డైన యతి - శ్వపచుని కంటెను అధముఁడు

" నిర్గత కర్మంబై, నిరుపాధికంబైన జ్ఞానంబు - హరి భక్తి లేకున్నచో శోభ లేదు ఫలము గోరక, కర్మను ఈశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు భక్తి హీనంబులైన జ్ఞాన - వాచా - కర్మ - కౌశలంబులు నిరర్థకంబులు "

— (ఆంధ్ర భాగవతము)

కావున, కర్మ చయ మంతయు మాని, హరి భక్తి సేవా తత్పరుండై యుండుటే ఏకాంతి ధర్మము.

" సత్యం బ్రవీమి మనుజా స్స్వయ మూర్ధ్వ బాహు
యో మాం ముకుంద ! నరసింహ ! జనార్ద నేతి
జీవన్ జప త్యనుదినం మరణే ఋణీవ
పాషాణ కాష్ఠ సదృశాయ దదామి ముక్తిమ్. "

— (శ్రీమ ద్భాగవతము)

మానవులారా ! చేతు లెత్తి నేను సత్యము చెప్పుచున్నాను. ఎవరు నన్ను తమ జీవిత కాలమున 'నరసింహా ! ముకుందా ! జనార్దనా !' అని ప్రతి దిన మన నుసంధింతురో, వారు - మరణ కాలమున కఫ వా పిత్తములచే స్మృతి లేక, పాషాణము వలె, కాష్ఠము వలె పడి యున్నను, అప్పు దీసికొన్నవాఁడు తిరిగి అప్పును చెల్లించు నట్లు నేనే వారిని స్మరించి, వారికి ముక్తిని ప్రసాదింపగల'నని శ్రీ నరసింహస్వామి సెల విచ్చెను

" విను మంబొజభవుండు మున్ను మదిలో వేదంబు ము మ్మాఱు నె
మ్మనమందున్ దలపోసి, యెంతయుఁ బరామర్శించి, మోక్షంబు ద
క్కన మార్గంబున వెంట లే దనుచు భక్తిన్ జింత జేసెన్ జనా
ర్దను నాత్మాకృతి నిర్వికారుఁ డగుచున్ ద న్మార్గ నిర్ణేతయై "

— (ఆంధ్ర భాగవతము)

" చతు ర్ముఖాదీనాం సర్వేషాం
వినా విష్ణు భక్త్యా, కల్ప కోటిభి ర్మోక్షో న విద్యతే "
— (మహా నారాయణోపనిషత్తు)

కోటి కల్పములు ప్రయత్నించినను, బ్రహ్మాదులకు సైతము విష్ణు భక్తి లేకున్నచో మోక్షము సిద్ధింపదు

" భక్త్యా పరమయా వాఽపి ప్రపత్త్యా వా మహా మతే
ప్రాప్యోహం నాన్యదా ప్రాప్యో మమ కైంకర్య లిప్సుభిః "

పరమ భక్తిచేఁ గాని, ప్రపత్తి చేగాని నా కైంకర్యమందు కోఁకలు గలవారు నన్ను పొందఁ గలరే కాని, మఱి యొక రీతిగా నన్ను పొందఁ జాల' రని పరమాత్మ సెల విచ్చెను.

" భవ త్యరోగో ద్యుతిమాన్ బల రూప గుణాన్వితః
న వాసుదేవ భక్తానా మశుభం విద్యతే క్వచిత్
జన్మ మృత్యు జరా వ్యాధి భయం వా ప్యుపజాయతే "
— (శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్ర మాహాత్మ్యము)

విష్ణు సహస్ర నామముల భజించు వాడు రోగ పీడితుఁడు కానేరఁడు. కాంతి - బల - రూపములు గలవాఁ డగును. వాసుదేవ భక్తులకు అశుభ మనునది తెలియరాదు. జనన మరణ వ్యాధుల వలన భయము లేశ మైనఁ గలుగదు.

సర్వ కాల సర్వావస్థలయందును, వాచిక - కాయిక - మానసికములచే శ్రీమన్నారాయణుని ధ్యానింపవలయును ఇట్టి ధ్యానముచే, ధారణా శక్తి కలుగును. దీనిచే సమాధి స్థితి సిద్ధించును. ఎట్లనగా - కటిక చీఁకటిలో నిద్ర నుండి కన్నులు నులుము కొనుచు లేచువానికి ప్రారంభమున భగవ త్స్వరూపము స్పష్టముగాఁ దెలియక, 'ఓ

సర్వేశ్వరా! ఓ సర్వ శక్తుఁడా! ఓ సర్వజ్ఞుఁడా!" అని పిలుతురు. ఈ గుణములు కూడ భగవంతునియం దుండుటచే, ఇతఁ డెట్లు పిలిచినను తన స్వరూపముతోనే ఆతడుఁ కనఁబడను. కాంతి వచ్చిన పిమ్మట సర్వ పదార్థములు స్వరూపముతో యథావస్థితములుగా గన్పట్టును. దూరమున నుండు నొక పురుషుఁడు గుర్తింపరానపుడు, 'ఓ యయ్యా' అని పిలుతురు. ఇట్లే, భగవంతునితో నిత్య సాంగత్యము గల భక్తులు పరిచయ బలము వలన పేరు బెట్టి, అవయవవర్ణనముతోఁ బిలుతురు. తక్కిన వారి కట్టి పరిచయము, స్వాతంత్ర్యము ఉండవు భక్తులకు - ఇతరులకుఁ గల తారతమ్య మిదియే

శ్రీ కృష్ణ భగవానుఁడు సెల విచ్చిన 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' (భ గీ 7-18) అను వాక్య మందలి యంత రార్థమును గ్రహించువారికి కాల క్రమమున తమో గుణము వదలి, సత్త్వ గుణము వృద్ధి పొందును, భక్తి ఉదయించును. దాని మూలమున భగవదనుగ్రహము లభించును.

" నాహం వేదై ర్న తపసా న దానేన చేజ్యయా
శక్య ఏవం విదో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా "
" భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విదో ఽ ర్జున !
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరం తప "

అర్జునా ! వేదాధ్యయనము చేతను, దానము చేతను, తపస్సు చేతను, యాగము చేతను నీవు నా రూపమును చూడఁ జాలవు. ఇతర ప్రయోజనము గోరని భక్తి చేతనే నన్ను తెలిసికొనుటకు, చూచుటకు, పొందుటకు సాధ్య మగు' నని శ్రీ కృష్ణ భగవానుఁడు ప్రబోధించుచున్నాడు.

"పాప వర్తనుండు బ్రాహ్మణుం డయ్యును
నిజము గాదు కంటె నిచ తముఁడు
సత్య శౌచ ధర్మ శాలి శూద్రుం డయ్యు
నతఁడు సద్విజుండె యనిరి బుధులు."

— (ఆంధ్ర మహా భారతము)

" విప్రా ద్విషడ్గుణయుతా దరవింద నాభ
పాదారవింద విముఖా చ్ఛ్వపచం వరిష్ఠమ్ "

— (శ్రీమ ద్భాగ వతము)

పన్రెండు ఉత్తమ గుణములు గల విష్ణు భక్తి విహీనుని కంటెను, భగవ ద్భక్తి కలిగిన చండాలుఁడు శ్రేష్ఠుఁడు

" అన్నం పానం ధనం వస్త్రం ఆయు రారోగ్య మాస్పదమ్
ఆప ద్యపి న యాచేత పూజకః పురుషోత్తమమ్. "

అన్నము, పానము, ధనము, వస్త్రము, ఆయువు, ఆరోగ్యము, గృహము, క్షేత్రము, పశువులు మొదలగువానిని ఎంతటి యాపదలం దైనను భక్తుఁ డగువాఁడు భగవంతుని యాచింపరాదు. ఏ కోరికలు లేక చేయు దాస్యమే ముముక్షువులకు స్వరూపము, కైంకర్యమే స్వభావము, భగవ ద్ధ్యానమే విధి. కనుక, సర్వము భగవత్స్వరూపముగ భావించి, భగవ త్సేవయు, గురు సేవయు, భాగవత సేవయు చేయు చుండవలెను భక్తి విహీనులు పూజనీయులు కారు. భక్తులు సర్వ కాల సర్వావస్థ లందును పూజ్యులే అట్టి వారి భక్తి - క్రమముగ నభివృద్ధి పొందుచుండునే కాని, ఎన్నటికిని క్షీణింపదు. ధనము వలెను, అధికారము వలెను కొంత కాలమున కిది నశింపదు. సంపూర్ణ ఫల మొసంగు వఱకు ఎన్ని జన్మము లైనను వెంట నంటియే యుండును.

" చతుర్వేద దరో విప్రో వాసుదేవం న విందతి
వేద భార భరాక్రాంత స్స వై బ్రాహ్మణ గార్దభః. "

నాల్గు వేదములను క్షుణ్ణముగా నధ్యయనముచేసిన బ్రాహ్మణుఁడైనను, వాసు దేవునియందు భక్తి లేని యెడల, అతఁడు బ్రాహ్మణ గార్ధభ మని తెలియ వలయును

కర్మ యను మహారణ్యమును జ్ఞాన మను పరశువుచే ఛేదించి, భక్తి యను అగ్నిచే దహింపఁజేసి, ప్రపత్తి యనబడు రాజ మార్గమును బఱచి, పరమాత్మను సేవింపవలయును ఇందు మనో వ్యాపారము ముఖ్యము. కనుక, ముందు - మనస్సును స్వాధీనము చేసికొనవలయును మనుష్యు డెన్నడును దానికి లోఁబడరాదు మనస్సు స్వాధీనమైన పిమ్మట, త దితరము లగు ఇంద్రియము లన్నియు అప్రయత్నముగా లోఁబడి పోగలవు

" యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్
తత స్తతో నియ మ్యైత దాత్మ న్యేవ వశం నయేత్ "

— (భగవ ద్గీత 17-8 )

చంచలము - అస్థిరము నగు నీ మనస్సు - ఏ యే విషయము లందు ప్రవర్తించుటకు బాహ్య ప్రపంచమున సంచరించుచున్నదో - ఆ యా విషయములనుండి ఈ మనస్సును అభ్యాస బలముచే మరలించి, నిరంతరము పరమాత్మయందే లగ్నము చేయవలయును.

మనస్సు - ప్రకృతి సంబంధమైన త్రిగుణములు కలది. స్థూల ప్రకృతి - దేహము . సూక్ష్మ ప్రకృతి - మనస్సు కావున, ఆహార నియమముల ననుసరించి, అట్టి మనస్సు ప్రవర్తించుచుండును.

" ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్విక ప్రియా "

— (భగవ ద్గీత 17-8)

ఆయువును, సత్త్వ గుణమును, బలమును, సుఖమును, ప్రేమను వృద్ధిఁ జేయు రసముతోఁ గూడినట్టియు, తైలముతోఁ గూడినట్టియు, మనోహరము లగు నట్టియు పదార్థములు సాత్త్వికులకు ప్రియ మైనవి.

పరిశుద్ధ మైన ఆహారము స్వీకరించువారి మనస్సు - పరిశుద్ధ ముగనే ఉండును. కనుక, పరిశుద్ధ మైనట్టియు, సాత్త్విక మైనట్టియు ఆహారమునే స్వీకరింప వలయును దాని వలన ఇంద్రియ నిగ్రహము కలుగును ఇంద్రియములు లోఁబడినప్పుడు, వాని నన్నిటిని ఏకాగ్ర ముగఁ జేసి, ఒకే కార్య మందు నియోగింప వచ్చును అది భగవ త్కార్యముగ నుండు నేని, భక్తికి మూలమై, ముక్తికి హేతువగును. ముముక్షువులు ఇట్లు వర్తించు టావశ్యక మని భగవ చ్ఛాస్త్రములు నొక్కి- వక్కాణించుచున్నవి. కనుక, భగవ ద్జ్ఞానసారము ఇంద్రి యములను నిగ్రహించి, మనస్సును వశ మొనర్చుకొని, భగవంతుని యందు సంతత తైల ధార వలె భక్తిని ప్రసరింపఁజేయు మహనీ యుఁడు ఏకాంతి యని చెప్పఁబడును.

## ౧౦. పరమైకాంతులు

"ప్రీత్యర్థం వాసు దేవస్య కర్మ జ్ఞానాదికం నరః
స విప్రః పరమైకాంతీ మహా భాగవత స్స్మృత "

— (ప్రపన్న ధర్మ సార సముచ్చయము)

భగవ త్ప్రీతి కొఱకై, కర్మము - జ్ఞానము - భక్తి - ప్రపత్తి - ఆచార్యాభిమానము అను నిష్ఠల యందు, కర్మను కైంకర్య మందును - జ్ఞానము స్వప్రకాశమునందును - భక్తిని పొంగదగిన వస్తువు నందును, ప్రపత్తిని స్వరూప యాథాత్మ్య జ్ఞానమునందును ప్రవర్తింపఁ జేసి, పంచమోపాయ నిష్ఠ గలిగినవాఁడు పరమైకాంతి యనియు, మహా భాగవతో త్తముఁ డనియు చెప్పఁబడును.

" నారాయ ణైక కంఠస్య యా యా చేష్టా త దర్చనమ్
యో యో జల్ప స్స జపః త ద్ధ్యానం య న్నిరీక్షణమ్ "
(పరమ హితోపదేశము)

శ్రీమ న్నారాయణుని యందే అచంచల మైన భక్తి భావము గల వానికి - ఏ యే చేష్ట కలుగునో, అదియే భగవ దర్చన మగును, ఏ యే పలుకులు వెడలునో, అదియే మంత్ర జపమగును. ఎ య్యది దృష్టియో, అదియే ధ్యాన మగును

" త త్పాదాం బ్వతులం తీర్థం త దుచ్ఛిష్టం సుపావనమ్
త దుక్తి మాత్రం మంత్రాగ్ర్యం త త్స్పృష్ట మఖిలం శుచిః "

ఆ మహనీయుని పాద జలము పరమ పవిత్ర మైన తీర్థము. ఆతని భుక్త శేషము మహా ప్రసాదము. ఆతని యానతి మంత్ర రాజము ఆతని దివ్య స్పర్శము మోక్ష దాయకము.

పైఁ జెప్పఁబడిన పది తరగతులవారును - మూఁడు తెగలుగా నిట్లు విభజింపఁబడుచున్నారు :-

౧ అద్వేషుఁడు ౨. అనుకూలుఁడు 3 దివ్య నామ ధరుఁడు ఈ మువ్వురును సహవాస యోగ్యులు

౧ చక్రాంకుఁడు ౨ మంత్ర పాఠుఁడు 3. వైష్ణవుఁడు ౪ శ్రీ వైష్ణవుఁడు ఈ నల్గురును సత్కార యోగ్యులు

౧ ప్రపన్నుఁడు ౨. ఏకాంతి 3 పరమైకాంతి అను నీ మువ్వురును ఆచార్య తుల్యులు.

వివేక - విమోకములు, అభ్యాస - క్రియా - కల్యాణములు, అనవసాదము, అనుద్ధర్షము అనెడు విమోక సప్తకము లెట్లు బ్రహ్మ విద్యా ప్రాప్తికి సోపానములో, అట్లే - దశ విధ వైష్ణవు లనెడు పది తరగతులును పరమ పదమునకు సోపానము లని తెలియ వలెను.



ద్వితీయ కౌముదిలో కొండలు కవి కోవిదులు



శ్రీ చింతలపాటి నరసింహదీక్షితశర్మ



ఆచార్య కె వి ఆర్ నరసింహం



శ్రీమాన్ కొమాండూరు గోపాలకృష్ణమాచార్యులు

# ఆంధ్ర వాఙ్మయము - వైష్ణవ మత ప్రభావము

ఆచార్య. కె వి ఆర్. నరసింహం

*

## మానవుఁడు - మతము

అవకాశ మనంత మైనది అందలి గ్రహ నక్షత్రముల పరస్పర కాంతి సంయోగాధిక్య న్యూనత్వాది భేదముల వలన, భిన్నత్వము లైన ప్రాణుల యస్తిత్వమున కాభాసము సిద్ధించుచున్నది అనఁగా - అణువునకు ప్రత్యేకతా ప్రతిపత్తి కలుగుచున్న దని దీని తాత్పర్యము. ప్రాణు లన్నియును ప్రత్యేకతా ప్రతిపత్తి కలిగిన యణువులే. అట్టి యణువు లన్నింటిలో - ఒక విశిష్ట మైన యణువు మానవుఁడు. మానవుని యొక్క - లేక, ప్రాణి యొక్క అస్తిత్వ రూప మైన యాభాస స్వరూప స్వభావాదులను వివరించి చెప్పునదియే తత్త్వము. తత్త్వము యొక్క గమ్యము అవకాశముగ మాఱుటయే చిత్తయినను, అచిత్తయినను - తత్త్వము యొక్క రూపాంతరములే

తత్త్వ శాస్త్రముచే నుద్దేశింపఁబడిన గమ్యమును జేరుటకు కొక మెట్టు వంటిది మతము. మననము చేయఁబడినదియే మతము మనన మనఁగా - ఇట సత్యము యొక్క మనస మన్న మాట మననము చేయవలసి వచ్చునప్పటికి, సత్యమును వ్యావహారిక స్థాయిలోనికి దింపవలసి వచ్చినది. సత్యము యొక్క వ్యావహారిక స్థాయిలోని ప్రతీకయే విష్ణువుగాని, శివుఁడుగాని, మఱి - అట్టి దింక నేది యైనను గూడ

## మతము - వాఙ్మయము

విష్ణువును పరబ్రహ్మముగాఁ జెప్పునదియే వైష్ణవ మతము. వాక్కులతో నిండినదే వాఙ్మయము. మననము యొక్క వ్యక్తరూపమే వాక్కు. మననమునకును, వాక్కునకును మూలము హృదయము. హృదయ మనఁగా - ఇట చిత్తమన్న మాట ఇంకను స్పష్టముగాఁ జెప్పవలె నన్నచో - హృదయ స్పందనము యొక్క సూక్ష్మ రూపము మననము. స్థూల రూపము వాక్కు. స్థూల సూక్ష్మ రూపములు రెండును - ఒక దానిని విడిచి, మఱి యొకటి యుండఁజాలవు. ప్రకృతిని విడిచి పరమాత్మ ఉండలేఁడు. పరమాత్మను విడిచి ప్రకృతి యుండలేదు. పరమాత్మ మూలమున ప్రకృతి వ్యక్త మగుచున్నది. ప్రకృతి ద్వారమున పరమాత్మ వ్యక్త మగుచున్నాఁడు. ఇట్లే - వాఙ్మయము, మతము అనునవి రెండును - ఒక దానిని విడిచి, మఱి యొకటి యుండ నేరవు.

మానవుని హృదయము నందలి క్షుధను దీర్చుకొనుటకు నుపయుక్త మగు నొక సాధనమే మతము. మనవుని హృదయ మందలి క్షుధ యొక్క ఆవేదనను వ్యక్తము చేయునదియే వాఙ్మయము. అనఁగా - మతము యొక్క ప్రభావము వాఙ్మయముపై నుండుట - అతి సహజ మైన విషయ మని యర్థము. మత స్పర్శ - లేశ మాత్ర మైనను లేక, ప్రపంచము నందలి యే వాఙ్మయము గూడ లే కుండుటకు హేతు విదియే. పూవును తావి వీడి యుండనట్లు, ఆంధ్ర వాఙ్మయ ప్రారంభము నుండి నేఁటి వఱకు - మత స్పర్శ - లేక, ప్రభావము ఉండనే యున్నది.

ఆంధ్ర వాఙ్మయముపై వైష్ణవ మత ప్రభావ మన్నప్పు డిక్కడ నొక విషయమును స్పష్టము చేయవలసి యున్నది. వైష్ణవ మత

మున్న స్వతంత్ర రచనలే యిక్కడ ప్రధానముగా నుద్దిష్టములు. అంత మాత్రమున, వైష్ణవ మత ప్రభావ మున్న సంస్కృతాది యాంధ్రీకరణము లిట నుపాదేయములు కావనుట కాదు. విష్ణు వనఁగా - కేవలము ఆది విష్ణువే గాక, ఆయన యొక్క కృష్ణ - రామ - నరసింహావతారములు గూడ నిట గ్రాహ్యములే.

## సింహగిరి నరహరి వచనములు

శ్రీ వైష్ణవ మత ప్రభావము గల ఆంధ్రి వాఙ్మయమునందు మొట్ట మొదట పేర్కొన వలసినవాఁడు కృష్ణమాచార్యులు. లయ బద్ధముగ నడచు వచన సంకీర్తన సృష్టికి ఆద్యుఁడాయన. ఆయన, రెండవ ప్రతాపరుద్రుని కాలమునాఁటి వాఁడని ఏక శిలా నగర చరిత్రాదులవలన తెలియుచున్నది. సింహాచల క్షేత్రము నందలి శ్రీ వరాహ లక్ష్మీ నరసింహ స్వామిపై, కృష్ణమాచార్యులు అనేక సంకీర్తనములను రచించినాఁడు. నవ విధ భాగవత భక్తి సంప్రదాయానుసారము - భగవంతునకు, భక్తునకుఁ జెప్పఁబడెడు నవ విధ సంబంధములలో - పితా పుత్ర, రక్షక రక్షిత, శేషి శేష, స్వామి దాస, అధా రాధే యాది సంబంధములు కృష్ణమాచార్యుల సింహగిరి నరసింహ వచనములందు ప్రధానముగా గనిపించును. 'సింహగిరి నరసింహ నమో నమో దయానిధీ!' అని, ప్రతి వచనము చివరను వచ్చుచుండును. ఈ సింహగిరి నరహరి వచనములనే కాక, శరకోప విన్నపములు, కొన్ని చూర్ణికలు, కొన్ని సంకీర్తనలును గూడ కృష్ణమాచార్యులు రచించినట్లు తెలియ వచ్చుచున్నది. శరకోపముని ద్రావిడ వేదమునకు తెనుఁగు సేతయే యీ విన్నపములు. 'నమో నమో లక్ష్మీ వల్లభా!' అనునది యీ విన్నపములకుఁ గల మకుటము. విష్ణు నామోచ్చారణ మాహాత్మ్యమును సింహగిరి నరహరి వచనములలో నెట్లుల్లేఖించెనో గమనింపుఁడు -

"దేవా ! పదికోట్ల యజ్ఞాది క్రతువులు నడపంగా నేమి, తొమ్మిది కోట్ల తులాభారంబులు తూగంగా నేమి, యెనిమిది కోట్ల సువర్ణ దానంబులును, ఏడు కోట్ల గోదానంబులును, ఆఱు కోట్ల భూ దానంబులును, అయిదు కోట్ల కన్యా దానంబులు, నాలుగు కోట్ల వస్త్ర దానంబులును నడుపంగా నేమి, మూఁడు కోట్ల నత్యాది వ్రతంబులు సేయంగా నేమి, రెండు కోట్ల యన్న దానంబులు గావింపఁగా నేమి, కోటి స్నానంబులు సేయంగా నేమి, మీ నామోచ్చారణంబు సేయక పది కోట్ల యజ్ఞాది క్రతువులు నడపిన దేవేంద్రుండు నిలు వెల్ల యోను లయ్యెను తొమ్మిది కోట్ల తులాభారంబులు తూఁగిన దుర్యోధనుండు యమ పురి కేగెను ఎనిమిది కోట్ల సువర్ణ దానంబులు సేసిన కర్ణుఁడు పసిండి కొండ మీది యన్నంబుల కపేక్షించెను ఏడు కోట్ల గోదానంబులు చేసిన కార్త వీర్యార్జునుండు, గో హత్యా - బ్రహ్మ హత్యా పాతకంబులఁ బొందెను ఆఱు కోట్ల భూ దానంబులు చేసిన బలి - విష్ణు పాదంబునఁ బాతాళంబున కేఁగెను అయిదు కోట్ల కన్యా దానంబులు చేసిన ధ్రువుండు కాశీ క్షేత్రంబునఁ బండ్రెండు వేల యేండ్లు భిక్షం బెత్తెను నాలుగు కోట్ల వస్త్ర దానంబులు చేసిన మార్కండేయుండు మతి హీనుం డాయెను రెండు కోట్లన్న దానంబులు చేసిన ధర్మజుండు యమ పురి తొంగి చూచెను కోటి స్నానంబులు చేసిన కుమారస్వామి కోరిక సిద్ధించ దాయెను దేవా ! మీ నామోచ్చారణంబులు చేసి, ప్రహ్లాద నారద పుండరీక వ్యాస శుక శౌనక భీష్మ దాల్భ్య రుక్మాంగద ధ్రువ బలి విభీషణ భృగు గాంగేయాక్రూర విదురాదు లగు పరమ భాగవతోత్తములు కృతార్థులైరి కావున, యతి రామానుజ వరం దాతారు (?) అనాథపతి యైన స్వామీ ! సింహగిరి నరహరీ ! నమో నమ దయానిధీ !"

ఈ పంక్తు లన్నింటియందును కృష్ణమాచార్యు లుద్దేశించిన విషయము — విష్ణు నామము నుచ్చరించుటతో, ఎట్టి దానాది క్రియలైనను సరి రా వనుట అనఁగా - విష్ణు నామోచ్చారణ మద్వితీయ మైన దని దీని తాత్పర్యము. తత్త్వ దృష్టితోఁ జూచినచో - క్రియ లన్నియును ఒక్కటియే వానియం దెక్కువ తక్కువ భేదము లేదు. ఆ దృష్టితో - దాన క్రియయు, విష్ణు నామోచ్చారణ క్రియయును ఒక్కటియే కాని, ఇట దాన క్రియ కంటెను విష్ణు నామోచ్చారణ క్రియ

అధిక మైన దనియు, దాని సాటి వచ్చు క్రియయే లే దనియు చెప్పఁబడుట స్పష్టము.

బౌద్ధ జైన క్రైస్త వాది మతము లన్నియు - దానమును పరమాత్మ ప్రాప్తికి పరమ మైన సాధనముగాఁ జెప్పుచున్నవి. ఇఁక హిందూ మతము మాట చెప్పనే యక్కఱ లేదు దానము నంతగా మతము లన్నియును ఎక్కువైనదిఁగా జెప్పుటకు హేతువు - భగవానఁడు చేసిన పరమ దాన రూప మైనది యీ ప్రపంచ మగుటయే. అనంత మైన యీ యవకాశమును, నక్షత్రములను, గ్రహములను, పంచ భూతములను, ఇంకను మిగిలిన సర్వమును తాను సృజించిన ప్రాణుల కయి భగవానఁడు దానము చేసినాఁడు పరమ దానమూర్తి యైన అట్టి భగవానునిఁ జేరుకొనుటకు దానమే పరమ మైన సాధనము. దానము యొక్క రూపమే సన్న్యాసము. అనఁగా - 'నీ విచ్చిన సర్వము ను నాకక్కఱ లేదు వాని నెల్ల నీఁ గలిగిన నీవే నాకు గావలసినది' అని, భగవానుని అర్థించుటయే సన్న్యాసమునందు ప్రతిపాదింపఁబడిన ప్రధానాంశము. పై వచనమునందు విష్ణువును పతిగను, స్వామిగను భక్తుఁడు దర్శించు చున్నాఁ డనుట స్పష్టము అనఁగా - భగవానునకు భక్తుఁడు భార్యయు, దాసుఁడు నగుచున్నాఁడు లేక ఇట పతి శబ్దమునకు రక్షకుఁ డనియు అర్థము చెప్పవచ్చును.

"అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకా ! మీకు పునః పునః నమస్కారంబు చేసి, నా తుచ్ఛ మనస్సున మిమ్ము వర్ణించెద వాక్పతి — బృహస్పతి - దివస్పతుల కైన వర్ణింప నలవి కాని మీ దివ్య తిరునామములు వర్ణించుచున్నాఁడ నో దేవ ! అచ్యుత ! ఆశ్రిత రక్షక ! అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకా ! ఆది మధ్యాంత రహిత ! నమో నమో లక్ష్మీ వల్లభా !"

"శరణాగత వజ్ర పంజరా! నా దురితంబులు ఖండించి, మీ దాసాను దాసులకు దాసుండనై వర్తించే బుద్ధి పుట్టించి, నా దుర్గుణంబులు చూడక, మీ పతిత పావన బిరుదు ప్రతిష్ఠించి, పతితుండనైన నన్ను రక్షింపవే ఆశ్రిత మందార! అఖిల లోకాధార! అఘ దూర! నమో నమో లక్ష్మీ వల్లభా!"

పై పంక్తులయందు ముఖ్యముగా ఈ క్రింది యంశములు గుఱు తింపవలసి యున్నవి భక్తుడైన కృష్ణమాచార్యుల యభిప్రాయమున, భగవానుడైన విష్ణువు - అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడు, శరణాగత వజ్ర పంజరుడు ఆయన భక్తుడైన తాను - పునః పునః నమస్కారములు చేయుచున్నాడు బ్రహ్మకును, బృహస్పతికిని, శార్యునికిని గూడ వర్ణింప శక్యముకాని మాహాత్మ్యము గలిగినది - తిరుమంత్ర ధారణ మని గ్రహించినాడు విష్ణువు యొక్క దాసాను దాసులకు దాసుడై బుద్ధి పుట్టింపవలసిన దని ఆయననే వేడికొను చున్నాడు విష్ణువు సర్వ లోకారాధకుడగను, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడుగను, పరబ్రహ్మముగను గుఱితించుటయు - ఆయనకు ప్రదక్షిణ నమస్కారములు చేయుటయు, తిరు నామమును ఉచ్చరించుటయు, విష్ణువునే శరణము చొచ్చుటయు, విష్ణువు యొక్క ప్రభావమునకు స్పష్ట మైన చిహ్నములు. ఈ సందర్భమున నొక విషయమును విశదము చేయవలసి యున్నది భగవానుడైన విష్ణు వును భక్తుడు తన సర్వస్వముగ నెంచి, శరణము బొందుట యను శరణాగతి భావమును, భగవానుడైన విష్ణువును స్వామిగను భక్తుడు తాను దాసునిగ నెంచుకొనుట యను స్వామి దాస భావమును, అంత మాత్రమే కాక, విష్ణు భక్తుల దాసాను దాసులకు గూడ దాసునిగ భక్తుడు తన్నెంచుకొనుటయు - ఒక్క విశిష్టాద్వైత సంప్రదాయాను సారి యైన వైష్ణవ మతమునందు దప్ప, ప్రపంచమునందలి మఱి యే యితర మతమునందును ఇంతటి ప్రాముఖ్యము వహించినట్లు

కనిపింపదు దశ విధ వైష్ణవ సంప్రదాయము[1] నందలి దిది దివ్య నామ ధారణము

---

1 "అద్వేష శ్చానుకూల శ్చ దివ్యనామధర స్తథా
చక్రాంకీ మంత్రపాఠీ చ వైష్ణవ శ్చ తతః పరమ్
శ్రీవైష్ణవః ప్రపన్న శ్చ ఏకాన్తీ చ పరం తప ।
పరమైకాంతి విఖ్యాతో ద శైతే వైష్ణవా స్స్మృతాః."

— (ప్రపన్న ధర్మసార సముచ్చయము)

(అద్వేషులు, అనుకూలురు, దివ్యనామధరులు, చక్రాంకులు, మంత్ర పాఠకులు, వైష్ణవులు, శ్రీ వైష్ణవులు, ప్రపన్నులు, ఏకాంతులు, పరమైకాంతులు - అని, వైష్ణవులు — పది విధములు

దివ్యనామధరుని లక్షణమును - 'ప్రపన్న ధర్మసార సముచ్చయము' ఈ క్రింది విధముగాఁ జెప్పుచున్నది ,— 'స్మరించుట వలనను, ఉచ్చరించుట వలనను సర్వ పాపములను నాశము జేయు విష్ణువు యొక్క నామమును ధరించినవాఁడే నామధారి.'

"స్మృత్యుచ్చారణ మాత్రేణ సర్వ పాప ప్రణాశనమ్
విష్ణు నామ ధరః పుణ్యో నామధారీ స ఉచ్యతే

నామ మనఁగా — ఇట ఊర్ధ్వపుండ్రమునకును, భగవన్నామమునకునుఁ గూడఁ జెల్లును

"యే వా లలాట ఫలకే లస దూర్ధ్వపుండ్రా
స్తే వైష్ణవా భువన మాశు పవిత్రయన్తి "

ఊర్ధ్వపుండ్రమును లలాట ఫలకమునందు ధరించిన వైష్ణవులు — భువనమును అతి వేగముగా పవిత్ర మొనరింతు రని ప్రపన్నానుష్ఠాన భాస్కరము చెప్పుచున్నది ఊర్ధ్వపుండ్ర ధారణమును వైష్ణవ మత గ్రంథములు బహుధా ఘోషించుచున్నవి వశిష్ఠ కశ్యపాది మహర్షులును - ఊర్ధ్వ పుండ్రమును ధరించినట్లు, యజుర్వేదీయ శతపథ బ్రాహ్మణమునందలి యీ క్రింది పంక్తి స్పష్టము చేయు చున్నది అది .—

"భగవ ద్భ క్తోర్ధ్వపుండ్రో వశిష్ఠః కశ్యపో ఽత్రి రగస్త్య జామదగ్ని
ర్విశ్వామిత్రో యమో వ్యాసః పరాశర స్సనక సనందనః శుకో వామదేవః"

## అన్నమాచార్యుల రచనలు

శ్రీ వైష్ణవ మత ప్రభావము గల ఆంధ్ర వాఙ్మయ సృష్టికి ఆద్యుఁడు కృష్ణమాచార్యులు కాఁగా, ద్వితీయుఁడు తాళ్ళపాక అన్నమాచార్యులగుచున్నాఁడు తాళ్ళపాక కుటుంబమే అట్టిది అన్నమాచార్యులు ముప్పది రెండు వేలకు పైఁగ, సంకీర్తనములను రచించినాఁడు అందు కొన్ని ఆధ్యాత్మిక సంకీర్తనలు, కొన్ని శృంగార సంకీర్తనలు అంతే గాక, వేంకటాచల మాహాత్మ్యము, ద్విపద రామాయణము, వేంకటేశ్వర శతకము శృంగార మంజరి మున్నగు కృతులను. ఇంకను అనేకములైన జోలపాటలు, ఉయ్యాల పాటలు, తలుపు దగ్గర పాటలు, మేలు కొలుపులు, తుమ్మెద పదాలు, మంగళ హారతులు మున్నగు వానిని రచించినాఁడు అన్నమాచార్యుల కృతులలో – చాల వఱకును నేఁడు లభించినవి

తాళ్ళపాకము వారిది – శ్రీ వైష్ణవ మహా భక్త కుటుంబము వైష్ణవ మతమునకు, సంగీతమునకు, సాహిత్యమునకు, అందును – పద కవితకు అది యొక యాలవాలము అలమేలు మంగ – తాళ్ళపాక వారి యాఁడుబిడ్డ యనియు, శ్రీ వేంకటేశ్వరుఁడు తాళ్ళపాకము వారి యల్లుఁడనియు ఆ కుటుంబము వారి నమ్మకము ఆ నమ్మకము అన్నమాచార్యుల కాలము నుండియు వచ్చుచున్నది అన్నమాచార్యులతో ప్రారంభమైన తాళ్ళపాకము వంశీయులు చాల కాలము తిరుపతి వేంకటేశ్వరుని ఆలయమునకు ధర్మకర్తలుగ నున్నట్లు తెలియుచున్నది లక్ష్మి – వారి యింటి యాఁడుఁబిడుచు గనుక, ఇఁక సంపద కేమి కొదువ !

అన్నమాచార్యులు – తాను రచించిన ముప్పది రెండు వేల పైగల కీర్తనలను, సుమారు ముప్పాతిక యంగుళము మందమును –

మూఁడు స్వర యంగుళముల వెడల్పును - ఇరువది యే డిరువది యెనిమిది యంగుళముల పొడవును గలిగిన సీస లైన రాగి రేకులపైఁ జెక్కించి, వాని నొక ప్రత్యేక స్థానములో - తిరుపతి దేవస్థానము నందు భద్ర పఱచెను వానియందు కొన్ని రేకులు నేఁడును చెక్కు చెదరక యున్నవి తన సంకీర్తనముల రేకుల ప్రతులఁ గొన్నింటిని అహోబల క్షేత్రము నందుఁ గూడ అన్నమాచార్యు లుంచినట్లు తెలియు చున్నది కాని, అచ్చటఁ గూడ నేఁ డన్ని రేకులు లభించుట లేదు. తాళ్ళపాక వంశము వారి రచన లన్నియు - వేంకటేశ్వర పరములై, ఆయన కంకితములు గావింపఁ బడినవియే. అన్నమాచార్యు లనఁగా - మూర్తీభవించిన విశిష్టాద్వైతమే శ్రీ వేంకటేశ్వర స్వామియే ఆయనకు పరబ్రహ్మము పన్నిద్ద రాళ్వారుల సంప్రదాయము లన్నియు ఆయన యందు పుంజీభవించినవి. పరమ భాగవతోత్తముల భావనా పరంపర లన్నియు నాయనలో ప్రఁ ఫలించినవి ఆయన తను వెల్ల వైష్ణవము, తల పెల్ల వైష్ణవము పరమేశ్వరుఁ డగు రమేశ్వరుఁడు పవ్వళించిన పాల సముద్రము ఆయన వాఙ్మయము. శ్రీ వేంకటేశ్వరుని బహు విధ సంబంధములతో ఆయన దర్శించినాఁడు ఆ జగత్పతి ముందు - ఒక పసి కందు వలె ఆక్రందించినాఁడు తా నొక తండ్రి వలె, భగవానుని బిడ్డ వలె భావించి, ఉపలాలించినాఁడు దాసుఁడై విన్నపములు చేసినాఁడు ఆయన యెడ నున్న స్వాతంత్ర్యముచే, తా నొక స్వామి వలె ఆనలును బెట్టినాఁడు తానే ఒక ప్రియుని వలె, జగద్వల్లభుని యందు స్త్రైణమైన సుఖము నారోపించి మురిసినాఁడు. ఋగ్వేద కాలమునఁ గల మధుర భక్తికి ఒక ప్రముఖ స్థాన మిచ్చినాఁడు.

అన్నమాచార్యుల దృష్టిలో - వైష్ణవులు కాని వా రెవ్వరును లేరు. ఈ విశ్వ మంతయును విష్ణు ప్రభావమే యని అతని గాఢ విశ్వాసము.

ఉపాయాంతరము లొల్లక భక్తి చే పట్టి
యెపుడూ తీర్థ ప్రసా దేచ్చ తోడ
నిపుణత శ్రీ వేంకటేశ్వరుఁడె గతి యని
పరిశుద్ధి నుండుటే పరమ వైష్ణవము"

ఇతరోపాయములను విడిచి, అనన్య భక్తితో - భగవ త్తీర్థ ప్రసాదములను స్వీకరించుచు, శ్రియః పతికి శరణాగతుఁడై, పరి శుద్ధ మైన మనస్సుతో వర్తించుటయే పరమ వైష్ణవ మని అన్నమాచార్యుల భావనము

"ఏ కులజుఁ డైన నేమి? యెవ్వఁడైన నేమి?
ఆరు డైన భూత దయా నిధి యగు వాఁడే
తగిలి వేంకటేశు దాసుఁ డైనవాఁడు"

ఏ కులజుఁ డైనను - భూత దయ గల్గి, భగవ ద్దాసుఁడై యున్నచో - అతఁడు వైష్ణవుఁడే యని అన్నమాచార్యుల యభిప్రాయము వేంకటేశ్వరునికి, తనకును గల శేషి శేష సంబంధమును ఎంత మధురముగా వెల్లగించెనో చూడుఁడు -

"మనసు నీ యధీనము మాటలు నా వా దేటివే
తనువు నీ పుట్టించిన ధన మిది
చేగ దేర నీవు నన్ను జేసిన మానిసి నింతే."

"చిక్కి నాలో నై నది శ్రీ వైష్ణవ ధర్మము
తొక్కినది భావము తుది పదము
యెక్కినది హరి భక్తి యిది పట్ట పేనుఁగు
యెక్కువ కెక్కువే కాక యింక నేల చింత?"

అనియే ఆయన యొక్క నిరంతర సంతుష్టి. వేంకటేశ్వని యెడ నూహించిన స్వాతంత్ర్యము నంతను వ్యక్తము చేయుట కాయ తాన

నొక పసి బాలునిగఁ జూచినాఁడు ఇట్టి స్థితిలో - అన్నమాచార్యుల యాతురతను గమనింపుఁడు -

"బయటం బెట్టకుఁతే పక్షులు పొరెడు ప్రొద్దు
ఓ యమ్మ బాలరకు నొప్ప దందురు
పంచలం దిప్పకురే పాములు వెళ్ళేటి ప్రొద్దు
కొంచెపు బాలర పైకొను నందురు"

మధుర భక్తుఁ డైన అన్నమాచార్యుల నొక పరి పరిశీలింతము తన్ను స్త్రీగను, వేంకటేశ్వరుని తన పతిగను భావించి అన్నమయ్య తన పతితో సౌఖ్యమును గోరుచున్నాఁడు. పరిశీలింపుఁడు

'ఉదుటఁ జనుదోయి నీ యురముపైఁ దనివార
నదిమి మోమున మోము నలమి యలమి
వదలైన నీవితో వాలుఁ గన్నుల జక్కు
లొచవ నీ మీఁద నే నొరగు టెన్నఁడురా!"

పద్మావతీ వేంకటేశ్వరుల శృంగారమును మంజరీ ద్విపద ఛందస్సులో అన్నమయ్య తన శృంగార రస మంజరి యందు రమ్యముగా వర్ణించినాఁడు ఆయన ద్విపద రామాయణము, వెంకటాచల మాహాత్మ్యము ఇంత వఱకును లభింప లేదు. లాలి పదములు, జోల పాటలు ఉయ్యాల పదములు మున్నగు వాని యందు - కొలఁదిగ మాత్రము నేఁడు లభించు చున్నవి. ఇవి యన్నియును వేంకటేశ్వర స్వామిపైఁ జెప్పినవే. తమ పూర్వులు స్మార్తు లైనను - తాను వైష్ణవమును స్వీకరించి, యెంతయో వాఙ్మయమును సృజించుటయే కాక, ఒక శ్రీ వైష్ణవ మహా భక్త కుటుంబమునకే ఆద్యుఁడు కాఁ గలిగినవాఁడు - అన్నమాచార్యులు

అన్నమాచార్యులను గూర్చి, తాళ్ళపాక చిన్నన్న - తన అన్నమాచార్య చరిత్రమునందు, ఈ క్రింది విధముగా ననుచున్నాఁడు:-

"పచ్చి తామసుల మమ్ముం బరమ సాత్త్వికులగా
నిచ్చటనే చేసినాడు యెంత చిత్రము ;
ఇచ్చగించి మా కులాన నెన్నడు లేని వైష్ణవ
మచ్చముగా గృప సేసె నన్నమాచార్యుండు "

తాళ్ళపాక వారి వంశమున, ఎన్నడును లేని వైష్ణవ వ్రతమును స్వీకరించి, తరువాతి వారి నందఱిని వైష్ణవులుగాఁ జేసి, అమూల్య మైన వైష్ణవ వాఙ్మయ సృష్టికి హేతుభూతుఁ డైనవాఁడు అన్నమయ్య యనుట ఇందు స్పష్ట మగు చున్నది తామసు లైన తన వంశము వారిని సాత్త్వికులుగాఁ జేసినాఁ డనుటయు పై యభిప్రాయమును ధ్రువ పఱచు చున్నది తామస ప్రవృత్తి గల వ్యక్తులను సాత్త్విక ప్రవృత్తి గల వ్యక్తులుగాఁ జేసినాఁ డని యొక యర్థము తాను మాఱుటకు మత మెంత కారణమో - అట్లే, ఇతరుల ప్రవృత్తిని మార్చుటకుఁ గూడ కారణము మత మనుట స్పష్టము ఇందులకు మతమే కారణము కానిచో - ఇతరులను మార్ప వలసిన యావశ్యకత తన కే మున్నది ? శివుఁడు తమస్సునకును, విష్ణువు సత్త్వమునకును ప్రతీకను లైనవారు తామసులను సాత్త్వికులుగాఁ జేసినా రనుటలో - శివ సంబంధ మైన విశ్వాసము గల వారిని, విష్ణు సంబంధమైన విశ్వాసము గలవారుగాఁ జేసినాఁ డనుట స్పష్టము తాళ్ళపాక చిన తిరుమలాచార్యులు తన సంకీర్తన లక్షణ గ్రంథమందు - 'వేంకట శైల వల్లభుని నుతులై, తాళమపాక యన్నయ వచో నూత్న క్రియల్ జెన్నగు' ననుచు, అన్నమాచార్య పదముల యితర గుణములతో పాటుగ, వానియందున్న సంకీర్తన ప్రాధాన్యమును నొక్కి వక్కాణించినాఁడు. ఇం కొక మాట. నీ కింత వైష్ణవ మేల యని ప్రశ్నించువారికి, అన్నమాచార్యులే యీ క్రింది విధముగా సమాధానము చెప్పినాఁడు.

"ఎవ్వరి వాఁడ గాను ఏ మందు నిందుకు
తలఁగరో లోకులు తడవకురో మమ్ము
నరహరి కీర్తన నానిన జిహ్వ
బరుల నుతింపఁగ నోపదు జిహ్వ"

అయ్యలారా ! మీ కొక నమస్కారము నా దారిన నన్ను బోనిండు, నన్ను మాటి మాటికిని శ్రీ వైష్ణవుఁడని యెత్తి పొడవకుఁడు. నాయకులారా ! మీ రెన్ని పర్యాయములు నన్ను అనినను, నే నీవేళ మాఱువాఁడను గాను హరిని దప్ప ఒరులను నా జిహ్వ నుతింప లేదు అందులకు నన్నని ప్రయోజనమేమున్నది ? అని యర్థము. నిజముగా - ఎంతటి వైష్ణవ మెంతటి వైష్ణవ మన్నమయ్యది ! తన్ను గూర్చి యితరు లెన్ని విధముల నెన్ని యెన్ని మాఱు లనుకొన్నను, ఆయనకుఁ గల సంతృప్తి ఒక్కటియే విశ్వ మెల్ల విష్ణు మయముగ గన్పించి తనిసి తరించిన ధన్యుఁడు - అన్నమాచార్యులు

## సుభద్రా కల్యాణము

అన్నమాచార్యుల భార్య యైన తిమ్మక్క - సుభద్రా కల్యాణమును గేయముగా రచించినది గ్రంథాంతమున -

"— — — ఈ పాట పాడినా విన్న
శ్రీ హరి వారికి చేరు వై యుండు."

సుభద్రా కల్యాణ గేయమును పాడినను, విన్నను శ్రీ హరి పాడిన వారికి, విన్న వారికి చేరు వయి యుండు నని తిమ్మక్క వక్కాణించుటకు కారణము వైష్ణవ మత ప్రభావమే

## పెద తిరుమలాచార్యుల రచనలు

అన్నమాచార్యుల పుత్రుడు పెద తిరుమలాచార్యులు ఆయం ఇంచు మించుగ రెండవ యన్నమాచార్యులే ఆయన వలెనే శ్రీ వేంకటేశ్వర స్వామి భక్తుఁడు. ఆయన వలెనే సంకీర్తనలు, మేలుకొలుపులు, మున్నగు వానిని రచించినాఁడు ఆయన వలెనే తన కృతుల నన్నిటిని వేంకటేశ్వర స్వామికే అంకితములు చేసినాఁడు. అన్నిటిని మించి ఆయన వలెనే, వైష్ణవ మతము లేనిది తాను లేనని చెప్పఁ గలిగిన యట్టివాఁడు. ఈ విషయము మన కాయన కృతులే స్పష్టము చేయును శృంగార సంకీర్తనలు, శృంగార దండకము, శృంగార వృత్త శతకము, వైరాగ్య వచన మాలికా గీతములు, చక్రవాళ మంజరి, వెంకటేశోదాహరణము, సుదర్శన రగడ, మేలుకొలుపు ద్విపద, ఆంధ్ర హరి వంశము, వేంకటేశ నీతి శతకము మున్నగునవి యీాయన రచనలు

ఈయన కొన్ని యధ్యాత్మ సంకీర్తనములను రచించినాఁడు ఈ యధ్యాత్మ సంకీర్తనములం దన్నిటను అన్నమయ్య తత్త్వమే వ్యక్తమగును తన్ను స్త్రీగభావించుకొని, పతియైన వేంకటేశ్వరునితో తనకుఁ గలిగిన శృంగారానుభూతిని, వేంకటేశ్వరునికి ఇతర లైన ఆయన ప్రియులకును గల శృంగారమును తన శృంగార సంకీర్తనల యందు పెద తిరుమలయ్య వర్ణించాడు శృంగార వృత్త శతకము, చక్రవాళ మంజరి అను గ్రంధములలో వేంకటేశ్వరుని శృంగారమే వర్ణింపఁబడినది వేంకటేశ్వరుని మాహాత్మ్యమును గూర్చి చెప్పునదియే వేంకటేశోదాహరణము. విష్ణువు యొక్క సుదర్శన మహత్త నుల్లేఖించునదియే సుదర్శన రగడ. మేలుకొలుపు ద్విపదమును, ఆంధ్ర హరి వంశమును ఇంత వఱకు లభింప లేదు.

ఇఁక ప్రత్యేకముగాఁ బేర్కొనఁ దగినవి - పెద తిరుమలాచార్యుల వైరాగ్య వచన మాలికా గీతములు వేంకటేశ్వరుని గూర్చి, తన్నామాంకితముగాఁ జెపఁబడినట్టి గీతి ధర్మ ప్రకృష్టమైన మాలిక వంటి వచనము లివి కృష్ణమాచార్యుల సింహగిరి నరహరి వచనముల యొద్దలలో నివి యుండును పెద తిరుమలాచార్యుల వైరాగ్య భావనము వేంకటేశ్వరుని యెడఁ గల భక్తియు వీని యన్నింటి యందును నిండ యున్నవి ప్రధానముగా పెద తిరుమలయ్య, ఈ వచనములలో - విష్ణువును, అనఁగా - వేంకటేశ్వరుని పితగను, రక్షకునిగను, శేషిగను, అజ్ఞేయి గను, స్వామిగను, ఆధారునిగను దర్శించినాఁడు.

"నిగమ గోచరా

పురాణంబు చదువం జూచిన
శూర్పణఖా విరాధ కబంధ రావణ కుంభకర్ణాదుల
నామంబులు నోరం దెరలెడిని

అది మాని జపంబు సేయం బూనిన నావలింతయు
నిద్రయు నలసత్వం బొడివెడిని

యది చాలించి తీర్థ యాత్రా కుతూహలుండ నైన
తురష్క చోర వ్యాఘ్ర మకరాది భయంబుల వడంకం
జేయం దొడంగెడిని

యీ రీతుల నా ప్రయత్నంబు లెక్కడి కెక్క
నే నొక్కటి దలంచిన వే రొక చందంబున
నీ మాయ భ్రమించుచున్నది

యే యుపాయంబున నిన్ను నా వశము సేసుకొనియెద
నా చందము నాకు బోధింపవే నీవు జగద్గురుండవు
నా రహస్యము ని చేత నున్నది శ్రీ వేంకటేశ్వరా!"

ఈ పంక్తులలోఁ జెప్పఁబడిన పురాణ పఠనము, జపము, తీర్థ యాత్రా వేదనమును మతము యొక్క యావరణ లోనివే. వేంక

శ్వరుని వశము చేసి కొనవలె నని భక్తుని యిచ్ఛ అందులకుఁ దగిన యుపాయము బోధింప వలసిన దని భగవానుని భక్తుఁడు ప్రార్థించు చున్నాఁడు భగవంతుఁడు తనకు వశము కావలె నని భక్తుఁడు కోరుటయందు, భక్తి కంటెను మతము యొక్క వాసనయే యెక్కువ అట్లని, భక్తి - మతము లోనిది కా దనుట కాదు పరానురక్తి రూపము - పరమ ప్రేమ రూపము నైనది భక్తి భక్తి యందు పరానురక్తియు - పరమ ప్రేమయుఁ దప్ప, మఱి యొకటి యేదియు నుండదు తన సర్వస్వమును ప్రేమించిన వ్యక్తికి సంపూర్ణముగా నర్పించుటయె ప్రేమ యొక్క లక్షణము ప్రేమించిన వ్యక్తి యొక్క సర్వస్వము తిరిగి లభించును గాని, ఆ విషయము నెఱు తాను ప్రేమించిన వ్యక్తి యొక్క సర్వస్వము మరల తనకు లభింపవలె నని కాని, ఆతఁడు తనకు వశము కావలె నని కోరుకొనుట కాని పరమ ప్రేమ రూప మైన భక్తి యందు మనకుఁ గనుపింపదు. అట్టి కోర్కె, మనకు మతము యొక్క ప్రభావ మున్న చోట మాత్రమే కనిపించును అందులకు కారణము - భక్తి యందు మనః ప్రవృత్తి సంపూర్ణత వైపుగఁ బోవును కాని, మతము నందు మనః ప్రవృత్తి - సంపూర్ణత వైపుగఁ గాక, ఒక ప్రత్యేకత వైపుగఁ బోవును ఈ యంశమే పెద తిరుమలాచార్యుల పై వైరాగ్య మాలికా గీతము నందు మనకుఁ గనిపించును ఏ మైనను, మతము యొక్క ప్రభావము అన్నమయ్య - పెద తిరుమలయ్యల మహాత్వమున కే మాత్రము కొదువ నాపాదింపఁ జాలదు

## శ్రీ పాద రేణు మాహాత్మ్యము

తాళ్ళపాక అన్నమాచార్యుల దౌహిత్రుఁ డైన రేవణూరి వేంకటాచార్యులు - శ్రీ వేంకటేశ్వర స్వామి వారి పాద రేణువు యొక్క

మాహాత్మ్యమును శ్రీ పాద రేణు మాహాత్మ్య మను పేర రచించినాఁడు. స్వామి మే నెల్ల మేదించుటలో – 'శ్రీ పాదములందుఁ దొరిగిన కర్పూర ధూళి తోడి పునఁగు లైలమును, ద న్మిశ్రమమునఁ బాద తీర్థమును' శ్రీ పాద రేణు నామమున ప్రస్తుతి గన్నది

## చిన తిరుమలాచార్యుల రచనలు

తాళ్ళపాక పెద తిరుమలాచార్యుల పుత్త్రుఁడు చిన తిరుమలాచార్యులు తన తండ్రి తాతల వలెనే చిన తిరుమలాచార్యులు శ్రీ వేంకటేశ్వర స్వామిపై కొన్ని యాధ్యాత్మ సంకీర్తనలను, కొన్ని శృంగార సంకీర్తనలను రచించినాఁడు వేంకటేశ్వర స్వామి యొక్క స్వరూపమును, మాహాత్మ్యమును – సంస్కృతము, ప్రాకృతము, శౌరసేని మొదలుగాఁ గల యెనిమిది భాషలలో దండక రూపమున స్తుతించినాడు చిన తిరుమలాచార్యులు అదియే అష్ట భాషా దండక మని చెప్పఁబడు చున్నది చిన తిరుమలాచార్యులకు – శ్రీ రామానుజ సిద్ధాంత స్థాపనాచార్యుఁ' డని యొక బిరుద మున్నట్లు, ఆయనయే వేయించిన యొక శిలా శాసనమును బట్టి తెలియుచున్నది

## చిన్నన్న రచనలు

తాళ్ళపాక చిన తిరుమలాచార్యుల తమ్ముఁడే చిన్నన్న. ఈయన – 'నాళీక సదన వాసినీ వేంకటేశ్వర పాద పద్మ వాసనా లోలుప స్వాంత షట్పదుఁడు' అష్ట మహిషీ కల్యాణము, పరమ యోగి విలాసము అను నవి యీఁతని రచనలు ఈతఁడు తన అష్ట మహిషీ కల్యాణములో –

" కావ్యంబు జెప్పి
యెన లేని శ్రీ వేంకటేశ్వరు మెప్పించి
సకలంబు నెఱుగ నసాధారణాంక
మకర కుండలము లిమ్మహిఁ గొన్నవాఁడ "

అని చెప్పి కొన్నాఁడు శ్రీ కృష్ణుఁడు జన్మించుట మొదలు కొని, అతఁ డష్ట మహిషీ కల్యాణమును రచించినాఁడు. ఇందు - బలరామ కృష్ణుల జననము, గోపికా వస్త్రాపహరణము, కంసుని మాయలు, కంస జరా సంధుల వధ, విద్యాభ్యాసాదులు, బలరామ వివాహము, రుక్మిణీ కృష్ణుల వివాహము, కృష్ణ మాహాత్మ్యము మొద లైన యంశములు వర్ణింపఁబడినవి ఈ యష్ట మహిషీ కల్యాణమును అలమేలు మంగ కంకిత మిచ్చినాఁడు చిన్నన్న

ప్రసిద్ధ మైన ఉషానిరుద్ధుల కథను ఉషా కల్యాణ మను పేర రచించినాఁడు చిన్నన్న గ్రంథము నందలి రెండు భాగములలో మొదటి భాగము ఉషానిరుద్ధులు కారా గృహమున బంధింపఁ బడుటతో ముగియుచున్నది రెండవ భాగమునందు కృష్ణుఁడు బాణాసు రాదులతోఁ జేసిన యుద్ధమును విపులముగా వర్ణించినాఁడు. అందును - శ్రీ కృష్ణునికి, శివునికి మధ్యమమునఁ గలిగిన యుద్ధమును అతి విపులముగా వర్ణించినాఁడు శివుఁడు ప్రయోగించిన సకల యస్త్రములను, శస్త్రములను ప్రయోగించి, తుద కెట్లు కృష్ణుఁడు విజ యము గాంచినాఁ డను విషయమును విపులముగ వర్ణించినాఁడు చిన్నన్న హరి వంశానుసారముగఁ జెప్పెద నని గ్రంథాది యందు కవి చెప్పినను, చిన్నన్న తన యుషా కల్యాణమును మూలము కంటె విపులము జేయుటకుఁ గల హేతువులలో ముఖ్యమైనది - అతని వైష్ణవ మతాభిమాన మని చెప్పక తప్పదు.

ద్రావిడ దేశమున వైష్ణవ మతమునకును, ప్రచారమునకును పట్టుఁ గొమ్మలై వెలసి విలసిల్లిన పన్నిద్దరాళ్వారుల యొక్కయు నాథ యామున రామానుజాచార్యాదుల యొక్కయు పవిత్ర చరిత్రను విష్ణు పారమ్య ప్రబోధ మైన దృష్టితో, చక్కగ నిబంధించి నాఁడు చిన్నన్న తన పరమ యోగి విలాసము నందు విష్ణు మాహాత్మ్యము వెల్లి విరియు సందర్భములకు - ఆళ్వారుల చరిత్ర యందు కొదువ యే మున్నది ? పరమ యోగి విలాసమును వేంకటేశ్వరునకును, అలమేలు మంగకును అంకిత మిచ్చినాఁడు చిన్నన్న.

## శ్రీ రంగ మాహాత్మ్యము

గరుడ పురాణమున నూ అధ్యాయమముల యందును, బ్రహ్మాండ పురాణమున తొమ్మిది యధ్యాయముల యందును శ్రీ రంగ మాహాత్మ్యము వర్ణింపఁబడి యున్నది గరుడ పురాణాను సారముగా - తెలుగున శ్రీ రంగ మాహాత్మ్యమును వర్ణించినాఁడు భైరవి కవి. శ్రీ రంగ క్షేత్రము యొక్క మాహాత్మ్య మిందు విపుల ముగా - ౫ దాశ్వాసములలో వర్ణింపఁ బడినది ద్వాదశీ వ్రత నిష్ఠ యొక్క మాహాత్మ్యమున కొక్క యుదాహరణ -

> "వ్రతములలోఁ బ్రశస్తము ధ్రువంబుగ మానవనాథ । ద్వాదశీ
> వ్రత మది నీవు నిష్ఠ నొక వత్సర మర్థిఁ జరించి నాఁడ పూ
> ర్జిత మగు న మ్మహత్త్వమునఁజేసి భవ ద్భవ సంచితాఘ సం
> తతి లయ మొందెఁ దత్ఫల మమితం బది యింతని చెప్పవచ్చునే।"

భవ సంచి తాఘ సంతతి నంతయు నశింపఁ జేయఁ గల ప్రశస్త వ్రత మని చెప్పుచు, ద్వాదశీ ప్రభావమున కింతటి ప్రాధాన్యము నిచ్చుటకు హేతు విట మత ప్రభావము తప్ప, వే ఱొండు కా దనుట స్పష్టము

## ఉత్తర రామాయణము

ఉత్తర రామాయణమును స్వపదగ రచించిన కాచ విభుఁడు విఠల రాజును తమ గ్రంథావతారికలో -

"అరయ మత్స్య కూర్మాది దివ్యావ
తారంబుల దెల్లఁ దలఁచి చూడంగ
రామావతారంబు రమణీయ మగుట
రాము పావన చరిత్రము దివ్యభాషఁ" జెప్పెద మని నాడు

ఉత్తర రామాయణ ద్విపద కర్త కిట విష్ణువు యొక్క యవతారములయం దెల్ల, రామావతారము హృదయమున కెక్కువ సన్నిహిత మైనది యగుటకు వైష్ణవ మత ప్రభావమే హేతువు.

## విష్ణు పురాణము

విష్ణు పురాణ మందలి నాలు గంశలను, పురుషోత్తమ ఖండ మనఁబడు జగన్నాథ క్షేత్ర మాహాత్మ్యమును తెలిగించినాఁడు కలిదిండి భావనారాయణ కవి ఈతఁడు వైష్ణవ మతాభిమాని, జగన్నాథ స్వామి భక్తుఁడు విష్ణు పురాణమును జగన్నాథ స్వామికిని, పురుషోత్తమ ఖండమును ఎన్నఁ గల దైవ మైన వెన్నముద్దు ముద్దు కృష్ణునకును అంకితము చేసినాఁడు పురుషోత్తమ ఖండము నేఁడు లభించుట లేదు కలిదిండి భావనారాయణ కవి - తన విష్ణు పురాణ ప్రారంభమున వైష్ణవ మతాచార్యులను ఈ క్రింది పద్యమున ప్రార్థించి యున్నాఁడు -

"పూర్ణ భక్తి భజింతుఁ బొయిగ పూదత్త పే
యాళ్వారల చరణాంబుజములు
సేవింతు మది లోన శ్రీ భక్తిసార భ
ట్టాధిప కులశేఖ రాద్యవరులఁ
బ్రణుతింతు మునివాహ భక్తాంఘ్రిరేణు ద్వి
షద్దండ ధరుల విశ్రుత మనీష
పరివస్య గూర్తు మధురకవి శఠకోప
భాష్యకర్తలకు సౌభాగ్య రేఖ
నాథ, యామున ముని, కూరనాథ, పుండ
రీక, దృగ్గ్రామమిశ్రాది లోక విశ్రు
తాద్య గురు సంఘములకు సాష్టాంగ నతులు
సేయుదు మదీయ కృతికి మే శ్రేయు కొఱకు"

భావ నారాయణ కవి – తన యాచార్యుఁ డైన శ్రీరంగ గురుని గూర్చి, ఆయనకు మ్రొక్కిన మ్రొక్కు – జన రహోకహ విని ర్దళన ప్రచండ పరశ్వధ మనియు,ఆయన యొక్క సేవ–పాతకోదక గభీరత్వ దుస్తర సంసరణ వార్ధి తరణ తరణి యనియు. ఆయన యొక్క శ్రీమదంఘ్రి తీర్థము ముక్తి సామ్రాజ్య పట్టాభిషేక సంభార జల మనియు, ఆయన యొక్క సంశ్రయణము సౌధాయిత మహనీయ కైవల్య నిశ్రేణికాశ్రయ మనియు, వేయేల ! ఆయన అపర హరియే యనియుఁ జెప్పినాఁడు

## శ్రీమద్భాగవతము

బమ్మెర పోతనామాత్యుని తల్లిదండ్రులు శైవు లయినట్లుగా తన వీరభద్ర విజయ కృత్యాదిని స్పష్టముగాఁ జెప్పికొనినాఁడు తల్లిదండ్రుల మతమును పుత్రుఁ డనుసరించుట సహజ మైన విషయము అందువలన, పోతన బాల్యమునందు శైవుఁ డయి యుండు నని నిర్ణ

యించుట కవకాశము స్పష్టముగాఁ గనిపించుచున్నది బాల్యమున శైవుఁడై యుండినను, వయస్సు వచ్చిన పిదప, తన యిచ్ఛ ననుసరించి వైష్ణవమును స్వీకరించి యుండును వైష్ణవుఁ డయిన తరువాతనే శ్రీమద్భాగవతమును తెనిగించుట జరిగినది విష్ణువు యొక్క యవతారములయందుఁ గూడ రామావతారమునం దాయనకు మక్కువ యెక్కువ. శ్రీరాముఁడు తనకు గనిపించి, భాగవతము నాంధ్రీకరించి తన కంకితము చేయవలసినదిగాఁజెప్పినట్లు, భాగవత ప్రారంభము నందలి యీ క్రింది పంక్తులు స్పష్టము చేయుచున్నవి :-

"మదీయ పూర్వ జన్మ సహస్ర సంచిత తపః ఫలంబున, శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలుండనై గంగకుం జని, క్రుంకు లిడి వెడలి, మహనీయ మంజుల పులిన ప్రదేశంబున మహేశ్వర ధ్యానంబు చేయుచు, కించి దున్మీలిత లోచనుండ నయి యున్న యెడ —"

"మెఱుగు చెంగట నున్న మేఘంబు కైవడి
నువిద చెంగట నుండ నొప్పువాఁడు
చంద్ర మండల సుధా సారంబు పోలి
ముఖమునఁ జిఱు నవ్వు మొలచువాఁడు
వల్లీయుత తమాల వసుమతీజము భంగి
బలు విల్లు మూఁపునఁ బరఁగువాఁడు
నీల నగాగ్ర సన్నిహిత భానుని భంగి
ఘన కిరీటము దలఁ గలుగువాఁడు
పుండరీక యుగము బోలు కన్నుల వాఁడు
వెడద యురము వాఁడు విపుల భద్ర
మూర్తివాఁడు రాజ ముఖ్యుఁ డొక్కరుఁడు నా
కన్నుఁ గవకు నెదురఁ గానఁ బడియె"

"ఏను నా రాజ శేఖరుం దేఱి చూచి భాషింప యత్నంబు సేయ నెడ నతండు — 'నే రామ భద్రుండ. మన్నామాంకితంబుగా శ్రీమద్భాగవతంబు

దెలుంగు చేయుము. నీకు భవ బంధంబులు తెగు' నని యాన తిచ్చి తిరోహితుం డయిన, ఇట్లు భాసిల్లెడు శ్రీ మహా భాగవత పురాణ పారిజాత పాదప సమాశ్రయంబున, హరి కరుణా విశేషంబునం గృతార్థత్వంబు సిద్ధించె నని బుద్ధి నెఱింగి-"

పయి పంక్తుల యందలి మహేశ్వర శబ్దముచే నుద్దిష్టుఁడు విష్ణువు కారణము - మహేశ్వర ధ్యానము సేయ మునుపే, పోతన - శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలుఁడు. అది యునుఁ గాక, హరి కరుణా విశేషంబున కృతార్థత్వంబు సిద్ధించె నని యెంచినవాఁ డాయన. శివ కరుణా కటాక్ష విశేషంబున తనకు కృతార్థత్వంబు సిద్ధించినట్లు భావించితి నని, పోతన - భాగవతము నందుఁ గాని, వీర భద్ర విజయమునందుఁ గాని యెక్కడను జెప్పి యుండ లేదు 'శ్రీ పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్రుఁడ' నని స్కంధాంత గద్యమునందు పోతన చెప్పి కొనుట యందును పయి భావమే గ్రాహ్యము కావున, పోతన - భాగవతము నాంధ్రీకరించుటకు కారణము - వైష్ణవ మత ప్రభావ మనుట స్పష్టము

ఆంధ్ర మహా భాగవతములోని శిథిల భాగములను పూరించిన వారిలో - వెలిగందల నారయ, పోతనకు ప్రియ శిష్యుఁడు. అగుట - వైష్ణవ మతాభిమాని యగుట స్పష్టము. వైష్ణవ మతాభిమాని కానిచో - భాగవతము నాంధ్రీకరించిన పోతనకు ప్రియ శిష్యుఁ డగుట, భాగవత దశమ స్కంధోత్తర భాగమునందు కొంత తాను పూరించినను, అక్కడ తన పేరు చెప్పికొన కుండుట పొసఁగదు గంగనార్యుఁడు - తాను పూరించిన దశమ స్కంధమును శ్రీకృష్ణుని కంకితము చేసినాఁడు తన పూర్వులు శైవు లయినను, భాగవత షష్ఠ స్కంధమును పూరించి, శ్రీ కృష్ణున కంకిత మిచ్చినాఁడు - ఏర్చూరి సింగన.

## వరాహ పురాణము

నంది మల్లయ - ఘంట సింగయలు, వరాహ పురాణమును తెనిగించినారు మలయ మారుతము సింగన్న యొక్క కవుల షష్ఠములోనిదిఁగ జెప్పఁ బడు నొక పద్యము నందలి యీ క్రింది పంక్తుల యందు వైష్ణవ మతము యొక్క తీక్ష్ణత కొంత వ్యక్త మగుచున్నది -

'వారిధి శయనుఁ జేయారఁ బూజింపని
ఖలుఁ బట్టి పెడ కేలు గట్టి తెండు
హరి మందిరమున కత్యాదరుఁడై నడవని
హీనాత్ముఁ గా ల్పట్టి యీడ్చి తెండు
వలవదు భయంబు - వా రెంతవార లైన
నట్టి వారలు మన కగ్గ మైనవారు
వారు నిరయంబునకుఁ గాపు వచ్చువార'' లు

విష్ణువును పూజింపని వారిని చేతులు గట్టి తెచ్చుట, విష్ణ్వాలయమునకు వెళ్ళని వానిని కాలు బట్టి యీడ్చి తెచ్చుట, అట్టి వారలకు నరకమే గతి యనుట, అట్టి వా రెంతటి వా రైనను వారి యెడ భయపడ వలసిన పని లే దనుట - వైష్ణవ మతము యొక్క ప్రభావమునకును, తీవ్రతకును నిదర్శనములు

## పద్మ పురాణోత్తర ఖండము

మడికి సింగన - తన పద్మ పురాణోత్తర ఖండము నందు కృత్యాదిని మొట్ట మొదట దుగ్ధ వారాశి నడుమ, శేషాహి తల్ప శయనమున, ఇందిరా సహితుఁడై యున్న వేల్పును స్తుతించినాఁడు. పాద్మము వస్తుతః వైష్ణవ పురాణ మనుట స్పష్టము. మడికి సింగనయే

తన వాసిష్ఠ రామాయణ ప్రారంభమున, రాము నొక శ్లోకములో ఈ క్రింది విధముగా స్తుతించినాఁడు :-

"శ్రీమ ద్దివ్య మునీంద్ర చిత్త నిలయం సీతా మనో నాయకం
వల్మీకోద్భవ వా క్పయోధి శశినం స్మేరాననం చిన్మయమ్
నిత్యం నీరద నీలకాయ మమలం నిర్వాణ సంస్థాయినం
శాంతం నిత్య మనామయం శివ కరం శ్రీరామ చంద్రం భజే"

పయి శ్లోకము నందు, రాముని పర బ్రహ్మముగ సింగన దర్శించు చున్నాఁ డనట స్పష్టము ఇంకను స్పష్టముగా 'వారిజ దళ నయన చరణ వారిజ సేవా సారమతి' నని చెప్పి కొనినాడు

## హరిభట్టు రచనలు

శ్రీ రామానుజ పాద పద్మ యుగళీ చింతా సమా యుక్తుఁడయిన హరి భట్టు - వరాహ పురాణ పూర్వ భాగమును, మత్స్య పురాణము నందు విష్ణు ధర్మోత్తర ఖండమును, భాగవత షష్ఠ స్కంధమును, నారసింహ పురాణోత్తర భాగమును ఆంధ్రీకరించినాఁడు. తిరుమల నారాయణ గురు చరణాబ్జ ధ్యాన మధు రస స్థిర మతి షట్చరణుఁడు - ఫలితి కృష్ణ స్మరణుఁడు నైన యెఱ్ఱయామాత్యుని కంకితము చేసినాఁడు తన వరాహ పురాణము పూర్వ భాగమును హరిభట్టు విష్ణు పూజా ఫలము, దాన ఫలము, తులసీ మాహాత్మ్యము మున్నగు విషయములు కలిగినది మత్స్య పురాణము నందలి విష్ణు ధర్మోత్తర ఖండము మత్స్య పురాణ విష్ణు ధర్మోత్తర ఖండమును శ్రీరంగము నందలి రంగ శాయికి అంకితము చేయుచు, హరిభట్టు వ్రాసిన యీ క్రింది పద్యము - ఆతని వైష్ణవ మతాభిమానమున కొక నిదర్శనము -

"ఆయు రారోగ్య నిత్యైశ్వర్యములు గల్గి
విభవంబుతో ధాత్రి వెలయు కొఱకు
ధనమునకై నరాధముల సన్నుతి సేయఁ
బొడమిన పాపముల్ చెడుట కొఱకు
హృదయంబు లక్ష్మీశ పద పంకజములందు
నిశ్చల వృత్తిలో నిల్చు కొఱకు
రౌరవంబులఁ బాసి రయమున వైకుంఠ
సదనంబునకు వేడ్కఁ జనెడు కొఱకు

పరమ వైష్ణవ జను లెల్లఁ బ్రస్తుతింప
మత్కృతం బయ్యెఁ హరి కథా మాన్య మగుచు
నుత్తమం బగు విష్ణు ధర్మోత్తరంబు
రంగ నాథుని కర్పింతు రాణ మెఱసి"

వైకుంఠ సదనమునకు వేడ్కఁ జన వలె ననెడి కోరికయు, వైష్ణవ జను లెల్ల ప్రస్తుతింప వలె ననెడి యిచ్ఛయు, వైష్ణవ మత ప్రభావితము లనుట స్పష్టము. నరాంకితము సేయుట కిచ్చగింపని యీ భావమునే హరిభట్టు - తన భాగవత షష్ఠ స్కంధమునందుఁ గూడ వెలిపుచ్చి యున్నాఁడు ఈ విషయమున నతఁడు - పోతనామాత్యుని సన్నిహితుఁ డనుట స్పష్టము

భాగవత షష్ఠ స్కంధమును హరిభట్టు - కృష్ణ ప్రీతిగా తెనుఁగు జేసి, జగన్నాథ క్షేత్రము నందలి జగన్నాథ స్వామిక అంకితము చేసినాఁడు నారసింహ పురాణోత్తర భాగము నితఁడు శ్రీకృష్ణుని కంకితము చేసి యుండు నని విమర్శకుల యభిప్రాయము. ఏ మయినను, హరిభట్టు తెనుఁగుఁ జేసిన నృసింహ పురాణోత్తర భాగమును, హరిభట్టు యొక్క కుమారుఁ డైన రాఘవ మనీషి, రంగన మంత్రికి అంకితము చేసినాఁడు. కందాళ భావనాచార్యుల కుమారుఁ డయిన శ్రీరంగ గురునికి శిష్యుఁడు రంగన మంత్రి. ఈయన, అశ్రాంత

హారిస్తోత్రుఁడు. ప్రోలుగంటి పురము నందలి చెన్నకేశవమూర్తికి మణి భూషలొసంగినవాఁడు ఈ రంగన మంత్రి యొక్క తాత తండ్రులు గూడ విష్ణు భక్తులే తాతయైన తిప్ప మంత్రి -హంపీ విజయ నగరము నందలి విరల పతికి మహనీయ తర భోగమంటపంబు గావించి యర్ప ణము చేసిన వాఁడు, మాల్యవంతము నందలి రఘునాథ నరమూర్తికి ఘన కిరీటమును ఉపాయనముగా నొసంగినవాఁడు. అతని మహి వివాహమును శ్రీమదహోబలస్వామి పాదాబ్జములయందు వరింగించిన వాఁడు రంగన మంత్రి యొక్క తండ్రి యైన నరసింహ మంత్రి- హారికి సమర్పింపఁబడిన కృతి, శుక్తి మధ్యమున నున్న నీటిబిందువు వంటిది యనియు, హరికి సమర్పింపఁబడని కృతి - త్రాపు లోహముచే నావృత మైన జలము వంటి దనియు విష్ణువు యొక్క యాధిక్యమును హారిభట్టు తన మాత్స్య పురాణ విష్ణు ధర్మోత్తర ఖండము నందు స్పష్ట ముగాఁ జెప్పినాఁడు.

## భో జ రా జీ య ము

అనంతా మాత్యుఁడు అచ్చమైన వైష్ణవుఁడు అతఁడు తన భోజరాజీయములో - 'ఏను వైష్ణవ ధ్యాన సమాహితాత్ముఁడ' నని స్పష్టముగాఁ జెప్పికొనినాఁడు అట్లు స్పష్టముగా జెప్పుటయే అతఁడు అసామాన్యుఁ డని నిరూపించును. తన భోజరాజీయమును అహో బల నృసింహ స్వామి కంకితము సేయుచు, ఆ స్వామి - అఖిల జగ న్నాథుఁ డని చెప్పినాఁడు భోజరాజీయమున తన వంశమును వర్ణించుచు, లోక రక్షణార్థమై, విష్ణువు త్రేతా యుగమున రామ లక్ష్మ ణులుగను, ద్వాపరమున రామ కృష్ణులుగను- జన్మించినట్లు, తన తాత లైన గంగన మంత్రియు, మమ్మ డమ్మయు జన్మించినా రని చెప్పినాఁడు. రాముఁడు సీతను వరించినట్లు, మమ్మడి పెద్దగఁ యెఱ్ఱమాంబను పరిణయ మాడినాఁ డట !

తాళ్ళపాక అన్నమాచార్యుల స్వరూపము తాళ్ళపాక పెద తిరుమలాచార్యులలోఁ గనిపించిన పిమ్మట, మరల మనకు అనంతామాత్యునియందే విశేషముగా గనిపించును ఇందుల కాతని భోజరాజీయమే ప్రబల నిదర్శనము పురాణ కథల ధోరణిలో గల భోజరాజీయము నందలి యాఖ్యానము లన్నియును, అనంతామాత్యునిచేఁ గల్పింపఁ బడినవి యైనను గావచ్చును, లేక — ఆ నాఁడు జన సామాన్యములో — బహుళ ప్రచారమున నుండినవి యైన గావచ్చును. ఏ మైనను, ఆ కథ లన్నింటి యందును కొంత నూతనత్వము లేక పోలేదు విష్ణువు నెడ, వైష్ణవ మతము నెడ, తాళ్ళపాక అన్నమాచార్యులకు గల భావములే అనంతామాత్యునకును ఉన్నట్లు భోజరాజీయమును బట్టి యూహింపవచ్చును కథా గమనమునందు విష్ణువు అనేక సందర్భములలో ప్రత్యక్షమై, భక్తులకు ఉత్తమ లోకమును, వరములను ప్రసాదించినాఁడు దత్తాత్రేయుఁడు మహామునికిఁ జెప్పిన శ్రీరంగాది దివ్య క్షేత్ర మాహాత్మ్యము నభివర్ణించు వ్యాజమున, తనకు విష్ణువు నెడను, వైష్ణవము నెడను గల మమకారమును వెల్లడించినాఁడు

హరి శబ్ద సమంచిత మైన ఓంకారమే సకల వేదములకు మూలమనియు, అదియే మహా మంత్ర మనియు, అది — 'బహు జన్మ సంచిత సమ స్తాఘౌఘము'ను హరించు ననియు, దానిని విష్ణువు నుండి ఉపదేశమును పొందియే బ్రహ్మ — సమస్త భువన ప్రపంచమును సృజించినాఁడనియుఁ జెప్పఁబడినది. విష్ణువు యొక్క రూపమును చేయారగఁ బూజించుట, విష్ణువును దలఁచుట, చూచుట, కదియుట, ప్రణామము — ప్రదక్షిణము చేయుట మున్నగు నంశములు భాగవతకారుని నవ విధ భక్త్యనుసారముగ కొన్ని వర్ణింపఁబడినవి విష్ణువు యొక్క అవతార భేదములందు భేద బుద్ధి సేయక, విష్ణువుగనే సేవించువాఁడు సత్పురుషుఁ డని చెప్పఁబడినది 'భక్తి మీమాంస' యను పేరున నూఱు సూత్రములను రచించినట్లు చెప్పఁబడు శాండిల్యుఁడు

గూడ, భక్తునికి ముక్తి నిచ్చు సందర్భమున- పరబ్రహ్మకును, పరబ్రహ్మ యొక్క అవతారములకును భేదము లే దని – 'ఏవం ప్రసిద్ధేషు చ' (55) అను సూత్రమునందు స్పష్టము చేసినాఁడు సకల భువనము లను సృజించిన పిమ్మట, సత్య లోకమున తాను నివసించుచు-'యథా కాల జనితం బగు నిత్యారాధనంబునకు నొక్క దివ్య మంగళ విగ్ర హంబు' హరిది కావలయునని యూహించి, ఆయనను గూర్చి ఘోర మైన తపము చేసినాఁడు బ్రహ్మ అప్పుడు విష్ణువు ప్రత్యక్షమై, 'నీ తప ముల కెల్ల నెల్ల యగు మూర్తిఁ జూమీ' అని ఎల్కెను ఇట్లే, మిగిలిన క్షేత్రముల వర్ణనము గూడ సాగినది. ఏ మైనను – అనంతామాత్యుఁడు తన భోజరాజీయమున విష్ణువును ఇంచు మించుగ, నవ విధ సంబం ధము లందును దర్శించినాఁ డని చెప్పవచ్చును. రసానుసరణమునందుఁ గూడ, అనంతా మాత్యునికి లక్ష్య ప్రదర్శన సందర్భములలో – కంజ దళాయతాక్షుఁడే యుపాదేయుఁ డైనాఁడు.

## విష్ణు మాయా విలాసము

తన కంటెను ఇతరు లైన వారియం దహంకార మావహించి నపుడు, వారి యహంకారము నణఁచి, తన సర్వేశ్వరత్వమును విష్ణు వెట్లు జ్ఞప్తి కెలయించు నను విషయమును ఆఖ్యాన ద్వారమున తన విష్ణు మాయా నాటకములో నిరూపించినాడు మడికి అనంతయ్య

వైకుంఠము నందలి సమస్త సంపదలకును తానే కారణ మని భావించినది లక్ష్మి దేవి సృష్టి యంతటికిని, తానే మూల మని భావించి నాడు బ్రహ్మ మన్మథుని భస్మము చేసిన తన యింద్రియ విజయమును విశేషయముగ భావించినాఁడు శివుఁడు విష్ణు భక్తు డైన తన కెవ్వరును సాటి రా రని తలంచినాఁడు నారదుఁడు. వారి యందరి భ్రాంతిని తన మాయా నాటకముచే పోఁగొట్టి, వారి విలి

యము లెట్లు అసంపూర్ణములైనదియు తెలియఁజేసినాఁడు మహా విష్ణువు. చివరికి అనంతయ్య - మదన గోపాల వర ప్రసాద విలాస నాటకమును మదన గోపాలునకే అంకిత మొనర్చినాఁడు

## ఆముక్త మాల్యద

శ్రీ వైష్ణవ మత ప్రభావము గ్రాగిన యాంధ్ర వాఙ్మయమున కొక యెత్తిన పతాక - శ్రీ కృష్ణ దేవరాయల యాముక్త మాల్యద. కృష్ణ దేవరాయలు సంస్కృతమునందు సత్యా వధూ ప్రేణ నాది గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది గాని, యవి నేఁ డుపలబ్ధములు గావు విశిష్టాద్వైత మత సంప్రదాయమున కొక పెట్టని కోట గోడ వంటిది యాముక్తమాల్యద. గ్రంథము మొదటి నుండియు తుది దాఁక, ప్రత్యణువు నందును విశిష్టాద్వైతము నిండి యున్నది.

కళింగ దేశముపై దండెత్తఁ బోవుచు, ఆంధ్ర విష్ణువును సేవించుట కయి విజయవాటికయందు దాఁగి, హరి వాసరోపవాసం బచ్చఁట గావించినాఁడు శ్రీకృష్ణ దేవరాయలు ఆ నాటి రాత్రి యాంధ్ర విష్ణు వాయనకు కలలోఁ గనిపించి, ఆముక్త మాల్యదా గ్రంథమును రచింప వలసినదిగను, తానే యైన శ్రీ వేంకటేశ్వర స్వామికి దాని నంకితము సేయవలసినదిగను ఆదేశించినాఁడు

ఆముక్త మాల్యద యందు ప్రధాన కథ - పన్నిద్దరాళ్వారులలో నొకర్తుక యైన ఆండాళ్ యొక్క చరిత్రము ఆండాళే గోదాదేవి. ఆమెను బెంచి, పెద్ద చేసినవాఁడే పెరియాళ్వారులుగఁ బ్రసిద్ధి చెందిన విష్ణుచిత్తుఁడు. అనుషంగికముగ యామునాచార్య చరిత్రమును, మాల దాసరి కథయును, ఖాండిక్య కేశిధ్వజుల కథయును అనుసంధించి

నాఁడు కృష్ణ దేవరాయలు గోదాదేవి కథకు, అనఁగా - విష్ణుచిత్తుని కథకు, యమునాచార్యుని చరిత్రకు మూలము గురు పరంపరా ప్రభావ మను ద్రావిడ గ్రంథము వరాహ పురాణము నందలి నలువది నాలుగవ సర్గలోఁ జెప్పఁ బడిన చండాల బ్రహ్మ రక్ష స్సంవాద రూప కథ - గురు పరంపరా ప్రభావము నందును జెప్పఁబడినది ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము విష్ణు పురాణము నందలి షష్ఠాంశములోని నవమ స్కంధము నందలి పదమూఁడవ యధ్యాయము నందును జెప్పఁ బడినది

విష్ణు దాస్య పరిభావమును, అన్య మతములను ఖండించి, విశిష్టాద్వైత మతము యొక్క యద్వితీయతను స్థాపించుటయు, విష్ణుచిత్తుని కథ యందు రాయ లుద్దేశించిన ప్రధాన ప్రయోజనములు. విష్ణుచిత్తుఁడు ద్వయ సద్మ పద్మ వదనుఁడు, అద్వంద్వుఁడు, అశ్రాంత యోగాంధూ బద్ధ మధు ద్విషచ్చరణుఁడు, అన్య ర్థాభిధానుఁడు ప్రకృతి కంటెను పరుం డగు నన్నును, తన కంటెను పరుం డగు పరమాత్మను, ఆత్మీయ తదీయ శేష శేషిత్వంబును అనాద్యంబుగాఁ దెలిసినవాఁడు. చదువులం బని యేమి? వివేకంబు లేని వాని హేతు వాదంబు ధాతు వాదంబు, కాణాదంబు ప్రాభాకరంబు, కాపిలంబు చాపలంబు, మీమాంస హింస, వ్యాకరణం శరణంబని భావించు వాఁడు మన్ననా రును ఆరామ ప్రాంత ఖనన క్రియా ఖటిఖనిత్ర గ్రాహితోద్య త్కిణ స్తోమా స్నిగ్ధ కరుఁడు గృహ సమ్మార్జనము, జలాహరణము, శృంగార పల్యంకికా వహనము, వన మాలికా కరణము, వాల్లభ్యబద్ధధ్వజ గ్రహణము, వ్యజ నాతపత్ర ధృతి, ప్రాగ్దీపి కారోపణము మున్నగు పనులతో కాలము వెళ్ళబుచ్చువాఁడు. పర తత్త్వము హరుఁ డని, యుమ యని, హరి యని, యర్కుఁ డని, కరి ముఖుఁ డని, రజ నీశ్వరుఁ డని, వాదైన పాండ్య మత్స్య ధ్వజుని పండిత పరిషత్తునకు షువిని యాదేశమున వెళ్ళినాఁడు. ఈక్ష త్యాదులచే జగ దుద్గతికిని

బీజము ప్రధాన మను నశబ్ద వాదిని, బోగా మాత్రే త్యా ద్యుదాహృతి స్ఫూర్తిచే ఈశుఁడే నని యను మాయా వివాదిని, ఫల మత యి త్యాది వచనములచే ఫలియించు క్రియ యని సర్వేశ్వరుఁ గొనని యపూర్వ వాదిని, శాస్త్ర యోని త్వాది సరణిచే అనుమాన మీశ్వరుని దెలుపు నను పీలువాదిని, నిత్యులం దెల్ల నిత్యుఁ డను శ్రు త్యురాక్తిని, క్షణిక సర్వజ్ఞ తేపి యయిన సౌగత వివాదిని, అనుపపత్తేర్న యను సూత్ర మాది యైన వానిచే నృపతీశుఁ డయిన ప్రత్యక్ష వాదిని జయించి, యాత్ర మాది యైన వానిచే నృపతీశుఁ డయిన ప్రత్యక్ష వాదిని జయించి,ఆది నారాయణుం డాయె నొక్కఁడ, బ్రహ్మ లేఁడు హేమశుఁడు లేదు ఏదియ లే దని, ప్రమాణములతో విశిష్టాద్వైతంబును తేఁటగాఁ దెలుప మాటాడినాఁ డక్కడ మధురాధీశుఁడును రూఢి కొలకయి విష్ణు చిత్తుని గజారూఢుఁ జేసి, తూర్య స్వనంబు న్నిరంతర వంది స్తుతులుం జెలంగ గజ ఘంటా వార కాంతాంఘ్రి నూపురము ల్మ్రోయఁగ మధురయం దూరేగించినాఁడు మార్గ మధ్యమమున శంఖ చక్రాంకి తోరు హస్తములఁ దనరఁ జతుర్భుజుఁ డైన కమలేక్షణుఁడు ప్రత్యక్షము కాఁగా-ఆయనను దశావతారముల యందు స్తుతించి నాఁడు విష్ణు చిత్తుఁడు విల్లి పుత్తూరునకుఁ జేరు కొనినాఁడాఁతడు విల్లి పుత్తూరు నందలి స్థానికులు తన్ముని దిదృక్షానందితు లగుచు, పురమును గై సేసి ప్రజలతో, నరుగ నాగవాసముతో తూర్యము లులియఁగా భగవ త్ప్రసాద తీర్థంబు లుపాయనంబులుగా నెదు రేఁగి, ప్రణామంబు లాచరించి, భర్మ పరికర్మ వర్మితం బైన బ్రహ్మ రథంబున న బ్భాగవత వతంసంబు నునిచి కొని తీసికొని వెళ్ళినారు

గోదాదేవి కథ యందు రాయలు మధుర భక్తిని జక్కఁగ నిరూపించినాఁడు. భక్తుఁడు తన్ను స్త్రీగ భావించుకొని, భగవంతుని

యందు పురుషత్వము నారోపించి, భర్తృ సంబంధ మైన భావ బాంధ వ్యము ననుభవించుటయే మధుర భక్తి. ఇట్టి మధుర భక్తి ఋగ్వేదము నందే సష్టృష్టగ నున్నను, అది యొక సంప్రదాయముగ రూపొందినది. క్రీ|శ 1485 - 1527 సంవత్సరముల ప్రాంతమునం దున్న చైతన్యుని కాలమునందే, అనఁగా - ఇంచు మించుగ కృష్ణదేవరాయలకు సమ ప్లైన కాలము నందే యన్న మాట- విశిష్టాద్వైతమునందు మధుర భక్తి కొక ప్రముఖ మైన స్థాన మున్నది. గోపికలది మఱి మధుర భక్తియే గదా! గోదాదేవి పూర్వ జన్మము నందు భూదేవి వరాహ రూపుఁడైన విష్ణువుచే ఆ జన్మము నందు భగవన్మాహాత్మ్య గానము యొక్క మాహాత్మ్యమును విని, ఆ విధముగ రంగ శాయిని సేవించుట కయి గోదాదేవిగ జన్మించినది. తులసీ వనమును త్రవ్వుచుండగా - విష్ణు చిత్తుని కామె లభించినది. విష్ణుచిత్తుఁడు విష్ణువుని కర్పింపఁ బోవు పూల మాలికలను మొదట నామె తన కబరిపై ధరియించిగాని యిచ్చెడిది గాదు. దినమున కొక్కొక్క గాథ చొప్పున ద్రావిడ భాష యందు 'తిరు ప్పావై' యనఁబడు గీతములను విష్ణువుపై తన కున్న పరమ మైన యనురాగమును పట్టలేక రచియించినది. కాలము గడచిన కొలఁ దియు - రంగ శాయిపై నున్న యనురాగము వలన విరహ మధికమై, దుర్భర మైనది. తుద కామెకు విష్ణువుతో పరిణయ మైనది. సహ్యా కన్యా తటోద్యా చందన ద్రుమ కుంజములను ఆ గోదాదేవిని గుస్తరించి, కంతు సామ్రాజ్య మేలించి, కరుణఁ జిత్త మొలయ నామెను తనలో ఐక్యము చేసినాఁడు శ్రీ రంగేశుఁడు. శ్రవణ కీర్తన స్మరణ పాద సేవ నార్చన వందన దాస్య సఖ్యా ద్యవస్థల నన్నిటిని అనుభవించిన పిమ్మట, ఆమె రంగేశుని కాత్మ నివేదనము గావించికొన్నది.

మానవుఁడు తా నెంతటివాఁ డైనను, పరిసరముల యాను కూల్యము లేనిదే యాతని సంస్కార జన్య జ్ఞాన మంతయు నివురు గప్పిన నిప్పు వలెనే యుండి పోవక తప్ప దనియు, పరిస్థితు లనుకూ

లించినంతనే అతని జ్ఞానము విజృంభింపఁగా - అతఁడు పరమార్థమును పొందఁ గలఁ డనియు నిరూపించినాఁడు రాయలు యామునాచార్య చరిత్రము నందు. పరిసరముల యానుకూల్యమును గలిగి యుండుట మతము నందు ప్రధాన మైన యంశము గదా! అనుషంగికముగ ఆహార నియమము, ప్రతిమార్చనము మున్నగు నంశముల ప్రాధాన్య మును వివరించినాఁడు రాయలు యామున చరిత్రము నందు.

యామునుఁడు నాథముని యొక్క మనుమఁడు అప్పటి పాండ్య రాజు - వెఱ్ఱి శైవము తల కెక్కిన వాఁడు ఆ రాజు భార్య పరమ వైష్ణవి రాజు భార్య యొక్క యాదరణము లభించినది యామునునికి వాదము నందు పేరు బడిసిన శైవ పండితుని నోడించినాఁడు రాజును వైష్ణవుని జేసి, యాతని కూఁతును పెండ్లి యాడి, పరమార్థమును మఱచి, సుఖముగా కాలక్షేపము చేయుచున్నాఁడు నాథముని యొక్క ప్రశిష్యుఁ డైన శ్రీరామ మిశ్రుఁడు యామునుని యొక్క జ్ఞాన వర్తి నెగఁ ద్రోసినాఁడు; రంగశాయి యొక్క పాద ద్వయియే నిక్షేప మని చూపినాఁడు రాజ్య మును కుమారున కిచ్చి, రంగశాయి యొక్క సేవలో తరించినాఁడు యామునాచార్యుఁగు భక్తుని యోగ క్షేమములు భగవానుఁడే చూచు నను నంశమును రమ్యముగా ప్రతిపాదించినాఁడు రాయలు యామున చరిత్రము నందు.

నారాయణ గుణ గాన మాహాత్మ్యమును, జ్ఞానము కంటె భక్తికి గల యాధిక్యమును, భక్తి యొక్క - భక్తుని యొక్క మాహాత్మ్య మన్యోన్యమును మనుటను నిరూపించి నాఁడు రాయలు చండాల బ్రహ్మ రక్ష స్సంవాద కథ యందు పేరు కొనఁ గాని కులమునం దొక విష్ణు భక్తుఁ డున్నాఁడు శంఖ చక్ర కుండలములు, విష్ణు పాద రక్ష, చిటి తాళములు, వన మాల కంటె, పట్టె తిరు మన్ను,

వీణ మూపునఁగు వానిని ధరించి, మూఁడు యోజనముల దూరమున నున్న వైష్ణవాలయమునకు వెళ్ళి, బ్రాహ్మ్య ముహూర్తము నందు మంగళ నామక కైశికి గానముచే విష్ణువును స్తుతించి, సాష్టాంగ మెఱఁగి, గర్భ మంటపిఁ గడిగిన కేఁక జలములోని తొట్టి నిండి, కాలు వగఁ జారి, గుడి వెడలి వచ్చునది ఁదుర్రిఁ డిడఁగఁ గ్రోలి, యెంతో తపవుం బ్రసాద వినియోగము వార్చి వసించుచుం ద్రివర్ణేతరం జాతి మెచ్చి దయ నిడ్డ ప్రసాదము దండె సాఁచి శ్రద్ధాతిశయంబున వినతి నంది భుజించి, త దంబువును గొని, ముఖ్య జాతిఁ గని నంతన పాయుచు, ఇంటికి తిరిగి వచ్చు వాఁడు ఒక కార్తిక శుక్ల ద్వాదశి నాఁటి రాత్రి అతఁడు విష్ణ్వాలయమునకు వెళ్ళుచుండ, త్రోవలో నొక బ్రహ్మ రాక్షసుఁ డడ్డగించినాఁ డాతనిని గానము చేసి తిరిగి వచ్చిన పిదప భక్షింప వచ్చు నని యతఁ డెన్ని చెప్పినను, రాక్షసుఁడు నమ్మ లేదు తుదకు –

"ఎవ్వని చూడ్కిఁ జేసి జనియించు వసించు ని జ్జగం
బెవ్వని యందు డిందు మఱి యెవ్వనియం దది యట్టి విష్ణుతో
నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి నౌదు నేఁడ నే
నెవ్విధినైన ని న్గతియనేని"

యని ప్రమాణము చేయఁగా – రాక్షసుఁడు మాల దాసరిని వదలినాఁడు దాసరి విష్ణువును సేవించి, తిరిగి వచ్చినాఁడు రాక్ష సునికి సత్కాలము దాఁ పయినది దాసరి మాహాత్మ్యము నాతఁడు గ్రహించి, తన రాక్షస జన్మ నివృత్తికై సంగీత ఫలంబున సగ మైనఁ గాని, పాటం బాతిక పా లేని, తుదకు చరమ గీతంబు ఫలం బైన ని మ్మని దాసరి పాదములపైఁ బడి ప్రార్థించినాఁడు. దాసరి యను గ్రహించినాఁడు రాక్షసుఁడు తన పూర్వ జన్మము నందలి సోమ శర్మ యను బ్రాహ్మణుఁ డైనాఁడు. సోమ శర్మ దాసరిచే వైష్ణవ మతమును స్వీకరించినాఁడు.

మతముపై నెంతటి ప్రత్యయ మున్నంత మాత్రమున మతా వరణము నతిక్రమించిన వేదాంతము యొక్క, భక్తి యొక్క ప్రాము ఖ్యమును గుఱుతింపని వాడగా నను నంశమును వ్యక్తము చేసినాఁడు రాయలు ఖాండిక్య కేశి ధ్వజోపాఖ్యానమునందు. అనుషంగికముగ బ్రహ్మ నిష్ఠ యద్వితీయ మైనది యను నంశము సైతము నిరూపింపఁ బడినది. మత ప్రత్యయమునకు వేదాంతము వెన్నెముక కానిచో - పతనము చెందుట కవకాశ మున్నది యని రాయల చూపై యుండ వచ్చును కర్మము, జ్ఞానము అనునవి విడఁ దీయరాని జంట యనియు, ఒక దాని కొకటి యవి పరస్పర పోషకములనియు, సంపూర్ణతకు భక్తి జ్ఞాన కర్మములు మూఁడును అవశ్యమే యనియు ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానమునం దుద్దిష్ట మైన యంశము కేశిధ్వజ ఖాండిక్యు లన్న దమ్ముల బిడ్డలు కేశిధ్వజుఁ డాత్మ విద్యా విశారదుఁడు. ఖాండిక్యుఁడు కర్మజ్ఞుఁడు కేశిధ్వజుఁడు కర్మము నాచరించినాఁడు. కర్మాచరణమునందు వచ్చిన సంశయమునకు ఖాండిక్యునిచే నివృత్తిని దెలిసికొనినాఁడు అందులకు ప్రతిఫలముగా - తన యాత్మ విద్యా జ్ఞానమును ఖాండిక్యునికి బోధించినాఁడు

ఏ మయినను, వైష్ణవ మత ప్రభావము గలిగిన యాంధ్ర వాఙ్మయమున కొక కంచు కాగడా వంటిది శ్రీకృష్ణ దేవరాయల యాముక్త మాల్యద.

## మను చరిత్ర

అల్లసాని పెద్దన్న - మను చరిత్రను, హరి కథా సారమును రచించినట్లు తెలియుచున్నది అతని హరి కథా సారము మాత్రము నేఁడు లభించుట లేదు. హరికి సంబంధించిన కథల

యందు – తన కిష్టమైన వాని నేర్చి, సారం[illegible] [illegible] కథా సారమును గూర్చి యుండు నేమో యని ఊహింప [illegible] శ్రీ వక్షోజ కురంగ నాభ మెదపైఁ జెన్నొంద విశ్వంభరా [illegible] త్కమలా సమీపమున నిల్పినాఁడో యనఁగా వందారు [illegible] నిజ భక్త శ్రేణి కనిపించు రాజీవాక్షుని ప్రార్థించుటతో – [illegible] చరిత్రను ప్రారంభించినాఁడు పెద్దన. శర కోప య[illegible] – [illegible] తత్త్వ గురువై యుండు నని యూహించుటకు గల [illegible] స్పష్టము. పెద్దనకు విష్ణువు నెడను, వైష్ణవము నెడను గల యభి[illegible] వలననే గ్రంథాంతమునందు స్వారోచిష మనువునకు విష్ణువు [illegible] మైనాఁడు.

## పాండు రంగ మాహాత్మ్యము

వైష్ణవ మత ప్రభావము గల యాంధ్ర వాఙ్మయమునం [illegible] యాణి పూస వంటిది పాండు రంగ మాహాత్మ్యము పాండు రంగ మహాత్మ్య కర్త – తెనాలి రామకృష్ణుడు ఉద్భటారాధ్య చరిత్ర – ఘటికా చల మాహాత్మ్యములను రచించిన తెనాలి రామలింగ కవియె తరువాత కాలమున వైష్ణవమును స్వీకరించినాఁ డని పెక్కురు విమర్శకుల [illegible] ప్రాయము. రామకృష్ణుఁడు పాండు రంగ విజయ మను గ్రంథమునుఁ గూడ రచించినట్లు తెలియుచున్నది కాని, అందలి ఒక్క పద్యము మాత్రమే నేఁడు మనకు లభించుచున్నది. *

ఘుర్మ్మ భీరా నది భైమీ నది యందుఁ గలియుచోట గల పాండు రంగ రూపుఁ డైన బాల కృష్ణుని మహిమమును వర్ణించు కథల సంపుటీకరణమే పాండు రంగ మాహాత్మ్యము క్షేత్ర దైవత తీర్థములు

* పాండురంగ మాహాత్మ్యము కంటెను పాండు రంగ విజయము భిన్నము గా దని పెక్కురు విమర్శకుల అభిప్రాయము

మూఁడును సమ మైన ప్రాధాన్యమును వహించు స్థలము యొక్క పురాణ మది. పాండు రంగ మాహాత్మ్య కధనుఁ జెప్పినవాఁడు శివుఁడు నీచాతి నీచములు, మహా ఘోరములు నగు ఎట్టి కార్యములతో తము నంతను గడిపిన మానవు లైనను, తిర్యక్కు లైనను వైష్ణవ మతానుష్ఠాన పరిధిలోనికి వచ్చు ఏ యొక్క పని నైనను ఇచ్ఛ లేక చేసి నను, వానికి పాండు రంగఁడు ముక్తి నిచ్చు నని చెప్పుట – పాండు రంగ మాహాత్మ్యమునం దుద్దేశింపఁబడిన ప్రధాన ప్రయోజనము పుండరీకుఁ డను ముని యొక్క ప్రార్థన వలన, పాండు రంగఁ డక్కడ నెలచినాఁడు. ఇఁక నచ్చటి క్షేత్ర తీర్థ దైవత మాహాత్మ్యములు – ఈ క్రింది విధముగాఁ జెప్పఁబడినవి –

ఆ క్షేత్రము క్షేత్రాంతరముల కంటెను ఉత్తమోత్తమము. ఆ క్షేత్రమున మరణించుట గూడ ముక్తి హేతువే. స్వామి కభిషేక మొనర్చుట ముక్తి హేతువు స్వామి యొక్క ఆలయమునుఁ దుడుచుట ముక్తి హేతువు స్వామి యొక్క ఆలయావరణము నలుకుట ముక్తి హేతువు ఆలయమునందు ముగ్గు వెట్టుట ముక్తి హేతువు ఆలయమునందు దీపారాధనము చేయుట ముక్తి హేతువు స్వామి శ్రీపాద తీర్థమును సేవించుట ముక్తి హేతువు జీవితము నంతను అతి నికృష్ట మైన పద్ధతులోఁ గడిపి, తుదకు కిరాతుఁ డైన బ్రాహ్మణుఁడు నిగమ శర్మ యను వాఁ డా క్షేత్రమున తనువును జాలించుటచే, ముక్తి నందినాఁడు. మురళీ కృష్ణుని మోహన గానమునకు పాలు స్రవించిన దొక యావు, ఆ పాల ధారల యొకటి శ్రీ కృష్ణుని నెత్తిపై నెట్టులో పడినది కృష్ణునికి అపరాధ మును చేసిన ఆ యావు, మఱు జన్మమున సుశీల యను నొక యుష్టిమ స్త్రీగఁ బుట్టి, తుదకు ముక్తి నందినది

ఆలయములో బలిగ వేయఁబడిన అన్నపు మెతుకులు తినుట కయి యెగిరి వచ్చిన దొక కాకి దాని ఱెక్కల గాలికి కొంత మన్నెగురఁ

గొట్టఁబడి, కొంత చోటు శుభ్రము చేయఁబడిన ట్లయిన పై స్వా మ్యాలయము నూడ్చిన పుణ్యము లభించి, మఱు జన్మమునం దా కాకి, సుశీల పుత్రుఁ డయి పుట్టి, సశరీర స్వర్గము బొందినది ఎండ వేడిమికి తాళ లేక, నీటిలో మునిఁగి, తడి ఱెక్కలు టప టప కొట్టుచు ఆలయము లోపలకు వచ్చిన దొక హంస ఱెక్కల నున్న నీటి తుంప రలు పడుటచే, కొంత నేలకు తడి యంటినది స్వామి యొక్క ఆలయము నలికిన పుణ్యము లభించిన దా హంసకు మఱు జన్మనంన సుశీలకు పుత్రుండుగఁ బుట్టిన దా హంస. సశరీర స్వర్గమును పొందినది

దేవదాసి యొకతె పెంచు నొక చిలుక - పంజరమునుండి తప్పించుకొని, ఒక ముత్యాల హారమును నోటఁ గఱచుకొని వెళ్ళి, స్వా మ్యాలయములోని యొక దండెముపై వ్రాలినది. హారమును ముక్కులతోఁ బొడువఁగా - క్రింద రాలినవి కొన్ని ముత్యాలు. ఆలయ మున ముత్యాల ముగ్గులు బెట్టిన పుణ్యము లభించిన దా చిలుకకు. మఱు జన్మమున సుశీలకు పుత్రుఁ డయి పుట్టి, సశరీర స్వర్గము బొంది నది. స్వామి యొక్క ఆలయము లోనికి వచ్చిన పా మొకటి యెలుక కొఱ కయి, స్వామి పాదముల కడకు వెళ్ళినది. అచ్చట నున్న యొక మొగలి పూవు యొక్క వాసనకు పరవశమై, పడగ విప్పిన దా పాము. పడగపై నున్న మణి ప్రకాశించినది. స్వామికి దీపారాధన చేసిన పుణ్యము లభించిన దా పామునకు. మఱు జన్మమున సుశీలకు పుత్రుఁడుగఁ బుట్టినది. సశరీర స్వర్గమునుఁ బొందినది. తేనె టీగ యొకటి స్వామి యొక్క యర్ఘ్యంబువు కల యొక పుష్పము నాఘ్రా ణించినది స్వామి పాద తీర్థమును సేవించిన పుణ్యము లభించిన దా తేనె టీఁగకు. మఱు జన్మమున నా యీఁగ - సుశీలకు పుత్రుఁడుగఁ బుట్టినది. సశరీర స్వర్గమును బొందినది.

అభిషేక సమ్మార్జనాదులే ముక్తి హేతువులు అభిషేక సమ్మార్జనాదులను జేయ వలె నను దృష్టి లేక, యాదృచ్ఛికముగఁ గలిగిన తత్స్పర్శయే సశరీర స్వర్గమునుఁ గలిగించినది ఆ యభిషేక సమ్మార్జనాదులకు కారణ మైనవి తిర్యక్కులు అవి అత్యల్ప మైన ప్రాణులు ఇఁక, పరమ భక్తుఁ డయిన మానవుఁడు చేయవలె నను నెఱ నిష్ఠతో, ఆ యభిషేక సమ్మార్జనాదులనుఁ జేసినచోఁ గలుఁగు ఫల మెంత ? యాదృచ్ఛికముగఁ గలిగిన అభిషేక సమ్మార్జనాదుల స్పర్శ, తిర్యక్కులలో అత్యల్ప మైన ప్రాణులకే సశరీర స్వర్గ హేతు వగుచుండఁగా – జీవులలోని కెల్లను అత్యుత్తమ జీవి యైన మానవుఁడు, పరమ మైన భక్తితో – ఆయననే జీవిత ధ్యేయముగ నెంచి, జీవిత మెల్ల ఆయన యందే వసించినచో, ఆ స్వామి ప్రసాదించు ఫలిత మిఁక నెంతయో !

ఇఁక, ఆ క్షేత్రమునం దున్న తీర్థము యొక్క మాహాత్మ్య మద్భుత మైనది అందు స్నానము చేసినచో – సర్వ పాపములును ఆ క్షణమునందే నశించి, పరమ పదము ప్రాప్తించును బోయనిచే బాణ హతని విన్న దొక లేఁడి బాధను భరింపలేక, ఆ తీర్థమున మునిఁగి నదె వెను వెంటనే దాని పాపము లన్నియు నశింపఁగా – ఒక విద్యా ధర రాజయి, మింటి కెగసినది లేడి వెంట వచ్చిన బోయఁడును అది చూచి అందు మునిఁగినాఁడు భారత యుద్ధానంతరము ధర్మ రాజు ఆ తీర్థములో స్నానము చేసి, యుద్ధమునఁ గలిగిన పాపము నంతను పోగొట్టుకొనినాఁడు సుశర్మ యను కిరాతుఁ డా తీర్థము నందు స్నానము చేసినాఁడు అంతకు పూర్వము సుశర్మనుఁగూర్చి చిత్రగుప్తుని లెక్కలో నున్న పాపముల పట్టికల నన్నిటిని ఒక్క క్షణ ములో తుడిచివైచినాఁడు శ్రీ మహా విష్ణువు. ఇఁక, విష్ణువు తన మంత్రమును రహస్యముగా నొక్క శివునికి మాత్రమే చెప్పినాఁడు.

'కృష్ణాయ నమః' అను ఆ మంత్రమును పఠించినచో – సర్వ పాపములు నశించి, పరమ పదము ప్రాప్తించును

ఆ క్షేత్రము నందలి దైవము యొక్క మాహాత్మ్య మనన్యమైనది పుండరీకుఁ డను ముని యొక్క ప్రార్థన వలన, ఆ క్షేత్రమునం దక్కడ పాండు రంగ డను వెలసినాఁడు విష్ణువు ఎందఱో దుష్టు లయిన దైత్యులను సంహరించి, ధర్మ సంస్థాపనము గావించిన ఆయన యొక్క పరాక్రమ మంతు లేనిది ప్రత్యేకముగా నొక విశేష మిక్కడ చెప్పవలసి యున్నది. గార్హస్థ్యము, సన్యాసము అను విషయమును గూర్చి, పాండు రంగ మాహాత్మ్యమునందు రామకృష్ణుఁ డొక చక్కని సమన్వయ దృష్టిని వెలువరించినాఁడు మనస్సు సంపూర్ణముగా పరిపక్వము కానిదే, సన్న్యాసాశ్రమమును స్వీకరించుట – కాయ సాంతముగ పండక మునుపే త్వర పడి, పండుట కయి దానిని పలుమాఱు లొత్తుట వంటిదే యని ఆయన అభిప్రాయము త్వర పడుట వలన కాయ పండదు సరి గదా – ఉన్న స్థితి కూడ క్షీణించి, చివరకు కుళ్ళుటకుఁ గూడ అవకాశ మున్నది రామ కృష్ణుని పై యుదాహరణమున కే యుయుతిని కథ

పాండు రంగ మాహాత్మ్యమునందు ప్రత్యేకముగాఁ బేర్కొన వలసిన మఱి యొక ప్రధానాంశ మున్నది అది – రాధా వృత్తాంతము ఇప్పటి వఱకు లభించిన వాఙ్మయమును దృష్టిలో నిడికొని చూచినచో, కృష్ణునికి ప్రియురా లైన రాధను మొట్ట మొదట ఆ పేరుతో ఆంధ్ర వాఙ్మయమున స్పష్టముగఁ జెప్పినది పాండు రంగ మాహాత్మ్యము నందు రామ కృష్ణుఁడే. సంస్కృత వాఙ్మయమునం దామె అతి ప్రసిద్ధ మైనది విష్ణువు పాండు రంగఁడుగ భూమి కవతరించునపుడే రాధను నంద గోపుని పుత్రికగ జన్మింపఁ జేసినాఁ డట. రాధ యెంతయో తపము

చేసి, తుదకు శ్రీ కృష్ణుని బొందినది. రాధ విషయమున రామ కృష్ణుఁడు బ్రహ్మ వైవర్త పురాణము ననుసరించినాఁ డనుట స్పష్టము.

పాండు రంగ మాహాత్మ్యమునందు మొట్ట మొదట శ్రీ కృష్ణ ప్రార్థనలో - కృతి పతి యైన విరూరి వేదాద్రిని మంత్రిని గూర్చి, శ్రీ వైష్ణవ స్వీకా రార్హుఁ డని రామకృష్ణుఁడు చెప్పినాఁడు క్షేత్ర మాహాత్మ్య మును జెప్పు స్థల పురాణముల కొక మేలు బంతి - పాండు రంగ మాహాత్మ్యము

## రా ధా మా ధ వ ము

శ్రీ కృష్ణుని సతిగ నిరూపించు రాధామాధవుల పవిత్ర ప్రణయ మును ఆంధ్ర వాఙ్మయమునం దొక ప్రకృష్ట మైన బంధము గలిగిన ప్రక్రియ యందు మొట్ట మొదటగఁ జెప్పినవాఁ డిప్పటికిఁ దెలిసినంత వఱకు చింతలపూడి యెల్లనార్యుఁడు అతని రాధా మాధవము ప్రసిద్ధము ఎల్లనార్యునికి వంటు బట్టిన రాధా మాధవ తత్త్వమునుఁ బట్టియే గ్రంథమును మెచ్చుకొని, రాధా మాధవ కవి యను బిరు దాయనకు శ్రీ కృష్ణ దేవరాయ లిచ్చినాఁ డని, తానే గ్రంథారంభ ములోఁ జెప్పికొనినాఁడు రాధా మాధవము మదన గోపాలుని కంకిత మీయఁబడినది అంకితము విషయమున రాధా మాధవ కవి యభి ప్రాయ మీ క్రింది విధముగా నున్నది -

"నన్ను గన్న ఫలము నా తల్లి దండ్రుల
వంశమునకు మిగుల వన్నె గలుగ
సకల పితృ గణము శాశ్వత బ్రహ్మ లో
కైక సుఖము లందునట్లు గాను -"

మదన గోపాలుని కంకిత మిచ్చు చున్నాఁడ నన్నాఁడు పై పద్యము రాధా మాధవ కవి యొక్క యంత స్తత్త్వమునుఁ బట్టి యిచ్చు చున్నది.

సంస్కృతమున రాధా మాధవమును రచించిన జయ దేవ కవిని ఈ క్రింది పద్యములో స్తుతించినాఁడు రాధా మాధవ కవి :-

"నుతియింతు వా గ్విశేష
స్థితి రాధా మాధవంబు చెప్పిన విద్యా
చతు రానను నీలాచల
పతి హితు జయ దేవ సు కవి పంచ ప్రవరున్."

కృష్ణుని యెడఁ గల మధుర భక్తి పారమ్యమున కొక చక్కని ప్రతీక రాధ. ఆండాళు వలెనే రాధ గూడ భగవానుని పరమముగ ప్రేమించినది. ఆండాళు వలెనే భగవ ద్విరహమును అతి మాత్రముగ ననుభవించినది రాధ. ప్రేమయం దామె పొందిన యవస్థల నన్నిఁటిని ఈమెయుఁ బొందినది. అయినచో - ఒక్కటియే భేదము. వారికి భగ వానుని యెడఁ గల ప్రేమ యొక్క పాళులలో పడ తీసి చెప్పుటకు వీలు కాని యంత ర వంత భేద మున్నది.

ఇంచు మించుగ రాధా మాధవ కాలముననే, వంగ దేశమం దున్న చైతన్యుని యొక్క శిష్యుఁడైన రూప గోస్వామి . రాధా కృష్ణుని యెడఁ గల భక్తి, రస రూప మైన దని చెప్పుచు, ఆ రస బాంధ ప్రక్రియ నంతను సాంగోపాంగముగా నిరూపించుచు, 'ఉజ్జ్వల నీల మణి' యను అలంకార గ్రంథమును రచించినాఁడు.

## తారక బ్రహ్మ రాజీయము

ఎల్లనార్యుఁడు 'రామ తారక బ్రహ్మ రాజీయ' మను సంస్కృత గ్రంథమును - 'తారక బ్రహ్మ రాజీయ' మను పేర తెనిగించినాఁడు. ఈ విషయ మాతఁడే గ్రంథాది యందు - 'శ్రీ రామ బ్రహ్మ తారక రాజీయంబు, పరమ భాగవతోత్తముండు - ప్రయాగ క్షేత్ర వాసి -

'నారాయణాశవము' లను మహో యంత్రీంద్రుండు సంస్కృతంబు నందు రచించె నది తెలుంగున సకల జనులకుం దెలియునట్లుగా' వ్రాయుచున్నాఁడ నన్నాఁడు తారక బ్రహ్మ రాజీయము రాముని కంకిత మీయఁబడినది అచ్యుత దేవరాయలు ప్రతి సంవత్సరమును ఒక కావ్యమును రచియింపించి, వేంకటేశ్వర స్వామి కర్పించు నియమము కలవాఁడని, తారక బ్రహ్మ రాజీయము నందలి యీ క్రింది పంక్తులు స్పష్టము చేయుచున్నవి 'అచ్యుత దేవరాయలు ప్రతి సంవత్సరము శ్రీ వేంకటేశ్వరునకు నవ్యకావ్య ప్రబంధ పుష్పాంజలి సమర్పించుచుఁ గీర్తి సుకృతంబులు నిర్వహించుకొనుచున్నవాఁడు' అని. తారక బ్రహ్మ రాజీయ గ్రంథము సాంతముగ లభించుట లేదు. సీతా రాముల ప్రణయ వృత్తాంత మిందు వర్ణింపఁబడి యుండు నని యూహింప వచ్చును

## పింగళి సూరన రచనలు

భారతార్థముతోఁ బాటు రామాయణార్థమును గూడ జోడించి చెప్పినాఁడు పింగళి సూరన్న తన రాఘవ పాండవీయమును భారతార్థము కంటె ముందు, రామాయణార్థము నుద్దేశించుట గమనింపఁదగినది గరుడము వైష్ణవ పురాణ మనుట స్పష్టము. సూరన తన కళాపూర్ణోదయము నందు కృష్ణుని కొక ప్రముఖ స్థాన మిచ్చినాఁడు. కృష్ణుని మాహాత్మ్యమును అవకాశము గలిగిన చోటుల యందు స్పష్టముగాఁ జెప్పినాఁడు సూరనకు కృష్ణుని పైనను, తన్మూలమున వైష్ణవ మతము పైనను గల యాభిముఖ్యమును వ్యక్తము చేయుటకు, కృష్ణునిపై రచింపఁబడిన దండక మొక్కటి చాలును. కృష్ణుని కుమారుఁడైన ప్రద్యుమ్నుని పరిణయ వృత్తాంతము ప్రభావతీ ప్రద్యుమ్నము నందు వర్ణించినాఁడు సూరన. కృష్ణుని వైభవము, మాహాత్మ్యము,

దుష్ట శిక్షణ - శిష్ట రక్షణ కావించుట యందలి ఆయన పరాయణత్వ మును చక్కగఁ జెప్పినాఁడు సూరన తన ప్రభావతీ ప్రద్యుమ్నము నందు.

## వైజయంతీ విలాసము

తొండరడిప్పొడి యాళ్వారుగ ప్రసిద్ధి చెందిన విప్ర నారాయణుని చరిత్రను వైజయంతీ విలాస మను పేర, సారంగు తమ్మయ రచించి నాఁడు తన గురువు కందాళ అప్పలాచార్యు లని చెప్పికొనినాఁడు తమ్మయ. అప్పలాచార్యులు తత్త్వ గురువై యుండు ననుట స్పష్టము కథలో విష్ణువు ప్రత్యక్ష మైన పిమ్మట, వైష్ణవు లందఱును గలిసి, విప్ర నారాయణుని పట్టి యోరేగించినారు.

"బ్రహ్మ సభ యెల్ల భక్తి న ప్పరమ వైష్ణ
వోత్తముని బ్రహ్మ రథమున నునిచి, పట్ట
ణమున నేఁగించి రధిక సంభ్రమము మీఱ
ఱియ్య ముందరి కొమ్మునఁ జేరి మోవ"

తన తాత యైన తమ్మయ - రామ భక్తుఁ డని చెప్పినాఁడు సారంగు తమ్మయ. వైజయంతీ విలాసమును రాముని కంకితము చేసినవాఁ డితఁడు.

## విష్ణు పురాణము

నిజ కులాచార మార్గైక నిపుణుఁడు, పరమ సాత్త్వికోదయ హృదయుఁడు నైన వెన్నెల కంటి సూరన - విష్ణు పురాణమును తెని గించినాఁడు విష్ణు పురాణమును సూరన్న తెనుఁగు సేయుట - బంగా రమునకు సువాసన కలుగుట వంటి దని, విష్ణు పురాణ కృతి

భర్తయైన రాఘవ రెడ్డి తనతో అన్నాఁడని, యీ క్రింది పంక్తులలోఁ జెప్పినాఁడు :-

"క్షితి లోనఁ బసిఁడి పరిమళ
యుత మై రత్నమును గూడి యున్నట్లు సుమీ ।
కృతి శ్రీ విష్ణు పురాణము
కృతి క_ర్తవు — నేను గృతిపతి నగుటన్"

బంగారమూ వంటి విష్ణు పురాణమునకు తావి వంటివాఁడు కాఁ గలిగిన వెన్నెల కంటి సూరన, విష్ణు భక్తుఁడు - వైష్ణవ మతాభిమాని యని చెప్పుటకు సంకోచింప నక్కఱలేదు

## మొల్ల రామాయణము

తండ్రి గురు లింగ జంగ మార్చన పరుఁడు - శివ భక్తి పరుఁడు నైనప్పటికిని, తాను మాత్రము రాముని భక్తురా లయి, రామాయణ మును రచించి రఘు రాముని నుతించుట - భు_క్తికిని, ము_క్తికిని మూల మని యా మె యభిప్రాయము బల్లిదుఁ డైన రామ సర పాల కని సన్నుతి సేయు జిహ్వకు - బెల్లము దినుచు, అల్లమున కెప ర్రైన నాసపడుదురా యనియు ఈ విషయమున నామె వక్కాణ

## విప్ర నారాయణ చరిత్ర

వైష్ణవ మత మొక్కచో - శైవు లయిన కవుల నోటి గుండ వైష్ణవ కథలను చెప్పించినది. శ్రీ రంగేశ్వర పాద పద్మారాధన నిరతుం డయిన సూకరాజు తిమ్మ నృపాలుఁడు - శైవుఁ డైన చదలువాడ మల్లన చేత విప్ర నారాయణ చరిత్రను వ్రాయించినాడు తిమ్మ

నృపాలుఁడే విప్ర నారాయణ చరిత్ర యొక్క కృతి కర్త చదలవాడ మల్లన తన శైవ మతమును వదలకయే, తాను శైవుఁడ నని గ్రంథావి యందును, అశ్వాసాంత గద్య యందును జెప్పకొనుచునే, విష్ణువు యొక్క మాలికాంశమున నవతరించిన విప్ర నారాయణుని చరిత్రను జెప్పినాఁడు.

## లక్ష్మీ విలాసము

రాయసము వేంకట పతి - వేంకటేశ్వర స్వామి భక్తుఁడు వేంకటేశ్వర స్వామి వరము వలననే పుట్టినాఁడ నను నమ్మకము గల వాఁడు ఈతఁడు తాను రచించిన లక్ష్మీ విలాసమును వేంకటేశ్వర స్వామికే అంకితము చేసినాఁడు. పై విషయమును వేంకట పతియే తన లక్ష్మీ విలాసమునందు దీ క్రింది పద్యములోఁ జెప్పకొనినాఁడు :-

"వర మతి నుదయించితి మ
ద్వరమున నటు గాన నీ వువర్ణించు కృతీ
శ్వరుఁడ నయి వరము లొసగెద
గరిమన్ లక్ష్మీ విలాస కథఁ జెప్పఁ దగున్."

ఇవి - వేంకటేశ్వర స్వామి - కలలోఁ గనిపించి, అతనితోఁ జెప్పిన మాటలు దేవతలను, రాక్షసులను సవ ముద్రమును మథింపు టతో ప్రారంభ మయి, లక్ష్మిని శ్రీ మహా విష్ణువు వివాహ మాడుటతో అంత మగుచున్నది లక్ష్మీ విలాస కథ

" — — విభ
వాలం బగు వేంకటాద్రి వల్లభు కరుణన్
శ్రీలం జెల్వొందుచు"

నున్నాఁడ నని, కవి - తన్నుఁ గూర్చి చెప్పికొనినాఁడు తన లక్ష్మీ విలాసము నందు.

## సుదక్షిణా పరిణయము

తాను శైవుఁడై యుండి, తన్నుఁ గూర్చి సహజ శైవాచార సంపన్నుఁడను - హరి పదాంబోజ సాముఖ్యుఁడ నని చెప్పికొనుచునే, వైష్ణవాచార్యు లైన కందాళ రంగాచార్యులు తన గురు వయి నట్లుగాఁ ఒప్పు, ఆయన నొక కంద పద్యములో స్తుతించినాఁడు తెనాలి అన్నయ తన సుదక్షిణా పరిణయము నందు. కందాళ రంగాచార్యులు తెనాలి అన్నయకు మత గురు వనుట స్పష్టము పూర్వ కవులతోఁ గలిసి, పాలగుమి భీమ గురుని సద్భక్తిఁ గొలుతు నన్నాఁ డన్నయ. పాలగుమి భీమేశ్వరుఁడు తెనాలి యన్నయకు విద్యా గురువై యుండు నని విమర్శకుల యభిప్రాయము ఏ మయినను, శైవుఁ డైన వ్యక్తి - వైష్ణవ మతమును స్వీకరించె ననుటయందు వైష్ణవ మతము యొక్క ప్రభావము స్పష్టము 'సత జన బుధ మందారుఁ' డని రంగాచార్యులను స్తుతించుటలో - అతనికి వైష్ణవమునఁ గల యభిమత మవగతము గాఁగలదు.

## అర్థ పంచక వివరణము

కాపూరి యెల్లయ కవి బ్రహ్మాండ పురాణము నందలి అర్థ పంచక వివరణమును తెనిఁగించి, దానిని శ్రీరామున కంకిత మిచ్చి నాఁడు తన గురు వైన తిరుమల వేంగళాచార్యులను, ఈ క్రింది విధముగా - బ్రహ్మాండ పురాణమునందు స్తుతించినాఁడు యెల్లయ కవి :-

"హరి పాద కమల సేవా
నిరతు - విశుద్ధాంతరంగు - నిర్మల
తిరుమల వేంగళ స
ద్గురు నాశ్రిత ముక్తి దాయకుని స్మరియింతున్."

ఎల్లయ కవి యాంధ్రీకరించిన అర్థ పంచక వివరణ కథా భాగమున విష్ణువు యొక్క పరశురామ - బలరామ - శ్రీ కృష్ణావతారముల చరిత్ర వర్ణింపఁబడినది ఎల్లయ కవి - మిత్ర విందాపరిణయ మను గ్రంథమును గూడ రచించినట్లు తెలియుచున్నది గాని, అది యింత వఱకును లభింప లేదు

## ము క్తి చి ం తా మ ణి

కోన తిమ్మరాజు ప్రేరణముచే, వేంకటాచార్యులు - 'గురు పరంపరానుసంధాన పూర్వకంబుగా శ్రీ జగ న్నాయకుని కంకితంబుగా ముక్తి చింతామణి ప్రబంధంబు తెనుంగు చేసినాఁడు ఈ ప్రబంధము - జగ న్నాధ క్షేత్ర మాహాత్మ్యమును వర్ణించు చున్నది యతిరాజ కుల పెరుమాళాచార్యుల కుమారుఁ డీ వేంకటాచార్యుఁడు. పురుషోత్తమ స్థలములో, అనఁగా - జగ న్నాధ క్షేత్రములో - భగవ న్నిర్మాల్యమును గ్రహించినచో, ధర్మాధర్మ విచార సంధ్యా పూర్వ యజ్ఞాది సత్కర్మ లన్నియు వ్యర్థమే యట ఈ విషయము - 'మర్త్యాళి కెల్లన్ వర్తించు' నట జగన్నాథ క్షేత్ర వాసులు చేసిన వ్యర్థ హింస గూడ పుణ్యమే యగు ననియు, నిరతాన్నమౌ చద్ది గూడ మహా ప్రసాదమే యగు ననియుఁ జెప్పఁబడినది జగన్నాథుని ప్రసాద మాహాత్మ్యమును కవి యీ క్రింది విధముగా వర్ణించుచున్నాఁడు :-

"హీనుఁడు ముట్టినాఁ దనుచు నెంచి మదీయ మహా ప్రసాదమున్
దా నుపభోగ్య యోగ్య మని త త్పర వృత్తిఁ బరిగ్రహింపకే
మానిన సద్విజుండు హృత మంగళుఁడై, భవరోగ భారియై
న్యూనతఁ జెంది పంచమ నియోగమునందు వసించు నెప్పుడున్."

## రఘు నాథ నాయకాభ్యుదయము

తంజావూరు సంస్థానమును పరిపాలించిన చెవ్వప్ప నాయకుఁడు శైవుఁడు. అతని కుమారుఁడైన అచ్యుత నాయకుఁడు శ్రీరంగము నందలి స్వామి యొక్క భక్తుఁడు. అతఁడు రంగనాయకునకు గావించిన కైంకర్య విశేషములు రఘు నాథ నాయకాభ్యుదయము నందు, ఈ క్రింది విధముగాఁ జెప్పఁబడినవి .-

'రంగ ధామునకు శ్రీ రంగంబునందు
బంగారు సజ్జఁ బ్రాకారములను
రంగు మీఱు కిరీట రాజంబు వేసిరి
శృంగార వనములఁ జెలువొందఁ జేసి "

అచ్యుత నాయకుఁడు - తాను వృద్ధుఁడు కాక పూర్వమే రాజ్య భార మును తన కుమారుఁడైన రఘునాథ నాయకునిపై నునిచి, నిశ్చింతగా భగవదారాధనమున కాలముఁ గడిపె ననుట కనేక నిదర్శనము లున్నవి. రఘునాథ నాయకుఁడు -

"— — — పళవానేరి నగర
నామ తీర్థము పురాణ శ్రవణంబు
శ్రీమూర్తి దానాద్యశేష దానములు
గావించి విజయంబు గలుగ నక్షతలు
శ్రీ వైష్ణవు లొసంగ శిరమునఁ దాల్చి."

తోపూరు యుద్ధమునకు వెళ్ళినాఁ డని రఘునాథ నాయకాభ్యు దయము చెప్పుచున్నది. రఘునాథ రాయలు తన సభా మందిర ములకుఁ గూడ, ఇందిరా మందిరము, లక్ష్మీ విలాసము, శ్రీరామ సౌధము అని పేళులు పెట్టెనట్లు సంగీత సుధ, రఘునాథ నాయకాభ్యు దయము చెప్పుచున్నవి.

రఘునాథ రాయలు రామ భక్తుఁ డనుట స్పష్టము. సేతువు నందును, కుంభ కోణము నందును, శ్రీ రంగము నందును ఈతఁడు రామ భద్రుని ప్రతిష్ఠించి, మహోన్నత గోపుర విరాజ మానము లగు మంటపములను గట్టించినాఁడు శ్రీ వేంకటేశ్వరునకు, శ్రీ రంగ నాథునకు — మహోజ్జ్వల మంటప రాజములను గట్టించినాఁడు. తులా పురుషాది దానముల చేతను, నిరతాన్న దానము చేతను బహు భూసురుల దన్పినాఁడు

## వాల్మీకి చరిత్ర

శ్రీ రాముఁడు రఘునాథునకు కలలోఁ గనిపించి, వాల్మీకి చరిత్రము రచింపవలసినదిగా ననతిచ్చినాఁడు వాల్మీకి చరిత్ర — శ్రీరామునికే అంకితము చేయఁబడినది వాల్మీకి చరిత్ర యొక్క కథా గమనమునందు విష్ణు సేవకుఁ బోవుచున్నాఁడు నారదుఁడు హరి నామ సంకీర్తనము గావించినాఁడు సప్తర్షులు వైకుంఠమునకు వెళ్ళినారు. నారాయణుడు వర్ణింపఁబడినాఁడ మహా విష్ణువు ప్రసన్నుఁ డైనాఁడు భాగవతమునందలి కథ సంగ్రహముగఁ జెప్పఁబడినది. శ్రీ రంగ శాయి, వేంకటేశ్వర స్వామి, అహోబల నరసింహస్వామి వర్ణింపఁ బడినారు 'సర్వ వర్ణ నాధారణంబును, నిఖిల మంగళ ఫలదంబును, దేశ కాల నియమోపేతంబును, సత్య కామంబును ప్రశు త్యభిరామం బును, మను సార్వభౌమంబును' నైనది రామ నామ మని చెప్పఁ బడినది రామాయణమును రచింపవలసిన దని కూడ రాముఁడు రఘు నాథునకు స్వప్నమున సాక్షాత్కరించి చెప్పినాఁడు

పారిజాతాపహరణ ప్రబంధమును, గజేంద్ర మోక్షమును, రుక్మిణీ కృష్ణుల వివాహ యక్ష గానమును రఘు నాథుఁడు రచించినాఁ డని తెలియుచున్నది గాని, అవి నేఁడు లభించుట లేదు.

రఘునాథ రాయల యాస్థానమున నున్న రామ భద్రాంబ - శ్రీ రామ భద్ర కరుణా కటాక్ష లబ్ధ సారస్వత రఘునాథ నాయకుని కుమారుఁ డగు విజయ రాఘవ నాయకుఁడు - మూర్తీ భవించిన వైష్ణవ మతము.

## రఘు నాథ నాయకా భ్యుదయము

తన తండ్రి యైన రఘు నాథ నాయకుని దిన చర్యను, తన రఘు నాథ నాయకాభ్యుదయము నందు విజయ రాఘవుఁడు వర్ణించినాఁడు. రాజ కుటుంబమునకు సంబంధించిన కొలువునకు వెళ్ళుటకు ముందు - రఘు నాథుఁడు బంగారు చంగులు గల పీతాంబరములు కట్టును, కంఠ మాలికలు, కంట సరము ధరించును. స్నానము చేసిన పిదప, శ్రీ సతికి లక్ష్య మగు లక్ష్మీ విలాస భవనమును జేరి, పావన మగు గురు పాద ద్వయము సేవించును. దర్పణమును జూచిన తర్వాత, తిరుచూర్ణ రేఖతో - తిరుమణి నుదుట ధరియించి, మేన ద్వాదశోర్ధ్వ పుండ్రములను సవరించి, మౌక్తిక జప సరం బూని, అష్టాక్షరిని జపించి, అనంతరము - తళుకు బంగరు శమ్మ తమ్మి పూవుల సకల సంపూర్ణ వైభవ మొప్ప రాజ గోపాలునకు తిరువారాధనము భక్తి పూర్వకముగ గురువు నానతి రీతి నాచరించును ఆరాధనానంతరము భాగవత రామాయణ పారాయణము సేయుచున్న పరమ భాగవతులను పేరు పేర్వరుస బిలిచి, చందన తాంబూలము లర్పించి, నిత్య దానములు పెద్దల కొసంగి, ఆచార్యుల మంత్రాక్షతలు సహజ సద్భక్తి మస్తకమునఁ దాల్చి, ఆచార్య పాద పద్మములకు నిజ శిర మానించి నమస్కరించి, దేశికోత్తముల తిరుమాళిగలకుఁ బయనించును.

రామ చంద్రుఁడు, రామ బాణము, విష్ణు చక్రము మున్నగునవి రఘు నాథుని యేనుఁగుల పేళ్ళు. రామ భద్రుని భంగి, భద్ర

గజేంద్రము నధిరోహించునఁట రఘునాథుఁడు. తరువాత, శ్రీ రామ భద్రుని సేవించును. స్వారి చేసి తిరిగి వచ్చిన తరువాత, రఘు నాథుఁడు లక్ష్మీ విలాస భవనమును ప్రవేశించి, రంగనాయకుల కడ కేఁగి, ఆ దేవిని సేవించును తరువాత, శ్రీ రామ సౌధంబు చెంత నున్న రాజ గోపాలుని సేవించును. అభ్యంతర మందిరమున కేఁగిన తరువాత, రఘు నాథుఁడు పంచ మహా యజ్ఞములు కావించును. భోజనానంతరము శత పద న్యాసము చేసిన తరువాత, బాల రామా యణమును పఠించును

రామ భద్ర శాల యందు శ్రీ రామచంద్రుని భావ చిత్ర ముండెను పట్టాభి రాముని భావ చిత్ర మున్న సౌధమే శ్రీరామ సౌధ రాజము శ్రీ రామ సౌధమునకు ముందు, మదనావతారుఁడై, మన్నారుఁ డున్న మదన గోప విలాస మందిరాంగణ మున్నది.

## విప్ర నారాయణ చరిత్ర

విజయ రాఘవుఁడు – తాను శ్రీ కృష్ణుని యవతారమే యని భావించెను. పరమ భక్తాగ్రగణ్యుఁ డైన విప్రనారాయణుని చరిత్రను యక్ష గాన నాటకముగా హవణించుట, తన విధ్యుక్త ధర్మ మని పరమ వైష్ణవుఁ డగు విజయ రాఘవుఁడు భావించి యుండును. విజయ రాఘవుని విప్ర నారాయణుని చరిత్ర – విష్ణు భక్తికి నిధానము ఇం దామూలాగ్రముగ వైష్ణవ మగు తేజము తాండవించు చుండును. తమ కుల దైవ మగు రాజ గోపాలుని, ఆ స్వామి దివ్య సన్నిధిచే పవిత్రం బగు దక్షిణ ద్వారకా స్థలిని నిల్పుటలో – కవి యుద్దేశ మిదియునై యుండును :–

ప్రతి దినము శ్రీ రంగ దేవాలయ శిఖరమును దర్శింపనిదే విజయ రాఘవుఁ డారగించువాఁడు కాఁ డట. త న్నిమిత్త

మే డంతస్థుల గోపుర మొకటి నిర్మింపఁ బడెను విజయ రాఘవునకు రంగ నాథుఁ డన్నచో - భక్తి ప్రపత్తులు మెండే కాని, తన కుల దైవమును త దావిర్భావమునకు కారణ మైన దివ్య క్షేత్రమును వర్ణించు నభిలాష తీవ్ర తరమై యుండును

విప్ర నారాయణ చరిత్ర యందు విజయ రాఘవుఁడు విష్ణు లీలా వినోదమును వర్ణింప నెంచెను తల్లీలా వినోదమున బాహ్య ప్రపంచమునకు పతితులుగాఁ గన్పట్టినను, పరమ పదమును జూర గొన్న ధన్యులు దేవదేవి విప్రనారాయణులు భక్తుని పతనము విష్ణు మాయా ప్రభావమున కొక ప్రబల నిదర్శనము 'మమ మాయా దురత్యయా' అను మహా విష్ణు వాక్యమునకు విప్రనారాయణుని జీవిత మొక మహా భాష్యము కావుననే, భక్త ప్రపంచమున కొక యమూల్య సందేశము, దివ్యానుభూతి విశేషములను దెల్పుచు, తత్త్వా త్త్యవసరమున సంభవించు విషమ ప్రమాదములను వ్యక్తము సేయు నొక యమర సందేశము భగవంతుఁడు భక్తుని పరీక్షించుట యుక్త మగునా కాదా యను తర్క వితర్కముల కిందు తావే లేదు అట్టి సమన్వయమును ఆ నాఁటి వా రంగీకరిండెడివారు కారు సర్వజ్ఞుడు - సర్వ శక్తి యుతు భగవంతుని దివ్య సంకల్ప మెఱుంగ, మానవుఁ డెంతవాఁ డని వారు సమాధానపడి యుందురు ఈ నాఁటి వారికిని, వా రిచ్చు సమాధాన మదియే మన యిచ్చ వచ్చినట్లు భావించుటకు మన కెంతటి స్వాతంత్ర్యము గలదో - వారి యిచ్చవచ్చినట్లు భావించుట - వారికిని అంత స్వాతంత్ర్యమే కలదు

విప్ర నారాయణుని గర్భ వైష్ణవత్వము స్పష్టముగా ప్రస్తుతింపఁ బడినది విప్ర నారాయణుఁడు కావ్య నాటక వేది, దివ్య ప్రబంధోప దేశి దేశికుఁడు, యోగ విద్యా శాలి, ఉపనిష ద్వేది, పరమ పావనుఁడు, ఏకపత్నీ వ్రతుఁడు, గురు భక్తి పరుఁడు, సద్గుణముల ప్రోవు ఇట్లా

పరమ భక్త కులాగ్రగణ్యు నెంత వర్ణించినను, విజయ రాఘవునకు సంతృప్తి కలుగ లేదు జప తప స్స్వాధ్యాయ హోమ దేవ పూజా వైశ్వ దేవాది విధు లెన్ని కావించినను, పాప మా విష్ణు భక్తునకు వైరాగ్య ముదయింపలే దఁట ! సంతత వీర వైష్ణవ గోష్ఠి వలననే, అతనికి సర్వ సంగ పరిత్యాగ బుద్ధి కలిగినది. వైరాగ్య మూదయింప వచ్చును కాని, చక్రాంకితములు లేని వైరాగ్యము చక్ర ధరునకు రుచింపునా ?

ద్వాదశోర్ధ్వపు౦డ్ర ధారణము, తిరుమంత్ర ద్వయ విచారణము, చరమ గీతా శ్లోక జపము విప్ర నారాయణుని వీర వైష్ణవ గోష్ఠికి నిదర్శనములుగాఁ జెప్పఁబడినవి. తీర్థ యాత్రలు సేయుచు, విప్ర నారాయణుఁడు చివరకు మన్నారు గుడికి వచ్చినాఁడు అక్కడ - విజయ రాఘవ భూపాలుం డర్పించిన చేటి పచ్చల కిరీటంబు మొద లైన పెద్ద సొమ్ములుఁ జెక్కి, ముదురు కెంపుల గుంపులు, పది వేల భాను బింబంబు లావిర్భవించినట్లు,గర్భ గృహాభ్యంత ర్బహిః ప్రదేశంబు లెల్ల బ్రకాశింపఁజేయఁ గెంగేలఁ గీలించిన చెంగోలు డాలు జాలువార, రుక్మిణీ సత్యభామలతోఁ జెన్నారుచున్న మన్నారు దేవునిఁ గన్నార సేవించి, అ న్మూర్తి భావించి, శ్రీ భూ నీళా సమేతుఁ డైన పరవాసు దేవుని భజియించి, యానంద బాష్ప ధారలు జాలుకొనఁ బులకలు గీలుకొన ననురాగంపు మొలకలు మొలవ నను నేలుకొను మని ప్రార్థించి'నాఁడు 'పలుమాఁటు నీదు పదంబులు తలంచినవారలకు సుకవితా స్ఫురణంబుల్ గలుగుట యరుదె' యనుచున్నాఁడు - వాసుదేవ ప్రసాదాసాదిత మైన కవితను, తల్లీలా వినోద వర్ణనమునకే వినియోగించి, కవితారూప మగు కైంకర్యమును గావించి, ధన్యుఁ డైనట్టి భక్త శిఖామణి యైన కవి - విజయరాఘవ భూపాలుఁడు

విప్ర నారాయణుఁడు - 'మాయా వాది మద గజ కంఠీరవుండు.' ఇల్లు వెడలి పొమ్మన్న విట కంటకితో - ఈ క్రింది విధముగా ననుచున్నాఁ డాతఁడు - ధవళోర్ధ్వ పుండ్ర ధారణంబు మాకసాధారణంబు. పరమ మాయా వాద భంజనంబు మాకు దివ్యాఁజనంబు ఈ ప్రపంచంబు విష్ణు మాయ యని యెఱుంగుదుము గాని, తక్కిన మాయ లెఱుంగము మా వంటి వారు మీ యిల్లు జేరుట హరి ప్రేరణం బని తెలిసికొందురు గాని, యీలా గందురా ?' యని

## విజయ రాఘవ నాయకుని ఇతర రచనలు

విజయ రాఘవుఁడు తన కాళియ మర్దన యక్ష గానము నందు - కృష్ణుఁడు కాళియ మర్దనము గావించిన కథను వర్ణించినాఁడు. పూతనా హరణము నందు పూతన వృత్తాంతము వర్ణింపఁ బడినది. రాజ గోపాల స్తవము, చెంగమ్మ స్తవము తన పూతనా హరణ యక్ష గానము నందు మన స్సంపూర్తిగఁ జేసినాఁడు విజయ రాఘవుఁడు తన ప్రహ్లాద చరిత్ర యక్ష గానమున- రాజ గోపాలునితో పాటుగ, కనకాబ్జ వల్లి ని స్తుతించి, ప్రహ్లాద చరిత్రను జెప్పనారంభించినాఁడు ఇందు విజయ రాఘవుఁడు - విష్ణు భక్తిని అత్యాసక్తితో నిరూపించినాఁడు రాజ గోపాల విలాసము, గోవర్ధనోద్ధరణము, రాస క్రీడా నవనీత చోరము, పారిజాతాపహరణము, రుక్మిణీ కల్యాణము, రాధా మాధవము, సత్య భామా వివాహము, ఉషా పరిణయము, దక్షిణ ద్వారకా స్థల వర్ణనము, సముద్ర మథన నాటకము, పాదుకా సహస్రము, గోపికా గీతలు, భ్రమర గీతలు, రాజ గోపాల దండకము, మన్నారు సాంగత్యము, వేడి కోలలు, విన్నపములు, దరువులు, ఏలలు, విడి పదములు మున్నగు వానిని గూడ విజయ రాఘవుఁడు రచించినట్లు తెలియుచున్నవి గాని, అవి ఇంత వఱకు లభింపలేదు.

## హేమాబ్జ నాయికా స్వయంవరము

విజయ రాఘవుని కుమారుఁడైన మన్నారు దేవుఁడును - తండ్రి వలెనే విష్ణు భక్తుఁడు ఈతని రచన - హేమాబ్జ నాయికా స్వయంవరము సముద్ర మథనము, లక్ష్మి యైన చెంగము దేవి యుద్భవించుట, ఆమె మన్నారు దేవుని వరించుటయు హేమబ్జ నాయికా స్వయంవరము నందలి కథ. సముద్రునకు, మన్నారు దేవునికి చెంగమ్మ విషయమై విజయ రాఘవుఁడు రాయబారము చేసినట్లును, చెంగమ్మ వివాహము చేసికొనిన తరువాత మన్నారు దేవుఁడు తంజావూరు వేంచేసి, విజయ రాఘవుని యర్చన లందుకొని, అతని నాశీర్వదించినట్లును కవి యీ గ్రంథమునందుఁ జెప్పుట - అతని వైష్ణవ మత దృష్టి కొక చక్కని నిదర్శనము రాజగోపాల స్తుతితో పాటుగ, హేమాబ్జ నాయికా స్వయంవర గ్రంథాది యందు - విష్వక్సేనుని, అనంతుని, గరుఁడుని, విష్ణు పంచాయుధములను, పన్నిద్ద రాళ్వారులను సంభావించి నమస్కరించినాఁడు శత క్రతు శ్రీనివాస తాతా చార్యులకు నమస్కరించినాఁడు తనదు ప్రపితామహుని - మహా మహుని - వీర వైష్ణవ సార్వభౌముని అచ్యుతాళ్వారుల నభినుతించినాఁడు చెంగమ్మ స్వయంవరమునకు - కంచి వరదరాజులును, శ్రీ రంగశాయియు, వేంకటేశ్వరుఁడును విచ్చేసి రఁట! అయినను, చెంగమ్మ - వారి నందఱిని వీడి, మన్నారు దేవునే వరించినది.

## మన్నారు దాస విలాసము

రాజ గోపాల కరుణా కటాక్ష వీక్షణానుక్షణ ప్రవర్ధమాన సారస్వత ధురీణ యయిన రంగాజమ్మ - తన మన్నారు దాస విలాస నాటక ప్రారంభమునందు రాజగోపాలుని, దశావతారములను, హేమాంబుజవల్లి విష్వక్సేనులను, పన్నిద్ద రాళ్వారులను, తిరుమల

తా తాచార్య - రామానుజాచార్య - వేదాంతదేశిక - శ్రీనివాసాచార్యు లను స్తుతించినది.

మన్నారు దాస విలాస నాటక కథా గమనమునందు విజయ రాఘవుఁడు మన్నారు స్వామిని స్తుతించినాఁడు శత క్రతు శ్రీనివాస తాతాచార్యులు - అగ్ర భాగంబునఁ గూర్చుండ, స్వామికి షోడశోప చారము లొనర్చినాఁడు శోణాంబు రుహ కీరవాణి యైన మహా లక్ష్మి యొఱుకతయై, కాంతిమతి దగ్గరకు వచ్చి, ఆమెను విజయ రాఘవుఁడు తప్పక వివాహ మాడు నని చెప్పినది రాజు కొలువు సేసినంతనే అర్చకులు వచ్చి, స్వామి యొక్క తీర్థ ప్రసాదముల నాయన కిచ్చి యాశీర్వదింతురు. మహా విష్ణువునే నాయకునిగ భావించి, వార వనితలు పద కేళి వినిపింతురు అవసరము ల - వారు స్వామికి విన్న పములు సేయుదుడు గోవర్ధనోద్ధరణ, గోపికా వస్త్రాపహరణ భావ ప్రతిమలు తిరువీధి యందు స్వామికి ఇరు ప్రక్కల నున్నవి.

మన్నారు దాస విలాస నాటక కథనే ప్రబంధముగ, మన్నారు దాస విలాస మను పేరుతో రంగాజమ్మ రచించినది. మన్నారు దాస విలాసమును రచింప వలసిన దని చెప్పుచు, ఆ ప్రబంధమును రాజ గోపాలుని కంకితము సేయ వలె ననియు, ఏ త త్ప్రబంధమునకు అత్యా దిక మహ త్త్వంబు గలుగఁ గల దన నీటం జెన్నారు మన్నారుల ఫాల్గున మహోత్సవాది దివ్య వైభవంబులు వర్ణింపవలయు ననియు విజయ రాఘవుఁడు రంగాజమ్మతోఁ జెప్పినాఁడు రఘునాథ రాయలు పుత్ర ప్రాప్తికై రాజ గోపాలు ని ప్రార్థించినట్లును, అంతట రాజ గోపాలుఁడు ప్రత్యక్షమై, 'విజయాఢ్యుఁ డగు సుతుని వేడితివి గనుక, లీల మము రాఘవునిగఁ గొల్చితివి గనుక, విజయ రాఘవ నామంబు దాల్చి, వె య్యేం డ్లీ పుడమి రక్షింతు' నని రఘునాధునితోఁ జెప్పినట్లును గ్రంథారంభము నందలి వంశావళిలో ప్రథ మాశ్వాసమున రాజ గోపా

లోత్సవ ప్రసంగ మున్నది. ద్వితీ యాశ్వాసమున రాజ గోపాలుని తిరు వీథి మహోత్సవము చెప్పఁబడినది గ్రంథాది యందు విజయ రాఘవుని వర్ణించు సందర్భమున, ఆయనను గూర్చి - 'హేమాబ్జ నాయికా వర తనూభవుఁ' డని విస్పష్టముగాఁ జెప్పినది రంగాజమ్మ

"మా యవతారమై మహి నుదయించి
మీ యయ్య యై ధైర్య మేతులై మించి
యఘటన ఘటనా సమర్థుఁడై వెలయు "వాఁడు-రఘునాథుఁ

డని, రాజగోపాలుఁడు విజయ రాఘవునికి కలలోఁ గనిపించి చెప్పినట్లు, రఘు నాథ నాయకాభ్యుదయమే చెప్పుచున్నది.

## రాజ గోపాల విలాసము

శ్రీమత్కాళహస్తీశ్వర కరుణా కటాక్ష లబ్ధ సిద్ధ సారస్వత నయనుఁ డైన చెంగల్వ కాళ కవి - రాజ గోపాల విలాసమును రచించు టకు హేతు భూత మైనది వైష్ణవ మత ప్రభావమే యనుట స్పష్టము రాజ గోపాల విలాసము నందలి మొదటి నాలు గాశ్వాసముల యందును, శ్రీకృష్ణుని దక్షిణ నాయకత్వమును విపులముగ వర్ణించు టతో తృప్తి చెందని కవి - తరువాతి యాశ్వాసమునందు దక్షిణ ద్వారకగా ప్రసిద్ధి నందిన మన్నారు క్షేత్రము యొక్క ఉత్పత్తి మాహా త్మ్యములను వర్ణించినాఁడు విష్ణువు ప్రత్యక్ష మైనాఁడు, రుక్మిణ్యా ద్యష్ట మహిషీ సేవితుఁడై, షోడశ సహస్ర గోపికా గణ పరివృతుఁ డైన శ్రీకృష్ణుని రూపమున, ఆ చంపక వనము నందు వసింప వలసినదిగా - గోప్రళయుఁడు విష్ణువును వరము కోరినాఁడు ఆ ప్రకారమే జరిగినది. ఆ చంపక వనమే దక్షిణ ద్వారక, గోప్రళయుఁ డచట కృష్ణ తీర్థమును, హారిద్రా నదిని, విష్ణు పుష్కరిణిని, బృందావనమును సృజించినాఁడు గోప్రళయుఁడు చివరకు విష్ణు సాయుజ్యము నందినాఁడు

ఆ క్షేత్రము యొక్క మాహాత్మ్యము అద్భుత మైనది. బ్రహ్మయు - లక్ష్మియు తపము చేసి, విష్ణువును మెప్పించి, వరములను బొందినది ఆ క్షేత్రమునందే అచ్చటి హరిద్రా నది యందు క్రుంకు లిడినచో, కృతఘ్నత వలన గలిగిన పాపము గూడఁ బోవును తన్ను సత్కరించిన యజ్ఞ శీలుఁ డను మునిని, రాజశేఖరుఁ డను రాజు అవమానించి, కృతఘ్నత వలనఁ గలిగిన పాపముచే నున్మత్తుఁ డైనాఁడు తరువాత, ఆ రాజు - షోడశ మహా దానములు గావించి, ఆ క్షేత్ర స్వామి యొక్క కైంకర్యమున కపార ధన మిచ్చినాఁడు. రాజ గోపాల విలాస గ్రంథము యొక్క యంతమున, అష్టాక్షరీ - ద్వాదశాక్షరీ మంత్ర మాహాత్మ్యమును కాళ కవి స్పష్టముగాఁ జెప్పినాఁడు.

## జయ విజ యాభ్యుదయము

జయ విజ యాభ్యుదయ మను తన గ్రంథమును వేంకటేశ్వర స్వామి కంకితము చేసినాఁడు రాజవోలు సుబ్బరాయ కవి. సుబ్బరాయ కవి యొక్క యన్న దమ్ములు నలువురు గూడ, హరి చరణ భజన తత్పరులు. శేషాద్రీశు కారుణ్యత వలననే తన జయ విజ యాభ్యుదయ మును రచింతు నని చెప్పినాఁడు రాజవోలు సుబ్బరాయ కవి :-

"విమల మతి న్మహా కృతుల వేఁడుకతో రచియించి, మూఢ భూ
రమణుల కిచ్చి, వారు సుకంబుగఁ బ్రోవక యున్నఁ గూటికై
శ్రమ పడి చచ్చి, దుర్గతి నజస్రము బొందుట కన్నఁ, బక్షి రా
డ్గమనునకున్ సమర్పణముగా నొనరించినఁ గల్గు సౌఖ్యముల్."

అను దృష్టి కలవాఁడు సుబ్బరాయకవి.

"వన రుహ లోచనుం డిటుల వర్తిలెనె యను నొప్పు ధీ యుతున్
వినుతి యొనర్తు మ ద్గురుని వేంకట భట్టరు దేశికేంద్రునిన్"

అని చెప్పినాఁడు సుబ్బయ కవి జయ విజ యాభ్యుదయమే కాక, సుబ్బరాయ కవి యింకను - గరు డాంజనేయ వా గ్వాద కథను, సుదంతా వివాహ ద్విపదను, కృష్ణార్జున సంవాదమును గూడ రచించి నట్లు చెప్పకొన్నాఁడు గాని, ఆ గ్రంథము లింతవఱకును లభింపలేదు.

## అధ్యాత్మ రామాయణము

రాణా ఇమ్మడి జగదేవరాయలు - అధ్యాత్మ రామాయణమును వ్రాసినట్లుగా, పొన్నతోట యౌబళ కవి - తన వామన పురాణము నందుఁ జెప్పినాఁడు గాని, ఆ గ్రంథ మింత వఱకును లభింప లేదు. ఇమ్మడి జగ దేవరాయలు - పెక్కు గీత ప్రబంధములను గూడ రచించినాఁ డఁట. ఈతఁడు వైష్ణవుఁడై యుండు నని యూహింప వచ్చును. అందులకు కారణము - పొన్నతోట యౌబళ కవి, తాను - కందాళ భావనాచార్యుని తనయుఁ డైన శ్రీ రంగ గురుని శిష్యుఁడ ననియుఁ శ్రీమ ద్వేంకట రమణ పరిచరణ ధురంధరుఁడ ననియు తన వామన పురాణమునందుఁ జెప్పకొనినాఁడు

## వరద రాజు వాఙ్మయము

వేంకటేశ్వర స్వామి భక్తుఁ డైన కట్టా వరదరాజు - తన పరమ భాగవత చరిత్రను, శ్రీ రంగ మాహాత్మ్యమును, రామాయణ ద్విపదను వేంకటేశ్వరునకే అంకితము చేసినాఁడు. వరద రాజు యొక్క తాత తండ్రులు వైష్ణవులే. తన ప్రతి గ్రంథము నందును తనకు వేంకటేశ్వ రుఁడు కలలోఁ గనిపించి, ఆ గ్రంథమును తనకే అంకిత మీయవలసి నదిగాఁ జెప్పినట్లు చెప్పికొనినాఁడు వరద రాజు.

## చారు చంద్రోదయము

తాడిపర్తి యందు తాను ప్రతిష్ఠించిన గోపాల కృష్ణునికి చెన్నమరాజు - తన చారు చంద్రోదయమును అంకితము చేసినాఁడు. చెన్నమరాజు యొక్క పూర్వులు - హరి ధ్యాన ఘనులు చెన్నమ రాజు - తాను ప్రతిష్ఠించిన గోపాల కృష్ణునికి కిరీట పీతాంబరములు చేయించినాఁడు గోపాల కృష్ణాలయము సమీపమున కోనేరు కట్టించి, అచటనే వనమును వేయించినాఁడు.

## శ్రీ వేంకటేశ్వర విజయ విలాసము

వేంకట నాథ వర ప్రసాద ప్రసాదిత కవితా విలాసుఁ డైన గుఱ్ఱపరపు వేంకయ కవి - తన ప్రబంధ రాజ మగు వేంకటేశ్వర విజయ విలాసము నందు, వేంకటేశ్వరునకు అలమేలు మంగతో నైన పరిణయ వృత్తాంతమును వర్ణించినాఁడు. ఇతఁ డీ ప్రబంధ రాజమును వేంకటేశ్వర స్వామికే అంకిత మిచ్చినాఁడు ఇతఁడు - జాంబవతీ విలాసమును, పరమ భాగవత చరిత్రమును, బాల రామాయణ ద్విపదను గూడ రచించినట్లు తెలియుచున్నది కాని, ఆ గ్రంథములం దొక్కటి గూడ నేటి వఱకు లభింప లేదు ప్రాయికముగా - ఈతని గ్రంథము లన్నియు - వేంకటేశ్వరునికే యంకితము సేయఁబడి యుండు నని యూహింప వచ్చును

## క్షేత్రయ్య పదములు

జగత్తు నందలి యేకైక పురుషుఁ డైన మువ్వ గోపాలుని తోడి శృంగారానుభవమున తల మున్కలుగ ఈఁతలు వైచినాఁడు క్షేత్రయ్య. మువ్వ గోపాలుని శృంగారమును తనివి తీర వర్ణించి, ధన్యుఁ డైన

యమరుఁ డాయన మువ్వ గోపాలుని మీఁద క్షేత్రయ్య - సుమారు నలువది యైదు వందల పదములకుఁ బైగ రచించి యుండు నని విమర్శకు లూహించుచున్నారు కాని, అందు సుమారు మూఁడు వందల యెనుబది పదములు మాత్రమే నేఁడు లభించుచున్నవి. ఎంఱు వైష్ణవుఁ డైన తంజావూరు విజయ రాఘవుని యాస్థానమును సందర్శించి, అతనిపై కొన్ని పదములను గూడఁ జెప్పినాఁడఁట క్షేత్రయ్య శృంగార మును చాల పచ్చిగ వర్ణించినంత మాత్రమున, అతఁడు తన జీవితము నందున అట్టి శృంగారమునే యనుభవించి యుండునని యూహింప వలసిన యావశ్యకత లే దనియే పలువురు పండిత విమర్శకుల యభి ప్రాయము ఇక్కడ ఒక విషయమును స్పష్టము చేయవలసి యున్నది మానవుని యందలి మేధ యొక్క - హృదయము యొక్క సంబంధ మెంతటి పటుత్వము గలిగినది యైనను గావచ్చును. కాని, ఆ రెంటి యునికి యందు సామ్యము నూహించుట కవకాశ మే మాత్ర మును లేదు మహాత్ము లందఱును మహా మేధావులే. మాహాత్మ్యము నందే మహా మేధావిత యున్నది అది కా దనుట కాదు. మేధ - యూహించిన యంశముల నన్నిటిని హృదయ మంగీకరించు నని చెప్పుటకుఁ గల యవకాశము తక్కువ యనుట మాత్రమే యిట నుద్దేశింపఁబడిన విషయము మానవుని యందు శృంగార ముండుట దోషము గాదు మనస్సు గలిగిన మానవునిలోఁ గానిచో - మనస్సు లేని బండ ఱాయిలో శృ గారం మే ముండును ? శృంగార ముండుటే దోష మని యన్నచో - భక్తి యోగమే అర్థ రహిత మైనది కావలసి వచ్చును మానవుని కే భావము గలుగుటయం దైనను దోష మేమియు లేదు భావము పరమాత్మ స్వరూపమే గదా ! అయినచో నొక్కటి - మానవుని యందలి ఆ భావము లన్నియును ఉన్నత మైన పరమార్థము నెడ నున్ముఖులు కావలెను. ఇట శృంగార శబ్దముచే నుద్దేశింపఁబడిన యంశము తుచ్ఛ మైన కామ సుఖానుభూతి మాత్రమే కాదు. శృంగా

రము నందు కామ సుఖానుభూతి యొక లేశ మైనచోఁ గావచ్చును 'కామ క్రోధాభిమానాదికం తస్మి న్నేవ కరణీయమ్' (కామ క్రోధాభి మానాది భావములను భగవానుని పైనఁ జూపవలయును ) అను నారద భక్తి సూత్రమున కర్థము, పైఁ జెప్పఁబడినదియే. రామకృష్ణ పరమ హంస యందుఁ గలిగిన కామము - ఆయన యున్నతికే హేతు వైనది. వివేకానందుని యందుఁ గలిగిన కామము ఆయన వైరాగ్య మెక్కువ యగుటకే కారణ మైనది వివేకము తగిన యంత లేని యప్పుడు, కామము మానవుని పతనమునకు హేతు వగుచున్నది. క్రియ యను నది సంకల్పము యొక్క స్థూల రూపము మాత్రమే 'కామ సంకల్ప వర్జితాః' అని భగవ ద్గీత చెప్పునప్పు డుద్దేశింపఁబడినది సూక్ష్మ రూప మైన సంకల్పమే సంకల్ప మధిక మైనది. క్రియ యల్ప మైనది. కారణము-సంకల్పము కలిగిన క్షణము నందే జగచ్ఛక్తి యందు త దనుగుణ మైన చలనము గలుగుచున్నది జగ చ్ఛక్తియం దట్టి వికార రూప చలన మే మాత్రము గలుగుట కైనను, తాను హేతు భూతుఁడు కాకుండ నుండవలయును. అ ట్లుండుటయే సంపూర్ణ త కొక సోపానము అనియే కదా మనస్సు నరికట్టవలయును, నాశము చేయవలయు ననుటయం దుద్దేశింపఁబడిన యర్థము ! 'తమక్రతుం పశ్యతి వీత శోకో ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్' (ధాతు ప్రసా దము వలన వీత శోకుఁడై, యక్రతువు - మహిమాన్వితుఁడు నైన యీశ్వరుని గనుఁగొనుచున్నాఁడు) అను నుపనిష ద్వచనముచే నుద్దే శింపఁబడిన విషయము పైఁ జెప్పఁబడినదియే. తాను రచించిన పదము లను బట్టియే క్షేత్రయ్య శృంగార పురుషుఁ డన్నచో - శృంగార సంకీర్తనలను రచించిన తాళ్ళపాక అన్నమాచార్య, పెద తిరుమలా చార్యాదులు గూడ శృంగార పురుషు లనియే చెప్పవలసివచ్చును. శృంగార వర్ణనమునందు వారు క్షేత్రయ్య కే మాత్రమును తీసిపోవు వారు కారు. అయినచో నొక మాట మాత్రము సత్యము శృంగార

వర్ణనమునందు క్షేత్రయ్య కొన్నిచోటుల యందు — 'మామూలు' హద్దుల నతిక్రమించినాఁడు అది కాదనుట కెవరికిని వీలు లేదు. అంత మాత్రమున, అది అసభ్య శృంగార మనియే యేల చెప్పవలయును? పాత్రౌచిత్యమును గూడ విస్మరించి, అస్థాన పతిత మని భావింపక, వర్ణించిన దక్షిణాంధ్ర కవుల శృంగారము కంటెను తక్కువ యైనది కాదు — క్షేత్రయ్య వర్ణించిన శృంగారము ఆ దృష్టితోఁ జూచినచో — 'అసలు' శృంగారమే యసభ్య మైనది దాని యందు సభ్యత యను నది వేఱుగా నుండుట కవకాశ మెక్క డున్నది? స్నానము చేయుట, భోజనము చేయుట యెటువంటివో — ప్రాణు లన్నింటికిని శృంగారము కూడ నటువంటిదే అయినచో — మానవుని యున్నతికి శృంగారము ఆటంకము కాఁ గూడదు లౌకిక దృష్టితోఁ జూచినపుడు మానవుని పారమార్థికాభ్యున్నతికిని ఆటంకము గలిగించు స్వభావము శృంగారము నందు తప్పకుండ నున్నది ఓజస్సు విజృంభించుట యనివార్యము. యోగి — జాగరూకత వహించవలసినది యీ సమయమునందే. పాతాళమునఁ బడుటకును, పరమేశ్వరునితో నేకత్వమును బొందుట కును మార్గములు చీలునట్టి కూడలి చో టిదియే ఆ త్యున్నతికిని, అథః పతనమునకును మధ్యమమునఁ గల యవకాశము — గుఱితించు టకు వీలు కాని యంతటి సూక్ష్మ మైనది పరమ తపో నిష్ఠు లైన మహర్షులు గూడ, అప్సరల వెంట బడి రని చెప్పుటలో — ఉద్దేశింపఁ బడిన యర్థ మిదియే.

## వేంకట నృసింహ కవి రచనలు

నరహరి వేఁటకుఁ బోయి చెంచెతను వివాహ మాడిన కథను దీసికొని, నృసింహ విలాస మను పేర నొక ప్రబంధమును రచించి నాఁడు పైడిపాటి వేంకట నృసింహ కవి. మన్నారు కృష్ణ శతకము,

రామ చంద్ర శతకము ఇతని యితర కృతులు. 'వారితామిత కృష్ణ మన్నారు కృష్ణ !' అను నది మన్నారు కృష్ణ శతకము యొక్క మకుటము దాన సంగ దశకము, స్తుతి దశకము, పితృ మాతృ దశకము, బాల దశకము, చోర దశకము, జార దశకము, గోపాల దశకము, దుష్ట నిగ్రహ దశకము, శిష్ట ప్రతిపాలన దశకము, అవతార దశకము నని పది భాగములుగా విభజించి, కృష్ణుని బాల్యమును - తల్లి దండ్రులను - ఆతని జారత్వ దుష్ట శిక్షణ శిష్ట రక్షణాది లీలలను - అవతారములను - మాహాత్మ్యమును ప్రశంసించి, స్తుతించి, తన్ను గూర్చి విన్నవించు కొన్నాఁడీ వేంకట నృసింహ కవి తన మన్నారు శతకమునందు 'నన్ను గైకొను ముపేంద్రా ! రామ చంద్రా హరీ !' యను నది యాతని రామ చంద్ర శతకము యొక్క మకుటము. మన్నారు కృష్ణ శతకము నందు వలెనే రామచంద్ర శతకము నందును కవి - రామచంద్రుని మాహాత్మ్యమును, స్తుతి - వాక్యోన్నతి - దాన సంగతి - మనో వృత్తి - సంసార - అభేద - దీన త్రాణ - అవతార - నీతి దశక నామములచే నేర్పఱచి, స్తుతించి, తన్ను గైకొనవలసినదిగా శరణము వేడికొనినాఁడు. పయి రెండు శతకము లందును పైఁడిపాటి వేంకట నృసింహ కవి ప్రపన్నుఁ డనుట స్పష్టము.

## లక్ష్మణ కవి రచనలు

నరసింహస్వామి యొక్క మాహాత్మ్యమును స్తుతించుచు నరసింహ దండకమును, రామాయణ కథను దీసికొని రామ విలాసమును ఏనుఁగు లక్ష్మణ కవి రచించినాఁడు. ఈతని రామ విలాసమును కృతి నందిన వత్సవాయ గోపరాజు - 'పురవైరి ధరసీరి గిరి దారి హరి శౌరు చరణ నిర్ఝర వారి సురుచిఁ గేరి'నవాఁడు గోపరాజు యొక్క పూర్వులలో నొక డైన తిమ్మరాజు - 'నృహరి గేహ తటాక నిక్షేప

వనములు' పెద్దాపురమున నునిచినాఁడు. తిరుపతి వల్మీకి గిరి యందుఁ బూల పల్లెను, ఫల వృక్షములను జాల నిలిపినాఁడు. చిరు దాంక పురి యందుఁ బాల మున్నిటిని బోలు చెఱువును నిర్మించి నాఁడు. పైఁ జెప్పిన తిమ్మరాజు యొక్క కుమారుఁ డైన రాయప రాజు గూడ విష్ణు భక్తుఁడే. ఆయన, హరి భక్తి సుధోదయ మను మహా కృతి రత్నము నందుకున్నవాఁడు, కట్టమూరిలో శ్రీరామునకు గుళ్ళు, మంటపములు, గోపురము కట్టించినవాఁడు; వాల్మీకి పురి కాంధ్ర కోటయందు ఫల భూజ వాటికలు పదిలపఱచినవాఁడు.

## వ త్స వా య ర చ న లు

మన యేనుఁగు లక్ష్మణ కవి యొక్క తాత యైన యేనుఁగు లక్ష్మణ కవి వలన, వత్సవాయ జగ్గరాజు ధ్రువ చరిత్రమును కృతి నందినాఁడు. వత్సవాయ బలభద్రరాజు - భద్రాద్రి రాముని భక్తుఁడు. పదములు, కీర్తనలు, పద్య శతకములు, రాగ మాలికలు, దండకములు రచించి, భద్రాద్రి రామునకు కానుకగా నిచ్చినాఁడు వత్సవాయ జగపతిరాజు. వత్సవాయ వంశము నందలి విష్ణు భక్తులకు సంబం ధించిన పయి విషయ మంతయును - ఏనుఁగు లక్ష్మణ కవి యొక్క రామ విలాసము నందలి యవతారిక వలనఁ దెలియుచున్నది.

## శ హా జీ ర చ న లు

కృష్ణ లీలా విలాసము, జల క్రీడలు, రామ పట్టాభిషేకము, రుక్మిణీ సత్య భామా సంవాదము, విష్ణు పల్లకి సేవా ప్రబంధము, సీతా కల్యాణము మున్నగు గ్రంథములను శహాజీ మహారాజు రచించి నాఁడు. శ్రీ కృష్ణుని జననము, బాల్య క్రీడలు, సత్య భామను వివాహ మాడుట మున్నగు విషయములు గలిగిన కృష్ణ లీలా విలాసమును

శ్రీ కృష్ణునికే అంకితము చేసినాడు శహాజీ గోపికా వస్త్రాపహరణ విషయము గలిగిన జల క్రీడలు కృష్ణునికే అంకితము చేయఁబడినది. రాముని పట్టాభిషేక విషయముగాఁ గలిగిన రామ పట్టాభిషేకము శ్రీరాముని కంకితము చేయఁబడినది రుక్మిణి యొక్క, సత్యభామ యొక్క సంవాద విషయముగఁ గలిగిన రుక్మిణీ సత్యభామా సంవాదము శ్రీకృష్ణుని కంకితము చేయఁబడినది విష్ణువు యొక్క విరహమును సహింప లేని లక్ష్మీదేవి - విష్ణుని కడకు తన చెలికత్తెలను బంపుట, చెలికత్తెలు పల్లకిలో విష్ణువును లక్ష్మీదేవి యొద్దకుఁ దీసికొని వచ్చుట, అయ్యవారి యొక్క, అమ్మవారి యొక్క అరగింపు సేవ, పవళింపు సేవ మున్నగు విషయములు గలిగిన పల్లకి సేవా ప్రబంధము కృష్ణుని కంకితము చేయఁబడినది స్వామి యొక్క ఉత్సవ దినముల యందు ఊరేగింపు సమయమున నట్టువరాండ్రచే ఈ విషు పల్లకి సేవా ప్రబంధము ప్రదర్శింపఁబడెడి దఁట దక్షిణ దేశమున. సీత, రాముని వివాహ మాడుట విషయముగాఁ గల సీతా రామ కల్యాణము రాముని కంకితము చేయఁబడినది

## దేవకీ నందన శతకము

తన తండ్రి తాతలు శైవు లయినను, తాను మాత్రము కృష్ణభక్తుఁ డయి, కృష్ణునిపై, 'కృష్ణా ! దేవకీ నందనా !' యను మకుటముతో - నూఱు పద్యములు గల దేవకీ నందన శతకమును రచించినాఁడు వెన్నెలకంటి జన్నయ.

'పరమ హృద్యం బైన పద్య శతంబున
దేవకీ తనయు విధేయుఁ జేసె' నని వెన్నెలకంటి

జన్నయను, పేరమరాజు జక్కన తన విక్రమార్క చరిత్ర యందు

స్తుతించినాఁడు. పలు విధము లయిన కృష్ణుని రూపమును, ఆయన చేతలను మనసు దీర వర్ణించుచు, తన్ను కృతార్థుని జేయవలసిన దని, జన్నయ తన దేవకీ నందన శతకము నందు వేఁడికొనినాఁడు. ఉదాహరణమున కొక్క పద్యము -

"లలనా కుంచిత వేణియం దడవి మొల్లల్ జార, కస్తూరికా
తిలకంబున్ గరుగంగ, లేఁత నగవుల్ దీపింప నెమ్మోమునన్
దళుకుల్ జూపెడి చూపు లోరగిల నానా రీతులన్ వేణు ప
ష్కల నాదంబులఁ బెంపు జూపుదువు కృష్ణా ! దేవకీనందనా !"

ఈ దేవకీ నందన శతకమునందు కవి, కృష్ణుని ప్రధానముగా - రక్షకునిగను, స్వామిగను దర్శించినాఁడు

## దా శ ర థి శ త క ము

రామ దాసుగ కంచర్ల గోపన్న ప్రసిద్ధుఁడు భద్రాచల రాముని భక్తుఁడు. భద్రాచల ప్రాంతమునకు 'తహశీలుదారు'గ నున్న గోపన్న, తాను ప్రజల నుండి వసూలు చేసిన ధనము ఆఱు వేల రూపాయలు వెచ్చించి, భద్రాచల రామునికి ఆలయము, ప్రాకారము, గోపురము మున్నగు వానిని గట్టించి, రామునికి - సీతకు ఆభరణములు చేయించినాఁడు శిస్తు ధనమును అప్పటి గోలకొండ తానీషాకు గోపన్న చెల్లింపనే లేదు అందులకు తానీషా - గోపన్నను చెఱలో నుంచి, పెక్కు విధముల బాధించినాఁడు. తుదకు రామ లక్ష్మణులు వచ్చి, తానీషాకు ధనము చెల్లించి, గోపన్నను ఖైదు నుండి విడిపించి రని జన శ్రుతియం దున్న కథ. రాముని దాసుఁడైన గోపన్న - 'దాశరథీ! కరుణాపయోనిధీ!'యను మకుటముతో నొక శతకమును రచించినాఁడు. ఈ దాశరథి శతకము ప్రధానముగా - రామ భక్తితో నిండినది.

రాముఁడే గోపన్నకు పర దైవము. సర్వ బాంధవ్యములను రాముని యందే ఆరోపించి దర్శించిన శరణాగతుఁడు గోపన్న. రాముని మాహాత్మ్యము శతకమునం దంతను గనిపించును. శ్రీ రమ సీత గాగ, విరజానది గౌతమిగా - భద్రాచలమునే వైకుంఠముగా దర్శించినాఁడు గోపన్న. చక్కెర మాని, వేముఁ దినఁ జాలిన కైవడి, మానవాధములు పెక్కురు బక్క దైవములను వేమఱుఁ గొల్చెద రట్లు కాదయా, మ్రొక్కిన నీకు మ్రొక్క వలె, మోక్ష మొసంగిన నీవ యీ వలెం దక్కిన మాట లేమిటికి నని మొగమాటమి లేకుండ రామునితోఁ జెప్పి, ఆయన యొక్క సర్వోత్కృష్టతను స్థాపించినాఁడు రామ దాసైన గోపన్న. భండన భీముఁ డార్త జన బాంధవుఁ డుజ్జ్వల బాణ తూణ కోదండ కళా ప్రచండ భుజ తాండవ కీర్తికి రామ మూర్తికి రెండవ సాటి దైవ మిఁక లే దనుచు గడ గట్టి, భేరికా డాండ డడాండ డాండ నినదంబు లజాండము నిండ, మత్త వేదండము నెక్కి చాటినవాఁడు గోపన్న. రామ కథామృతమును, రాముని పద పంకజ తోయమును, రామ నామ సుధా రసమును జుఱ్ఱినవాఁడు గోపన్న. ఆయనకు రాముని కంటె మహాత్ముఁడు వేల్పుల యందు లేడు సలలిత రామ నామ జప సార మెఱింగినవాఁడు గోపన్న. ఆయనకు దైవము, తల్లి, తండ్రి, గురుఁడు, సఖుఁడు - భద్రాచల రాముఁడే. అన్య దైవములఁ జేరి భజించినవారి పొందు చేసితి ననియు,నా తప్పునకు చిక్కులు వెట్ట వల దనియు రాముని వేడికొన్నాఁడు రామ దాసు. విష్ణువు యొక్క దశావతారములను తన శతకము నందు స్తుతించినాఁ డాయన ఆయన జీవము రాముఁడే. భవము నొల్లనివాఁడు రామ దాసు.

## నరసింహ శతకము

శేషప్ప కవి రచించిన నరసింహ శతకమున కాంధ్ర దేశమున బహుళ ప్రచార మున్నది

"భూషణ వికాస ! శ్రీ ధర్మ పుర నివాస !
దుష్ట సంహార ! నర సింహ ! దురిత దూర ! "

అనునది – శేషప్ప కవి యొక్క నరసింహ శతకమునకు మకుటము. ధర్మ పుర నివాసుఁ డైన నరసింహస్వామి – శేషప్ప కవికి ఇష్ట దైవ మనుట స్పష్టము. నరసింహ శతకము నందు శేషప్ప కవి ప్రధానముగా ప్రపన్నుఁడు తా నతి నీచుఁడ ననియు, పరమ పాపిష్ఠుఁడ ననియు, తన పాపములకు లెక్కయే లే దనియు, తన దోషముల నెల్ల క్షమించి మోక్షము నీయవలసిన దనియు, తల్లి యైనను – మఱి యే మయినను – తనకు నరసింహ రూపుఁ డైన విష్ణువే యనియు దీనుఁడై, ఆయనతోనే మొఱ పెట్టుకొన్నాఁడు. సఖుఁడై విష్ణువు నాజ్ఞాపించినాఁడు విష్ణువుపై కోపించినాఁడు విష్ణువును మందలించినాఁడు. ప్రార్థించినాఁడు. ఎత్తి పొడిచినాఁడు. తనకు ప్రత్యక్షము కావలసినదిగా విలపించినాఁడు. నరసింహ శతకమునుఁ బట్టి శేషప్ప కవి – యాచనా వృత్తితో – అతి దుర్భర మైన జీవితము గడపిన ట్లూహింప వచ్చును.

"ధరణిలో నరు లెంత దండివా రైనను
నిన్నుఁ గానని వారి నే స్మరింప" నని గట్టిగఁ జెప్పివేసినాఁడు.

నరసింహస్వామితో శేషప్ప కవి. ఉత్తమ ధర్మములను కొన్నిటిని జెప్పుచు, చివరకు –

"జలజ దళనేత్ర ! నీ భక్త జనుల తోడ
జగడ మాడెడు పనికిఁ బోఁ జావు మేలు "

అని శేషప్ప కవి సిద్ధాంతము చేసినాఁడు. తనువులోఁ ప్రాణములు తరలి పోయెడు వేళ విష్ణు స్వరూపమును ధ్యానించు నతఁడు

నిమిష మాత్రములో విష్ణువును జేరును గాని, యముని చేతను జిక్కి శ్రమల బడఁ డని శేషప్ప కవి నమ్మకము విష్ణువును గొలుచుటే సర్వ భూషణ మనియు, విష్ణువు మీద భక్తి లేని మానవుఁడు — రెండు పాదాల మహిష మనియు శేషప్ప కవి యభిప్రాయము తిరు మణి శ్రీ చూర్ణ గురు రేఖ లిడినను, విష్ణు నెఱుంగ కున్నచో వైష్ణవుఁడు గాఁ డని ఆయన వక్కాణ.

విష్ణు భక్తులను కన్నుల నిండఁ జూచి జోహారు చేయువాఁడు, హరి కథలు వినెడివాఁడు, హరి దాసు లింటికి వచ్చి నపుడు పీటపైఁ గూర్చుండఁ బెట్టువాఁడు, హరి సేవకుల జాతి నీతు లెన్నక, వారికి దాసోఽహ మనువాఁడు — పరమ భక్తుఁ డనియు, పుణ్యుఁ డనియు, అట్టి వానిని గనుఁగొన్ననే పుణ్య మనియు స్పష్టముగాఁ జెప్పినాఁ డాయన

"గర్వమునఁ గష్టపడి నిన్నుఁ గానకున్న
మోక్ష సామ్రాజ్య మొందఁడు"
"నిన్ను నమ్మిన భక్తుండు నిశ్చయముగఁ
గోరి చిల్లర దైవములఁ గొలువఁబోడు."
"నిన్ను గొనియాడుమండెనా నిశ్చయముగ
వాఁడు మోక్షాధికారి యీ వసుధ లోన"

"తామరసగర్భ హర పురందరుల కైన
నిన్ను వర్ణింపఁ దరమౌనె?

అని, ప్రత్యక్షముగ విష్ణువుతోఁ జెప్పఁ గలిగినవాఁడు శేషప్ప కవి.

"ఎందుఁ బోవక నేను నీ మందిరమున
విలిచితిని."
"నన్నుఁ గాపాడినచో — నీకు కైంకర్యపరుఁడనై
సేవలు చేయ గలను"

అంతే యని, శేషప్ప కవి - తన నరసింహ శతకమునందు విష్ణువుతో చివరి మాటగఁ జెప్పినాఁడు. ఇతఁడు ధర్మపురి రామాయణమును గూడ రచించినాఁడు

## కలి వేల్పు శతకము - ఉపమాక వేంకటేశ్వర శతకము

వైజర్సు అప్పయ కవి - కలివేల్పు శతకమును, ఉపమాక వేంకటేశ్వర శతకమును రచించినాఁడు 'బళిర కలివేల్పు పసిఁడి దు వ్వలువ దాల్ప' అను నది కలివేల్పు శతకము యొక్క మకుటము. కలివేల్పు శతకము నందు రాధా కృష్ణుల శృంగారము వర్ణింపఁ బడినది ఉపమాక వేంకటేశ్వర వివాహము మున్నగు విషయములు వర్ణింపఁబడినవి. ప్రౌఢ యైన రాధ యొక్క శృంగారమును కలివేల్పు శతకమునందు పచ్చిగ వర్ణించుటచే, అప్పయ్య కవికి అంధత్వము కలిగిన దనియు, ఉపమాక వేంకటేశ్వర శతకము నందు అలమేలు మంగను ముగ్ధగఁ జెప్పి, శృంగారము యొక్క పాలు తగ్గించుటచే, అంధత్వము పోయిన దనియును ఒక వాడుక యున్నది. ఏ మయినను, ఆంధ్ర వాఙ్మయమున రాధా కృష్ణుల శృంగారము విషయముగాఁ గలిగిన మొట్ట మొదటి శతకము - కలివేల్పు శతక మనియే చెప్పవలసి యున్నది

## సింహాద్రి నారసింహ శతకము

ఆంధ్ర వాఙ్మయమునందు ప్రసిద్ధ మైన శతకములలో - సింహాద్రి నారసింహ శతక మొకటి. 'వైరి హర రంహ సింహాద్రి నారసింహ !' అను నది యీ శతకము యొక్క మకుటము. ఈ శతకము గోఁగులపాటి కూర్మనాథుఁడు రచించినాఁడు. ఇతఁడు రామ

తీర్థము, పద్మనాభము, సింహాచలము మున్నగు దేవస్థానముల మీఁద అధికారిగ నుండినవాఁడు పదునెనిమిదియవ శతాబ్ది యుత్తరార్థమున మరాటీలు, పిండారీలు మున్నగు మ్లేచ్ఛులు హైందవ దేవాలయములను బెక్కింటిని కొల్లగొట్టి, వానిని సర్వ నాశము చేసిరి. తురకలు వచ్చి, సింహాచల నరసింహస్వామి దేవాలయమును ముట్టడించి, అచ్చటి దేవతా విగ్రహములను బగులఁ గొట్టుచు, దేవాలయమునందే గో హింస చేయుచు, హైందవ స్త్రీలను జెరఁ బట్టుచు, పెక్కు దుండగములను గావించినారు ఆ దుర్నయమును జూచి సహింప లేని కూర్మనాథుఁడు - విషయము నంతను నరసింహ స్వామితో మొఱ పెట్టుకొని, తురుష్కుల బారి నుండి రక్షింప వలసిన దని పెక్కు విధముల ఆయనను బ్రార్థించినాఁడు. నరసింహ స్వామిపై ఆయన కోపించినాఁడు నిందించినాఁడు బెదరించినాఁడు బతిమాలుకొనినాఁడు. లాలించినాఁడ ఏ మయినను, కొంత కాల మగు సరికి, తుమ్మెదల - లెనె టీఁగల దం డొకటి లేచి, రక్తము కాఱ, కండలు బయటికి వచ్చునట్లుగ తురుష్కుల బాధించినది తురుష్కులు సింహాచలము విడిచి వెళ్ళిపోయినారు ఆనందమున నుప్పొంగి పోయిన కూర్మనాథుఁడు నరసింహ స్వామిని, ఆయన మాహాత్మ్యమునకు పెక్కు విధములఁ బ్రశంసించినాఁడు. స్తుతించినాఁడు. సింహాద్రి నారసింహ శతకము నందలి విషయ మిదియే

గోగులపాటి కూర్మనాథుఁడు సింహాద్రి నారసింహ శతకము నందు, భగవానుని ప్రధానముగా- రక్షకునిగను, స్వామిగను దర్శించి నట్లు కనిపించును చోర సంవాద మను నామాంతము గల లక్ష్మీ నారాయణ సంవాద మను గేయ సంకలిత గ్రంథమును, విజయ రామ శతకమును గూడ రచించినాఁడు కూర్మనాథుఁడు. నేఁటికిని కొన్ని విష్ణ్వాలయము లందు - 'దోపుడు' ఉత్సవము యొక్క సందర్భమున అర్చకులు లక్ష్మీ నారాయణ సంవాదమును జదువుదు రఁట.

## పశ్చిమ రంగ శతకము - రంగ ధామ శతకము

శత్రువులను సంహరింపు మనుచు, సింహాద్రి నారసింహ శతకము యొక్క ధోరణిలోఁ జెప్పఁబడినదే శత్రు సంహారక శతక మని ప్రసిద్ధ మైన వేంకటాచల రమణ శతకము. 'శత్రు సంహార! వేంకటాచల విహార!' యను నది శత్రు సంహార శతకము యొక్క మకుటము. ఔరంగజేబు కాలము నందు తురకలు - చిత్తూరు, నెల్లూరు ప్రాంతముల యందు దోపిడి జరిపినప్పు డీ శత్రు సంహారక శతకము పుట్టి యుండు నని విమర్శకుల యభిప్రాయము.

శత్రు సంహారము చేయు మనియు, శత్రు సంహారమునకు ప్రయత్నించు దేవరాయ ధరాశరునకుఁ దోడ్పడు మనియుఁ జెప్పిన పశ్చిమ రంగ శతకము - పయి శతకముల కోవలోనిదే 'పశ్చిమ రంగ!' యనునది యీ శతకము యొక్క మకుటము

'రాక్షస విరామ కస్తూరి రంగ ధామ!' అను మకుటముతోఁ జెప్పఁబడిన రంగ ధామ శతకమును - 'రాత్రి చర వైరి కస్తూరి రంగ శౌరి!' యను మకుటముతోఁ జెప్పఁబడిన రంగ శౌరి శతకమును పయి సింహాద్రి నారసింహ శతకము యొక్క పద్ధతి లోనివే.

## పంచాయుధ కస్తై - లక్ష్మీ విలాసము

పంచాయుధ కస్తైను, లక్ష్మీ విలాసమును రచించినాఁడు కంఠీరవ రాజు విష్ణు దేవుని పంచాయుధములను కంఠీరవ రాజును రక్షించవలసినదిగాఁ జెప్పఁబడినది పంచాయుధ కస్తై. కంఠీరవ రాజును లక్ష్మి దేవి యాశీర్వదించుట విషయముగాఁ గలిగినది లక్ష్మీ విలాసము. కంఠీరవ రాజు కొన్ని పదములను గూడ రచించినట్లు తెలియుచున్నది

## పానకాలరాయని రచనలు

హరి భక్తి సుమహితుఁడు - వేణు గోపాల భక్తుఁడు నైన తాడేపల్లి పానకాల రాయఁడు - మానస బోధ శతకమును, చిత్త బోధ శతకమును, పార్థ సారధి శతకమును, లక్ష్మీ దేవి శతకమును, మంగళగిరి లక్ష్మీనృసింహ శతకమును, రుక్మిణీ పతి శతకమును రచించి నాఁడు 'మనసా! శ్రీహరి పాదము లాశ్రయింపుమా!' యనునది మానస బోధ శతకము యొక్క మకుటము. 'శ్రీ హరి పద్మములు కోరి భజింపుము చిత్తమా! యనునది పార్థసారథి శతకము యొక్క మకుటము 'శ్రీ మంగళ శైల నారసింహుని రాణీ'! యనునది రుక్మిణీ పతి శతకము యొక్క మకుటము.

పానకాల రాయని మానస బోధ శతకమునకు ఆంధ్ర దేశమున బహుళ ప్రచార మున్నది. మానస బోధ శతకమునందు పానకాల రాయఁడు - 'శంఖ చక్ర జల జాభయ హస్తము లొప్పువాఁడు,ఉరు రత్న సువర్ణ కిరీట శిరంబువాఁడు, కోమల తులసీ విభాసుర రమా యుత వక్షమువాఁడు' నైన విష్ణువును గొలిచినాఁడు. 'హరి సరి యైన దైవత మజాండమున న్నహి' యని స్పష్టముగాఁ జెప్పినాఁ డాతఁడు. మనస్సు హరి పాదముల నాశ్రయించుట - 'యుత్తమ సాధ్వి వల్లభుం గూడఁగ నేఁగుట' వంటిదే.

ప్రాణులలో మానవులు - వారిలో ద్విజులు - వారిలో నిగమార్థ విదులు ఎక్కువ యని చెప్పుచు, వారి కంటెను - 'జల రుహ నాభ పాద జలజార్చకు లుత్తము లంద్రు' అని నొక్కి వక్కాణించినాఁడు పానకాల రాయఁడు హరిని వదలి, యన్యులనుఁ గొలుచుట - కామిని తన పతిని వదలి, జారులను గలియుట యంటిది యఁట అంబుజాక్షుని కంటెను అన్యు లైన వా రందఱును ఆయన ప్రకారము కొలు

మాలినవారే మొత్తము మీద, పితా రక్షకాది నవ విధ సంబంధముల తోను విష్ణువును పానకాల రాయఁడు తన శతకముల యందు సందర్శించినాఁ డని చెప్పవచ్చును.

"కూరిమితోడ నైనఁ, దగు కోరిక నైనను, ప్రాణ భీతిచే
దూఱుచు నైన, వైరమునఁ దూఁగుచు నైనను, భక్తి నైన వే
మాఱు హరిం దలంప ననమాన సుఖంబు ఘటిల్లు."

ఇదియే పానకాల రాయని పరమాశయము.

## పా ప రా జు ర చ న లు

శ్రీ మదన గోపాల కృపా కలిత కటాక్ష వీక్షా సమాసాదిత చతుర్విధానవద్య కవిత్వ విద్య కలవాఁ డైన కంకంటి పాప రాజు - ఉత్తర రామాయణమును, విష్ణు మాయా విలాస మను యక్ష గానమును రచించినాఁడు. రాఘవేశ్వరు చారిత్రము నెందఱెన్ని గతుల న్వర్ణించి'నను గ్రాలు ననియు, కర్మ భూమి పయి మానుష దేహముతో నుండి జానకీ జాని కథలు రచింపక, అన త్కథ లెన్ని రచించినను - అట్టి వాని వివేక మేటికి ? వాని కవిత్వ మేటికి ? అనుచున్నాఁడు పాప రాజు - తన ఉత్తర రామాయ ణారంభమునందు. కాంచన గర్భ శంకర ముఖ త్రిదశేంద్రులు ప్రౌఢ రీతిఁ గీర్తించినను, మెప్పుతో వినని కృష్ణుఁడు తనకు కలలోఁ గనిపించి, ఉత్తర రామాయణమును అంకిత మీయవలసిన దని చెప్పగా, ఆయనకే అంకితము చేసితి నన్నాఁడు పాప రాజు. ఉత్తర రామాయణమును అంకిత మొనర్చుటకు ముందే, తన విష్ణు మాయా విలాసమును కృష్ణునికే అంకితము చేసి యున్నాఁడు పాప రాజు. విష్ణువు తన కృష్ణావతారములోఁ జేసిన మాయలు - విష్ణు మాయా విలాసము నందలి

విషయము. విష్ణు మాయా విలాసమును ద్విపదగ రచించినాఁడు పాప రాజు తమ్ముఁ డైన కంకంటి నరసింహ కవి.

## దశావతార చరిత్ర

శ్రీరామ కరుణా రసారూఢుఁ డయిన ధరణి దేవుల రామ మంత్రి – విష్ణుని దశావతారముల యందలి విషయములను దశావ తార చరిత్ర మను పేర రచించినాఁడు. కృష్ణునిపై రామ మంత్రికిఁ గల ప్రత్యేక దృష్టి వలననే రాధా కృష్ణుల వృత్తాంతమును గూడ దశావతారములతోపాటు వర్ణించినాఁ డాతఁడు. రామ మంత్రి యొక్క దశావతార చరిత్ర కృతి పతికి తండ్రి యైన పద్మనాభ మంత్రి – 'రామ కథలను, బాయని విభాగంబులను, నేక రీతిగ నిర్వహించు పటిమయు, నపరిహార్యంబుగా నన్య మతంబుల యందు శంక ఘటించు నౌఘళంబు'ను గలవాఁడు.

## తేర పావన శతకము

తన్ను రక్షింప విలసినదిగ శ్రీరాముని ప్రార్థించుచు, ఆయన గుణ మాహాత్మ్యముల వర్ణించుచు, ఆయనకే యంకితముగ –

> "అనఘ ! కర్ణాట తేర పావన నరేంద్ర !
> రమ్య గుణ సాంద్ర ! దశరథ రామ చంద్ర !"

అను మకుటముతో నొక శతకమును జెప్పినాఁడు కర్ణాట తేరప కవి అదియే తేర పావన శతకము తేరప కవి – శ్రీ రామ పద పద్మ సార సంగ్రహ మత్త మధుపాయమాన మానసుఁడు, శ్రీ రామ నామ విశేష లేఖన నర్తకాయమాన కరాంగుళాంచితుఁడు, చిర విప్ర

పాద సంసేవనాపయాత కల్మషుఁడు. విష్ణువును ప్రధానముగ స్వామి గను, క్వాచిత్కముగ సఖునిగను తేర పావన శతకము నందు దర్శించి నాఁడు తేరప కవి. పట్టాభి రాముఁడే ఆతని కిష్ట దైవము గూడ. పాపములను బాపి, భయము లుడుపువారు రాముని కంటెను అన్యు లి లోకమున లే రని తేరప కవి నొక్కి చెప్పినాఁడు తన శతకమునందు. రాముఁ డతనికి నవ రస మూర్తి. దశావతారములలో - రాముని స్తుతించిననేకాని తృప్తి కలుగ దాతనికి.

**"నీవు తప్పిన నా కెవ్వ రింక దిక్కు "**

**"ముందు చేసిన పాప మొందకుండ**

**నన్నుఁ గాపాడి రక్షించు"** మనియే పట్టాభి రాముని

గూర్చి తేరప కవి వేడికోలు.

## భ ద్రా ద్రి రా మ శ త క ము

'శ్రీమ ద్భద్రాద్రి ధామ శ్రీ రఘు రామా !' అను మకుటముతో - పావులూరి యందలి శ్రీరాముని గుణ మాహాత్మ్యములను స్తుతించుచు, భద్రాద్రి రామ శతకమును రచించినాఁడు పావులూరి మల్లన 'రాముని కన్నను రెండవ సామియు లేఁ డనుచు' - నాతఁడె 'సర్వం బనుచున్ వే మాఱు విన్నవించి'నాఁడు మల్లన తన భద్రాద్రి రామ శతకము నందు. రాముఁ డాతనికి రాజాధి రాజు రాముఁడే యాతని కిలవేలుపు. చామంతులతో - చంపకములతో రాముని పూజించినాఁడు మల్లన. రాము నాశ్రయించి, ఆయన నామమునే 'యుచ్చారణఁ జేసి' నాఁడు మల్లన.

మల్లనకు శ్రీరాముఁడు ప్రధానముగా స్వామి, పిత వంటి వాఁడు, రక్షకుఁడు, శేషి. రామ బ్రహ్మము యొక్క మహిమోక్తుల

నెన్నుటు యీశ్వరుని తరము గూడ గా దనియు, శివుని పత్ని గూడ రామ నామమునే కామిత మతిని జపము చేసిన దని స్పష్టముగాఁ జెప్పి నాఁడు మల్లన. రాముని కన్న, తన్నుఁ బ్రోచు రా జీఁక లేఁడు మల్లనకు.

## రా జ గో పా ల శ త క ము

"సురుచిరాకార ! ఉన్నవ పుర విహార !
రాజ గోపాల ! రాధా మనోజ ఖేల !"

అను మకుటముతో – ఉన్నవ పురము నందలి రాజ గోపాల స్వామిపై నొక శతకమును రచించినాఁడు – ఉన్నవ యోగానందుఁడు. ఇదియే రాజ గోపాల శతక మని చెప్పఁబడుచున్నది. 'రాధా మనోజ ఖేల !' యను శ్రీకృష్ణ సంబోధనమును కవి తన శతకము యొక్క మకుటముతోఁ జేర్చుట గమనింపఁదగినది. యోగానందుఁడు ప్రధాన ముగా శాంత భక్తుఁడు దాస్య సఖ్యా ద్యవస్థలును ఈతని శతకమం దఁట నఁట గనిపించును

"ధరలోన నే జాతి నరుఁ డైన శంఖ చ
క్రాంకితుఁడై భ క్తి నలరె నేని
చి ద్రోర్ధ్వ పుండ్రంబుఁ జెన్ను మీఱ ధరించి
దాస నామంబున దవరె నేని "

అతని కలుషము లన్నియు హతము చేసి, పరమ పదమును విష్ణు విచ్చు వనుచున్నాఁడు యోగానందుఁడు.

"పరగ శ్రీ వైష్ణవార్పణము సేయని కల్మి
కల్మి కా దది పెద్ద కొల్మి గాని
పరమ భాగవత సంస్పర్శఁ జెందని నోము
నోము గా దది పెను గాము గాని"

అని యోగానందుని వక్కాణ.

"నాలుకా ! కేశవ నామమ్ము నుడువుము
చిత్తమా ! హరి మీఁదఁ జింత నిలుపు
పాణి యుగంబ ! శ్రీ పతి పూజ సేయుము
కర్ణ ద్వయమ ! విష్ణు కథలు వినుము"

అని తన సర్వస్వమును విష్ణు సేవ సేయవలసినదిగా ఆజ్ఞాపించి నాఁడు. మనసులోని మాటను ఈ క్రింది విధముగా విష్ణువుతో విప్పి చెప్పుచున్నాఁడు యోగానందుఁడు .-

' భవదీయ దివ్య నామామృతంబు
గ్రోలు నరుఁ డేల యితరంబు గ్రోల నేర్చు"
"సంతతము నీ ప్రదక్షిణము సేయని కాళ్ళు
కాళ్ళు గా వవి మర గాళ్ళు గాని
అనయము నీ పదార్చన సేయని కరము
కరము గా దది దర్వి కరము గాని '

యని, అయన ప్రకారము కమలాక్ష భక్త సంగతిఁ గోరని త్రిదండి - దండి గాఁడు హరి నామ జపావశ్యకతను బహుధా నొక్కి చెప్పి నాఁడు. అయన యొక్క దశావతార స్తుతులను స్తుతించిననే కాని తృప్తి లేదు యోగానందునికి 'సకల యోనుల యందు జన్మించి జన్మించి, చచ్చి, చచ్చి, మరలఁ బుట్టు లేక', హరి చరణ యుగళ సేవను గోరిన వాఁడు - ఉన్నవ యోగానందుఁడు.

## కృష్ణ శతకము

తన తల్లియు - తండ్రియు తోడు నీడ - సఖుడు - గురుడు - దైవము - పతియు - గతియు - ప్రాపును - దాపును - సర్వమును కృష్ణుడే యని చెప్పినాడు 'కృష్ణా !' యను మకుటములో తాను రచించిన కృష్ణ శతకమునందు నృసింహ కవి. ఈ కృష్ణ శతకము ఆంధ్ర దేశమున ఆబాల గోపాలమునకు కంఠస్థ మని చెప్పవచ్చును నృసింహ కవి కాధారము కృష్ణుడు ఆ కృష్ణు డాతనికి వేదంబులు గన నేరని యాది పర బ్రహ్మ మూర్తి కృష్ణుని యందే బ్రహ్మ యున్నాడు, విష్ణు వున్నాడు, శివు డున్నాడు నృసింహ కవికి

తిరుమణి పెట్టిన మనుజుడు పరమ పవిత్రుడనియు, భాగ్య వంతు డనియు, హరి యను రెం డక్షరములు పాతకముల నన్నిటిని హరించు ననియు, హరి నామ మహత్త్వము పొగడుటకు వశము కాని దనియు చెప్పినాడు నృసింహ కవి తన కృష్ణ శతకము నందు. హరిని దలచిన వారికి కైవల్య పదవి లభించు నని ఆయన మతము.

"కంటికి రెప్ప విధంబున"
ఏలుము నను నీ బంటుగ
జాలా నిను నమ్మినాను" అనియె నృసింహ కవి

కృష్ణుని ప్రార్థించునది కృష్ణ శతకము నందు.

## పురుషోత్తమ కవి రచనలు

అద్దంకి తిరుమలాచార్య శ్రీ చరణ పద్మ భవ్య తీర్థ మరంద పాన ద్విరేఫాయమాన మానసు డయిన కానుల పురుషోత్తమ కవి - భక్త కల్ప ద్రుమ శతకము, మానస బోధ శతకము, హంసల దీవి గోపా

శతకము, ఆంధ్ర నాయక శతకము రచించినాఁడు. మానస బోధ శతక మింత వఱకు లభింప లేదు భక్త కల్ప ద్రుమ శతకము నందలి కొన్ని పద్యములు మాత్ర మిపుడు లభించు చున్నవి మిగత రెండు శతకములును సంపూర్ణముగా లభించినవి.

'పరాకు భద్ర శైల రామ భక్త ద్రుమా !' యను నది భక్త కల్ప ద్రుమ శతక మకుటము 'భావజ విలాస ! హంసల దీవి వాస ! లలిత కృష్ణాబ్ధి సంగమ స్థల విహార ! పరమ కరుణా స్వభావ గోపాల దేవ !' యను నది హంసల దీవి శతకము యొక్క మకుటము. 'చిత్ర చిత్ర ప్రభావ దాక్షిణ్య భావ ! హత విమత జీవ శ్రీ కాకుళాంధ్ర దేవ'! యనునది ఆంధ్ర నాయక శతకము యొక్క మకుటము. మానస బోధ శతకము పురుషోత్తమ కవి రచన యగునా కాదా యను విషయమున పండిత విమర్శకులలో మత భేదము లున్నవి భద్రాద్రి రాముని గూర్చి చెప్పినది భక్త కల్ప ద్రుమ శతకము కృష్ణా జిల్లా యందలి హంసల దీవి గ్రామము లోని గోపాల స్వామిని గూర్చి చెప్పినది హంసల దీవి గోపాల శతకము కృష్ణా జిల్లా విజయవాడకు సమీపమున నున్న శ్రీకాకుళము నందలి ఆంధ్ర విష్ణువును గురించి చెప్పినది ఆంధ్ర నాయక శతకము లభించిన పద్యములను బట్టి, భద్రాద్రి రాముని గుణ మాహాత్మ్యములను స్తుతించుచుఁ జెప్పఁబడినది భక్త కల్ప ద్రుమ శతక మని చెప్ప వచ్చును భద్రాద్రి రాముఁ డీ శతకము నందు పురుషోత్తమ కవికి ప్రధానముగా స్వామి హంసల దీవి గోపాల స్వామి యొక్క మహత్త్వమును, చేతలను బహు విధముల ప్రశంసించినాఁడు పురుషోత్తమ కవి తన హంసల దీవి శతకము నందు ఈ శతకము నందు గోపాలుఁడు పురుషోత్తమ కవికి ప్రధానముగా స్వామి, రక్షకుఁడు, శేషి, జ్ఞేయుఁడు

విష్ణువు యొక్క మహాత్త్వమును జాటి చెప్పు చేతలను పెక్కింటిని పలు విధముల నిందా స్తుతులతోఁ జెప్పినాఁడు పురుషోత్తమ కవి తన ఆంధ్ర నాయక శతకము నందు. పురుషోత్తమ కవి ఈ శతకము నందు ప్రధానముగా విష్ణునికి సఖుఁడు. రాముని యెడ, కృష్ణుని యెడ ప్రత్యేక మైన దృష్టి యున్నను - విష్ణువు యొక్క దశావతారములును భజనీయములే పురుషోత్తమ కవికి ఒక్క మాటలోఁ జెప్ప వలెనన్న, విష్ణువు యొక్క పాద దాసుఁడు, సఖుఁడు కాసుల పురుషోత్తమ కవి.

## సంజీవ కవి రచనలు

శ్రీ కృష్ణ పద యుగార్చితుఁ డైన రావూరి సంజీవ కవి రుక్మిణీ పరిణయమును, వీర నారాయణ శతకమును, వసుదేవ నందన శతకమును, త్రిస్త్రిమ విలాసమును, భాగవతము నందలి యేకాదశ ద్వాదశ స్కంధములను రచించినాఁడు. రుక్మిణీ పరిణయము సంజీవ కవి రచన యగునా కాదా యను విషయమున పండిత విమర్శకు లింకను ఏకాభిప్రాయమునకు రాలేదు. ' .. . కొలనుపాక వీర నారాయణ ముకుంద ! విశ్వతుంద !' యనునది వీరనారాయణ శతకము యొక్క మకుటము. విష్ణువే, కృష్ణుఁడే సకలాత్ముఁ డనియు, తా నాతని దాసుఁడ ననియు సంజీవ కవి యభిప్రాయ మైనట్లు పై రెండు శతకములను బట్టి స్పష్టముగఁ జెప్ప వచ్చును. విష్ణు మాహాత్మ్య ప్రధానము లైనవే రావూరి సంజీవ కవియొక్క పై రెండు శతకములు గూడ

## కృష్ణ దాసు రచనలు

అంతా రామ మయముగ - జగ మంతా రామ మయముగ దర్శించి రామ దాసుఁ డయిన కంచర్ల గోపన్న యొక్క చరిత్రను

'రామ దాసు చరిత్ర'మను పేర హరి కథగను, 'కృష్ణా!' యను మకుటముతో నొక కృష్ణ శతకమును రచించినాఁడు – తిరుక్కడయూరి కృష్ణ దాసు భగవ న్మాహాత్మ్యమును ప్రధానముగా నుల్లేఖించునది కృష్ణదాసు యొక్క కృష్ణ శతకము భగవ న్నామ మాహాత్మ్య మిందు బహు విధముల శ్లాఘింపఁబడినది 'విశ్వమున బాధ లొందక కనిపెట్టి కావ వలసిన'దనియే కృష్ణ శతకము నందు తిరుక్కడయూరి కృష్ణ దాసు యొక్క ప్రార్థన.

## జా న కీ ప తి శ త క ము

'జానకి పతీ!' యను మకుటముతో – జానకీ పతి శతకము న్రచించినాఁడు రామ భక్తుఁడైన రామ భద్ర కవి ఈ శతకము నకు కర్త – రామ భద్ర కవి యగునా కాదా యను విషయమున పండిత విమర్శకుల యందు మత భేదము లున్నవి. వైష్ణవ భక్తి భావనా పంచకము నందలి దాస్య సఖ్య వాత్సల్యా ద్యవస్థలు ప్రధానము గా ఈ శతకము నందుఁ గనిపించు నని చెప్పవచ్చును రామ భద్ర కవికి తల్లియు, తండ్రియు, శాశ్వత బంధుఁడును, దిక్కును చెలికాఁడును రాముఁడే.

"రాముఁడు రక్షకుండు, రఘు రాముని నమ్మిన బంటు నేను, నా
కేమి భయంబు? చింత లిఁక నేమిటి కేమి ఘటించినన్
స్వామిది కీర్తి సత్య మిది సత్యము, నాకుఁ బ నేమి? —"అని, తన సర్వ భారమును ఆర్తుఁడై, భగవానునిపైఁ బెట్టి, ఆయననే శరణము వేడినాఁడు రామ భద్ర కవి జానకి పతి శతకము నందు. ఆయనకు రాముఁడే పితయు, రక్షకుఁడు, స్వామియు, ఆధారము గూడ.

## కస్తూరి రంగ శతకము

కృష్ణుఁడు తన ప్రియురాండ్రతో నాడిన జల క్రీడలను విషయముగఁ దీసికొని, జల క్రీడా నాటకమును, కృష్ణ లీలలను విషయముగఁ దీసికొని కృష్ణ లీలలను, 'శత్రు మద భంగ! నవ ఘన శ్యామలాంగ! సూరి చిత్తాబ్జ భృంగ! కస్తూరి రంగ!' యను మకుటముతో కస్తూరి రంగ శతకమును రచించినాఁడు - రామభట్టు వీర రాఘవ కవి ఈ కస్తూరి రంగ శతకము నందలి పద్యములను కొన్నింటిని ఎందువలననో - వాడ్రేవు కామరాజు పూరింప వలసి వచ్చినది భగవంతుని స్తుతించుటయే కస్తూరి రంగ శతకము యొక్క ప్రధానోద్దేశము. కస్తూరి రంగఁడు స్వామి, రాయ భట్టు వీర రాఘవ కవి దాసుఁడు ప్రధానముగా - 'అధిక సిరు లియకున్న నిన్నిపుడె తిట్ట' అని బెదరింపఁ గలిగినంత చనువు - కస్తూరి రంగని యొద్ద వీర రాఘవ కవికి నున్నది శత్రు మద భంగము చేయువాఁడు గదా కస్తూరి రంగఁడు మొట్ట మొదటగా వీర రాఘవ కవికి!

## కోన రాట్కవి రచనలు

పద్మ పురాణమునందలి శ్రీ లక్ష్మీ నారాయణుల వివాహ విషయమును దీసికొని, సింహాచల నరసింహ స్వామికి అంకితముగ మహా లక్ష్మీ పరిణయమును, వేంకటేశ్వరోపాఖ్యానమును, 'జానకీ రామ! రవికుల సార్వ భౌమ!' యను మకుటముతో జానకీ రామ శతకమును రచించినాఁడు - వద్దిపర్తి కోన రాట్కవి. ఈ శతకమున నితఁడు తన విషయము నంతను జానకీ రామునితో విప్పి చెప్పికొన్నాఁడు.

## నరసింహ శతకము

'హరి! అల్లూరి పురీ విహార నరసింహా! భక్త సంరక్షకా!' అను మకుటములో నరసింహ శతకమును రచించినాఁడు కర్లపాలెము సింగన. ఇతఁడు నరసింహ మంత్రోపాసకుఁడు. గుంటూరు జిల్లా లోని రేపల్లె తాలూకాలో నున్న నిజాము పట్టణమునకు సమీపమున గల అల్లూరి గ్రామము నందలి లక్ష్మీ నరసింహ స్వామి - యిష్ట దైవ మీ కవికి ఇతఁడు సత్య వాక్య పరిపాలకుఁ డని తెలియుచున్నది సింగన యొక్క తాత - అవధూతయై, సిద్ధిని బొందినవాఁడు నరసింహ స్వామికి దాసుఁ డనియు, ఆయన పాద పంక రుహ ద్వంద్వము నెమ్మది నిలిపి, 'ఓ కంజాక్ష! రక్షింపవే శరణం' ఒ ... ...ంచినాఁడు సింగన్న తన శతకమునందు. మానవుఁడు -

" కేశవ నామ సంస్మరణచే దారిద్ర్యముల్ వాసి,
సుస్థిర లక్ష్మీ విభవాఢ్యుఁడై, జనులలో శ్రేష్ఠుండునై
తత్త్వ మార్గ రహస్యంబు లశేషముల్" తెలిసికొన గలఁ డని చెప్పినాఁడు సింగన్న తన శతకము నందు. అందువలననే, విష్ణువు యొక్క ఒక్కొక్క నామమున కొక్కొక్క పద్యము చెప్పినాఁడు కర్లపాలెము సింగన్న తన నరసింహ శతకము నందు.

## కృష్ణ కవి రచనలు

పూరుష ముఖ్య, రంగ, రఘు పుంగవ, వేంకట నాథ, కృష్ణ శతకములను రచించినాఁడు మంచెళ్ళ కృష్ణ కవి వీనిలో - రఘు పుంగవ శతక మింత వఱకును లభింపలేదు. ఈ కవి యొక్క కృష్ణ శతక మిద మిథ్థముగా నిదియే యని చెప్పు విషయమున విమర్శకుల

యందు భేదాభిప్రాయము లున్నవి. కృష్ణ కర్తృత్వము క్రింద ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారిచే ప్రకటింపఁబడిన వరద రాజ శతకమే మంచెళ్ళ కృష్ణ కవి యొక్క శతక మని యొక యభిప్రాయము. మంచెళ్ళ కృష్ణ కవి యొక్క కృష్ణ శతకము 'అసలు' ఇంత వఱకు లంభింపలే దని వేఱొక యభిప్రాయము 'పూరుష ముఖ్యుఁడా భువన పూజ్యుఁడు నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్' అను నది పూరుష ముఖ్య శతకము యొక్క మకుటము. 'రంగశాయి మనపాల గలండు ...చాం మేటికిన్' అను నది రంగ శతకము యొక్క మకుటము. 'వేంకట నగాధిపతీ! విలస త్కృపాపతీ!' యనునది రంగ శతకము యొక్క మకుటము వేంకట నాథ శతకము యొక్క మకుటము వేంకట నగాధిపతి శతక మనియు, వేంకట నగాధిప శతక మనియు వ్యవహారములో వాడుట యున్నద కృష్ణ శతక మని చెప్పఁబడ్డెడు వరద రాజ శతకము యొక్క మకుటము – '.. మందర ధర! సుందర రదా! ముర దానవాంతకా!' యనునది.

పై శతకము లన్నింటిని బట్టి, మంచెళ్ళ కృష్ణ కవి యొక్క స్వరూపము నొక్క మాటలోఁ జెప్ప వలె నన్నచో – అతఁడు ప్రపన్నుఁడు విష్ణువే, కృష్ణుఁడే, రాముఁడే యాతని సర్వస్వము. ప్రధానముగా శ్రీ కృష్ణ లీలలను వర్ణించినాఁడు. పూరుష ముఖ్య శతకమునందు మంచెళ్ళ కృష్ణ కవి అష్ట మహిషులను కృష్ణుఁడు వివాహాము చేసికొను విషయములను ప్రత్యేకముగా నెనిమిది పద్యములలోఁ జెప్పినాఁడు రాధా రమణీ ఘనాధర సుధా రసమాని చెలంగు నట్టియు, ఓర మొగంబుతో సిగ మయూర కలాపము జేర్చి పాదముల్ పూరిత వంశ నాదమున భూత గణంబులఁ జొక్కఁ జేయు కృష్ణుని దలచికొనినంతనే మై మఱచువాఁడు – మంచెళ్ళ కృష్ణ కవి.

సింగపు మోమువాఁడు,తులసీ దళ దామమువాఁడు, కామినీ రంగ ధురంబువాఁడు, వలరాయనిఁ గాచిన వాఁడు, భక్తి కుప్పొంగెడువాఁడు, దానవుల పొంక మడంచెడువాఁడు, నేఁడు మా బంగరు రంగ శాయి మన పాల గలండు విచార మేటికి నని అతి లోక మైన మన శ్శాంతి ననుభవించినవాఁడు మంచెళ్ళ కృష్ణ కవి

న న్గరుణార్ద్ర దృష్టి ర
క్షించక నీ వనాదరణ చేసిన నెవ్వరు నన్ను నింక ర
క్షించెడు వారు ? కాన - నిరసింపక నా పయి నుంచు నీ కటా
క్షాంచల లీల —'యని అతి దీనుఁడై, వేంకట నగాధి పతిని వేఁడికొన్న వాఁడు మంచెళ్ళ కృష్ణ కవి 'ఇఁక నన్యులఁ దలఁపఁబోను - నీ మహిమ ధాతకు శక్యమె యెన్న - ననుఁ బాద దాసకునిగా దయ నేలి, మనో వికార దు ర్వ్యసనము మాన్పు' మని యాత్మ నిగ్రహ వచః ప్రకృతితీంద్రియ హస్త పాద హృ న్మతి కృత మెల్ల ' వేంకట నగాధి పతి పదముల యందు సమర్పించినవాఁడు మంచెళ్ళ కృష్ణ కవి. ప్రధానతః విష్ణు పారమ్య ప్రబోధక మైనది వరద రాజ శతకము. విష్ణుని దశావతారములతో పాటు కృష్ణుని గూడఁ గలిపి, అతని రాస క్రీడను వర్ణించినాఁడు కృష్ణ కవి యీ శతకము నందు హరునిఁ గృతార్థుఁ జేసి, యబ్జజునిం ఘను జేసి, గరుడునిపై వసించి, వర కౌస్తుభ హారము దాల్చి, గట్టి బంగరు వలువన్ ధరించి, సొబ గైన కిరీటము నుంచి, చక్రమున్ దరము నమర్చి, దేవరాయఁ డైనట్టి మందర ధర కుంద సుందర రదుఁ డైన వరదుండు, ముర దానవాంతకుఁడే మంచెళ్ళ కృష్ణ కవి సర్వస్వము.

— — — నీ పదాబ్జమే
యిర వని నమ్మినాడ మది నిష్ఠము చేసుక పోవు మయ్య —'యనియే

మంచెళ్ళ కృష్ణ కవి యొక్క ప్రార్థన.

## రమణప్ప కవి రచనలు

'వేంకట రమణా !' యను మకుటముతో వేంకట రమణ శతకమును, 'విష్ణు సర్వోత్తమా ! యను మకుటముతో విష్ణు సర్వోత్తమ శతకమును' 'హరి చింతారతి మానసుఁ'డయిన పత్రి రమణప్ప కవి రచించినాఁడు విష్ణుని యొక్క మాహాత్మ్యమును, సర్వోత్తమత్వమును ప్రతిపాదించునవియే పయి వేంకట రమణ, విష్ణు సర్వోత్తమ శతకములు రెండును గూడ

'కల కాలంబు మదీయ మానసమునన్ గంజాక్ష నీ పాదపున్
నలినంబుల్ చెదఁబాయకుండ భగవన్నామంబు చింతింపఁగా
విలసద్భవ్య కటాక్ష వీక్షణమునన్ వేగంబె నీ దాసునిన్
జలనం బందఁగ నీక ప్రోవు విష్ణు' మని, సర్వోత్తముఁడైన విష్ణుని తదేకముగాఁ బ్రార్థించినవాఁడు పత్రి రమణప్ప కవి.

## రమాధీశ్వర శతకము

శ్రీ రామానుజ దేశికోత్తమ మహా సిద్ధాంత మార్గ క్రియా సాచాచార విశేష తీర్థ తనుఁడై, స్వాంతములో క్రూరత్వము శమించిన విశిష్టాద్వైతి నాగేంద్ర కవి - 'గోవిందా ! రమాధీశ్వరా !' యను మకుటముతో విష్ణువు యొక్క గుణ మాహాత్మ్యముల స్తుతించుచు, రమాధీశ్వర శతకమును రచించినాఁడు నాగేంద్ర కవి - భగవత్సంబంధ దీక్షాంగి, జి య్యాళ్వారి మహా ప్రబంధ శ్రీ సూక్తి యందుఁ దెలినవాఁడు, విష్ణు చిహ్నములను ధరించిన వాఁడు, ప్రపన్నుల యెడ వియ్యమైన చూపు కలవాఁడు

## రామచంద్ర కవి రచనలు

నిగ్రహానుగ్రహ సమర్థుఁడైన దిట్టకవి రామ చంద్ర కవి - '.... మద్దాలి యుద్దండ రాయ జయశ్రీ సువిధేయ ! భక్త జన

గేయా! నిత్య భాగ్యోదయా! యను మకుటముతో గొట్టు ముక్కల రాజ గోపాల శతకమును, '... రఘు కుల తిలక! నిటల దలకా!' యను మకుటముతో రఘు కుల తిలక శతకమును రచించినాఁడు. కిందటి జన్మ జన్మముల నినున్ బ్రార్థింపలే నైతి త్రి జగ త్ప్రాజ్యము లైన నీ పదము లర్థిన్ సేవఁ గావింతు. ని న్భజియింతు న్నిరతంబు మ్రొక్కుదు మదిం భావించి కీర్తింతు, 'త్వా మంతరేణ న హి శరణం మే' యని విష్ణువునే తన సర్వస్వముగ భావించినవాఁడు రామ చంద్ర కవి. ఆయన నోటికి రామాభిధానము 'తేనై, చెఱకై, యనంటి తెఱఁగై, తెఱయై' ఆనంద మొసఁగినది.

## త్యా గ రా జు ర చ న లు

రామ భక్తి సామ్రాజ్యమున మకుటము లేని మహా రాజు త్యాగ రాజు. ఈయన యిరువది నాలుగు వందల కీర్తనలను రచించి నాఁ డని ప్రసిద్ధి. వానియం దిప్పుడు సుమా రైదు వందల కీర్తనలు మాత్రమే లభించుచున్నవి త్యాగరాజు - కీర్తనలనే కాక, శ్రీకృష్ణుఁడు గోపికలతో నౌకా విహారము చేసిన కథను దీసికొని, ప్రహ్లాద విజయ మను యక్ష గానమును రచించినాఁడు రామ భక్తిలోఁ బుట్టి, రామ భక్తిలో జీవించి, రామ భక్తిలో లీన మైన రామ భక్త మూర్తి త్యాగయ్య.

## ప రి శి ష్ట ర చ న లు

ఆంధ్ర కవి రామయ్య విష్ణు కాంచీ మాహాత్మ్యమును రచించి నాఁడు. అందలి కొన్ని పద్యములు మాత్రమే నేఁడు లభించుచున్నవి. వేంకటేశ్వరా! యను మకుటముతో తిరుపతి వేంకటేశ్వర స్వామిని

స్తుతించుచు, నలువది పంచ చామరలను రచించినాఁడు సామ యోగి. కొండశ్రీవేటి రామానుజాచార్యులు 'ఆంధ్ర తిరువాయి మొడి' యను గ్రంథమును రచించినట్లు తెలియుచున్నది కాని, అది యింతవఱకు లభింప లేదు 'యతిపతీ హనుమ ద్గిరి రాజ మందిరా !' యను మకుట ముతో విశిష్టాద్వైత మత ప్రబోధక మగు నొక శతకమును రచియించి యున్నాఁడు తిరువేంకటాచార్యులు కులశేఖరాళ్వారుల చరిత్రను 'విష్ణు భక్తి సుధాకర' మను పేరుతో నొక ప్రబంధమును రచించినాఁడు పూసపాటి విజయ రామ రాజు 'రాధా కృష్ణ విలాస' మను పేర జయ దేవుని గీత గోవిందము నాంధ్రీకరించినాఁడు కృష్ణ దాస కవి. శకుంతలా పరిణయమును రచించిన కృష్ణ కవి, రామానుజ పాద పద్మ యుగళీ నానన్యాన్వయ ధ్యాన పావన హృ ద్భాగవతావతంస పద సేవాసక్త చిత్తుఁడు.

శ్రీరంగ మాహాత్మ్యమును వచనములోఁ జెప్పినాఁడు విజయ రంగ చొక్క నాథుఁడు విష పురాణమును, రామాయణ సుందరా కాండమును వచనములో నాంధ్రీకరించినాఁడు - తుపాకుల అనంత భూపాలుఁడు పరమ భాగవత చరిత్రమును, హరి కథా సుధా రసమును రచించినాఁడు శ్రీ కృష్ణ పాదార్చన జనిత లస త్కవితా చాతుర్య గుణాఢ్యుఁ డైన అలూరి కుప్పన కవి. ద్రావిడ భాష యందు గోదా దేవి రచించిన 'తిరు ప్పావై' ప్రబంధమున కనువాద రూప మైన సప్త పదులను రచించినది ముద్దు పళని పరమ భాగవత చరిత్రను రచించినాఁడు శృంగార కవి తిరుమలనాథ కవి. సంస్కృత ములో నారాయణ తీర్థులు రచించిన కృష్ణ లీలా తరంగిణిని 'ఆంధ్రాష్ట పది' యను పేరను, యథా శ్లోక తాత్పర్య రామాయణము నందలి కిష్కింధా కాండమును కామ సముద్రము అప్పలాచార్యులు, రంగ

నాథుని భక్తుఁ డైన ముద్దు రంగ చొక్క నాథుఁడు శ్రీ రంగ మాహాత్మ్యమును గూర్చి యొక గ్రంథమును రచించినట్లు తెలియు చున్నది.

పై గ్రంథములే గాక, ప్రాచీనాంధ్ర వాఙ్మయ మహోదధిలో అన్వేషించిన కొలదియు ఇట్టి గ్రంథము లనేకములు కానవచ్చును

19, 20 శతాబ్దము లందును వైష్ణవ మత ప్రభావము విశేషముగా గల కావ్యములు, ప్రబంధములు, నాటకములు, యక్ష గానములు, శతకములు మున్నగున వెన్నియో వచ్చి యున్నవి



# సవరణ పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 7 | శ్రియుత | శ్రీయుత |
| ,, | 15 | నివు | నీవు |
| 4 | 2,3 | నిచిక | పీచిక |
| ,, | 6 | కదమ్ము | కందమ్ము |
| 7 | 7 | తారావిధి | తారావీథి |
| 8 | 7 | శ్రేన్ | శ్రేణిన్ |
| 13 | 4 | విశెష | విశేష |
| 14 | 15 | స్పష్టిక | స్ఫటిక |
| 28 | 2 | లభించి | లసించి |
| 29 | 12 | నవనీవత | నవనీత |
| 33 | 7 | రమ్యంబునె | రమ్యంబునై |
| ,, | 15 | పెటికలు | పేటికలు |
| 37 | 4 | నెడు | నేడు |
| 39 | 16 | నిగళము | నీ గళము |
| 40 | 9 | విని | వీని |
| 42 | 6 | విష్ణునును | విష్ణువును |
| 49 | 5 | సమ్మతిచు | సమ్మతము |
| 52 | 8 | పట్టి | పట్టు |
| ,, | 10 | సుద్రాబ | సద్రాబ |
| 55 | 20 | భితాః | భీతాః |
| 55 | 20 | అక్షష్టారీ | అష్టాక్షరీ |
| 64 | 7 | ధీశేచ్చ | ధీశేశ్చ |
| ,, | 15 | డయ్యెనెని | డయ్యనేని |
| 68 | 4,5 | కోధానము | కోపధానము |
| 69 | 23 | విహీంచు | విహీను |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 71 | 22 | శకి | శక్తి |
| 77 | 3 | సిద్దించు | సిద్ధించు |
| 79 | 13 | అనెక | అనేక |
| 80 | 9 | కేగెను | కేగెను. |
| 81 | 7,8 | భగవానుఁడు | బగవానుఁడు |
| ,, | 13 | ని విచ్చిన | నీ విచ్చిన |
| 82 | 21 | విషువును | విష్ణువును |
| ,, | [illegible] | భావమును | భావమును |
| [illegible] | 8 | ప్రసన్న | ప్రపన్న |
| ,, | 23 | ప్రసన్నా | ప్రపన్నా |
| ,, | 23 | చున్నది | చున్నది. |
| 85 | 15 | వైష్ణవము | వైష్ణవము. |
| 87 | 10 | పరిశీలింపుడు | పరిశీలింపుడు |
| 90 | 13 | వశము | వంశము |
| ,, | 19 | శృగార | శృంగార |
| ,, | 20 | వర్ణించాడు | వర్ణించినాడు |
| 91 | 9 | నుండదు | నుండదు |
| 92 | 19 | బోవును | బోవును |
| 94 | 14 | చిన్నన్న | చిన్నన్న. |
| ,, | 18 | చున్నది | చున్నది |
| ,, | 20 | కృషుడు | కృష్ణుడు |
| 96 | 1 | కిర్తి | కీర్తి |
| 98 | 12 | ధ్యానబు | ధ్యానంబు |
| ,, | 15 | చెగటు | చెంగటు |
| 99 | 13 | విచితుడ | విచిత్రుడ |
| 101 | 14 | విష్ణా | విష్ణు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 104 | 4 | గనిపి ంచును | గనిపించును |
| 105 | 12 | లందను | లం[illegible] |
| ,, | 24 | విలి | [illegible]జి |
| ,, | 17 | షువిని | విష్ణుని |
| 108 | ,, | హేమశుడు | మహేశుడు |
| ,, | ,, | విశిహ్వా | విశిష్టా |
| ,, | 20 | ప్రజలతో | ప్రజాలతో |
| ,, | , | నెరుగ | నెగ[illegible] |
| 109 | 15 | గాదు | గాదు. |
| ,, | 17 | రచియించినద | రచియించినది |
| 114 | 25 | తి టు | తినుటు |
| 116 | 24 | చిత పుని | చిత్రగుప్తుని |
| 119 | 22 | గ్రంధమును | గ్రంధమును |
| 122 | 14 | యమె | యామె |
| 123 | 18 | సవ్ద్రమును | సముద్రమును |
| 126 | 8 | శ్రి | శ్రీ |
| 127 | 12 | నారదడు | నారదుఁడు. |
| 132 | 1 | కిర్తి | కీర్తి |
| 133 | 4 | విషు | విష్ణు |
| 135 | 23 | ద్వారక, | ద్వారక |
| ,, | 25 | విషు | విష్ణు |
| 139 | 21 | శృగార | శృంగార |
| 142 | 8 | దుష | దుష్ట |
| 143 | 23 | శౌయి | శౌరి |
| 147 | 18 | వేసినాడు | వేసినాడు |
| 152 | 24 | జాలరులను | జారులను |
| 162 | 14 | నున్నది | నున్నది. |
| ,, | 15 | విర | వీర |

—•—

శ్రీ రామానుజ కీర్తి కౌముది

నాల్గవ భాగములో

# రానున్న రచనలు

★



—౧—

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

ఈ మహా గ్రంథము శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వముగా - 16 భాగములలో వెలువడుచున్నది.

ఒక్కొక్క భాగములో ఒక్కొక్క కళ. ఒక్కొక్క భాగములో ఒక్కొక్క విశిష్టత

ఇప్పటికి 8 భాగములు వెలువడి, పండిత ప్రశంసలకు పాత్రము లైనవి.

మొదటి భాగము మా పర్యవేక్షణమున, తిరుమల తిరుపతి దేవస్థానముల పక్షమున వెలువడి, టి. టి. డి. సమాచార కేంద్రము లలో లభ్యమగుచున్నది

మే మిప్పటికి మా గ్రంథమాల ద్వారా 2, 8 భాగములు వెలువరించియున్నాము.

ఒక్కొక్క భాగము వెల రు. 20/= వి. పి పద్ధతి లేదు. రు. 24/= ముందుగా పంపినవారికి, వారు కోరిన భాగమును Regd Book Post ద్వారా పంపగలము

ఒకే సారి రెండు భాగములు కోరువారు - రు. 45/- పంపవలెను.

2 - వ భాగమునుండి 16 - వ భాగము వరకు మొత్తము 16 భాగములు కోరువారు, మా గ్రంథమాలలో వెంటనే సభ్యులుగా చేరుట మేలు.

## సభ్యత్వ వివరములు

| | |
|---|---|
| మహా రాజ పోషకులు | రు 1,116 |
| రాజ పోషకులు | 516 |
| పోషకులు | 258 |

మహా రాజ పోషకుల జీవిత విశేషములు, చాయా చిత్రములు ఒక భాగమున ప్రకటింపగలము

రాజ పోషకుల ఛాయా చిత్రములు ఒక భాగమున ప్రకటింపగలము.

పోషకుల నామధేయములు ఒక భాగమున ప్రకటింపగలము.

పర స్థానీయు లగు పోషక సభ్యులు - మేము వరుస వరుసగా పంపుచుండు సంపుటములకు పోస్టు ఖర్చులు భరింపవలసి యుండును.

ప్రస్తుతము మేము సంవత్సరమునకు 2 భాగముల చొప్పున మాత్రము వెలువరింపగల్గుచున్నాము.

పై రీతిగా మా గ్రంథమాలలో సహృదయులగువారు సభ్యులుగా చేరుట మూలమున సహకరించినయెడల, సంవత్సరమునకు 3 భాగముల చొప్పున వెలువరించుటకు యత్నింపగలము

**ఉత్తర ప్రత్యుత్తరములకు -**

ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు

**శ్రీ లక్ష్మీ నారాయణ పురము**

గుంటూరు - 6